# తన దైనందిన జీవితంలో ఆ ఆనందదాయకమైన క్షణాల కోసం ఆయన తయారుగా ఉన్నారు.



ఆయనకి ఆఫీసులో చెప్పలేనంత మానసిక ఒత్తిడితో క్షణం తీరికలేని పనితో రోజంత గడిచింది. అయినా, అలా కనపడటం లేదు. పిల్లలతో సమానంగా చెప్పలేనంత ఉత్సాహం ఆయనలో క[illegible]

అదంతా మీ చలవే. పుష్టినిచ్చే కప్పుడు హార్లిక్స్ యిచ్చి, రోజంతా ఆయనకు కావలసిన బలం సత్తువ లభించేటట్టు మీరు జాగ్రత్త పడుతున్నారు.



"బలం, సత్తువ, సౌఖ్యం కోసం కావలసిన కీలకమైన పోషకాలు హార్లిక్స్‌లో ఉన్నాయి-
ప్రొటీన్స్, విటమిన్స్, మినరల్స్, కార్బొహైడ్రేట్స్.

హార్లిక్స్ మంచితనం అంటే అదే. రోజంతా మూర్తీభవించిన ఆరోగ్యంలా ఉండేందుకు."




## మంచి పుష్టికరమైనది

HTA 6224TEL

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

విడిప్రతి వెల నాలుగు రూపాయలు!

సంపుటం-82 | స్థాపితం 1908 బొంబాయి : 1914 మద్రాసు | సంచిక 27

వ్యవస్థాపకులు : దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు

(1938-1972 సంపాదకులు : శివలెంక శంభుప్రసాద్)

ఆంధ్రపత్రిక ప్రెస్, గాంధీనగరం, విజయవాడ-3, ఫోన్లు : 75667, 61247, 61248

# మనలోమాట

ఉత్తర అమెరికా తెలుగు సంఘం 'టానా-' ఆంధ్ర సచిత్రవారపత్రికల సంయుక్త సాహితీ సంబరం పేరిట మేము నిర్వహించిన కవితల పోటీలో యువ కవులు యెందరో ఉత్సాహంగా పాల్గొన్నారు. అదే విధంగా మినీ కథల పోటీకికూడా కథలు, గల్పికలు చాలానే వచ్చాయి. ఈ పోటీ ఫలితాలను యిక్కడ యిస్తున్నాము-

కవితల పోటీలో ఈ క్రిందివారు బహుమతులను గెల్చుకున్నారు.

* దారితప్పిన జనావళి! -శ్రీ అడిగోపుల వెంకటరత్నం
* అమ్మ! -శ్రీ శింగరాజు శ్రీనివాసరావు
* వాన నీళ్లు -శ్రీ ఆర్. వి. చలపతి
* నైజం -శ్రీ ఎన్.కె. నాగేశ్వరరావు
* బాధ -శ్రీ కె. పవన్‌కుమార్
* బహుపరాక్!బహుపరాక్!! -శ్రీ సాహితి
* నువ్వు ఉత్తమనిషి వే! -శ్రీమతి లక్ష్మీకమలాకర్
* కలల కౌగిళ్లు -శ్రీకొడిమెలశ్రీరామమూర్తి

వీరందరికీ మా అభినందనలు. త్వరలోనే వీటి ప్రచురణ జరుగుతుంది.

మినీ కథల పోటీలో ఎంపికైన ఏడు కథలు యిలా వున్నాయి:

* అగ్రిమెంటు -శ్రీ అవధానుల సుధాకరరావు
* విశ్వసందర్శనం -ప్రొఫెసర్ వి. లక్ష్మణరావు
* మందు -శ్రీమతి యర్రమిల్లివిజయలక్ష్మి
* యూ షటప్! -"సోమయాజుల సోదరులు"
* కథ -శ్రీదంతుర్తి చినరామచంద్రరావు
* వాడే వీడా? -శ్రీ ఉత్పల వరదరాజా
* సోడాబుడ్డిరోయ్! -శ్రీ నందిగామ మురళీకృష్ణ

వీరందరికీ కూడా మా శుభాకాంక్షలు!

కాగా కథల పోటీ ఫలితాలు, బహుమతి పొందిన నవలిక ఫలితాలు అతి త్వరలోనే వెల్లడిస్తాం. వీటి పరిశీలన యింకా పూర్తి కాలేదు.

ఈ పోటీలో పాల్గొన్న వారందరికీ 'టానా' తరపున- ఆంధ్రసచిత్ర వారపత్రిక తరపున శుభాకాంక్షలు.

బహుమతులు పొందిన రచయితలందరికీ ఉత్తరాలు వ్రాస్తున్నాం. వారి జీవిత విశేషాలు, ఫొటో కూడా వెంటనే పంపమని కోరుతున్నాం.



ముఖ చిత్రం :

అందాలనటి

"జుహీ చావ్లా"

(ఫొటో: జగ్‌మోహన్)

పైవారమే

మనీలాలో "చెత్త" మనుష్యులు

# పదండి లోపలికి!

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్!

ఆంధ్ర సచిత్ర వార పత్రిక

ఎడిటోరియల్ అడ్వయిజర్: శివలెంక రాధాకృష్ణ   ఎడిటర్: వీరాజీ   ముద్రాపకుడు: ప్రచురణకర్త: శివలెంక నాగేశ్వరరావు

విజయవాడ   23-2-1990   శక. సం. 1911 ఫాల్గుణ మాసం 4 వ తేది

# "పార్టీ నిరంకుశత్వానికి" ఆఖరి ఘడియలు!

'బోల్షవిక్ విప్లవం' తరువాత ఏడు దశాబ్దాలు గడిచిపోయాయి. లెనిన్ మహాశయుడు తీర్చిదిద్దిన 'సోవియెట్ యూనియన్' దేశాల్లో పరిశుభ్రమైన గాలి, వెలుతురు, నీరు అనుభవిస్తూ క్రమశిక్షణాయుత 'మూస' జీవితాన్ని గడుపుతూ హాయిగా ఉన్నారని మనమంతా అనుకునే సోవియెట్ యూనియన్ ప్రజలలో ఏదో చెప్పరాని వెలితి, ఏమిటో తెలియని ఆరాటం, 'స్టాలిన్ నియంత' పాలననాటి నుంచి తరువాత 'మిహాయిల్ గోర్బచేవ్' వచ్చేలోగా 'చాపక్రింద నీరు'లాగా విస్తరించిపోయిందని యిటీవల కాలందాకా బయటి ప్రపంచానికి 'ఇనుప తెర' కారణంగా స్పష్టంగా తెలియలేదు. పెట్టుబడిదారీ వ్యవస్థకి పరాకాష్ఠగా అభివర్ణింపబడే అమెరికా దేశంలోను, కార్మిక సంక్షేమ కమ్యూనిస్ట్ రాజ్యానికి ప్రతీక అయిన 'రష్యా'లోను కూడా శాస్త్ర సాంకేతిక రంగాలలో ప్రగతి, మారణాయుధాల నిర్మాణ కౌశల్యంలో పోటాపోటీ ఏకధాటిగా, 'ఎవరు మిన్న?' అన్న పద్ధతిలో సమ ఉజ్జీలుగా ఎదిగి రావడంతో- చాలా కాలంగా సోవియెట్ యూనియన్ ప్రజలలో అమెరికా మున్నగు పాశ్చాత్య రాజ్యాలలో వున్న కమ్మని స్వర్గతుల్యమైన విలాసజీవనం తాముకోల్పోతున్నామనే అనుమానం వుంది- అట్టి అసంతృప్తి, నైసర్గిక, స్వాభావిక వైరుధ్యం, వైవిధ్యంగల అనేక జాతుల సమ్మేళనమైన సోవియెట్ యూనియన్ రిపబ్లిక్ రాజ్యాలలోని ప్రజలలో రగులుతూ వచ్చిందని మిహాయిల్ గోర్బచేవ్‌గారి పారదర్శక 'గాజు తెర'లో నుంచి చూసే బయట ప్రపంచానికి యిప్పుడిప్పుడు అనిపిస్తున్నది!

ఒక వంక వ్యక్తిపూజ, మరొక వంక 'బోల్షవిక్' విప్లవం రాక ముందు వుండే మాదిరి [పార్టీ] పెత్తందారీ పోకడ రష్యన్ రైతుల్లోను, కార్మిక వర్గాల్లోను కొంచెం కొంచెంగానూ, 'యింటెల్ జెన్షియా'గా పిలువబడే యితర మేధావి వర్గాలలో అంచెలంచెలుగాను ప్రజాస్వామ్యసిద్ధాంతంవైపు మళ్లించసాగింది! 'ప్రయివేట్ లైఫ్' వేపు ప్రాకసాగింది.

ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం నాటికీ- రష్యన్ మానవుడు అంతరిక్షంలో నడక సాగించిన నాటికీ- మధ్య కాలంలో ప్రపంచ వ్యాప్తంగా- ప్రత్యేకించి రష్యాలో సుత్తి కొడవలి, చక్రం పెంపొందించిన 'పారిశ్రామికవిప్లవం' కన్నా క్రొత్తరకమైనట్టి సుతిమెత్తని 'కంప్యూటర్ చైతన్యం' ప్రపంచం గతినే, మార్చివేసింది. రష్యాలో వున్న కర్షక, కార్మిక, శ్రామిక, మేధావి వర్గాల మధ్య ఒక రకమైన గోడలు కరిగిపోవడం ప్రారంభించాయి. సంఘం చేత, సమిష్టి ఆధీనంలో వుండవలసిన, 'అధికార దండం' 'సుప్రీం సోవియెట్'పేర తిరుగులేని అధికారం చెలాయించే కొంచెం మంది వ్యక్తుల చేతిలోకి వెళ్ళిపోయింది! 'పార్టీ కేంద్ర కమిటీ' పేరిట చక్రం త్రిప్పే సర్వాధికారిగా కార్యదర్శి ఏకఛత్రాధిపతి అయిపోయినాడు. కాని ప్రజల అవసరాలు మారాయి! దృక్పథం మారింది! తరం మారింది!! కొంతకాలం క్రితం సమాజ వికాసం కోసం దరిద్రం నిరుద్యోగంలాటి అసమానతలను రూపుమాపడంకోసం తమ రెక్కలు కత్తిరించినా కిమ్మనకుండా వున్న బుద్ధి జీవులు మళ్ళీ రెక్కలెదిగిన తరువాత వాటి రెపరెపలకు అడ్డు తగులుతున్న ఇనుప పంజరం కటకటాలు ఏవో దాటిపోవాలనే 'భావోద్రేకా'నికి లోనయిపోతూ వచ్చారు!

సువిశాల సోవియెట్ యూనియన్ దేశంలో యిటు అజర్‌బైజాన్ నుంచి అటు 'లాత్వియా' దాకా రెండు ఖండాలను కొండచిలువలాగా పెనవేసుకుని వున్న ఏకపార్టీ పరిపాలనా వ్యతిరేకత భూకంపంలాగా కదలడం ప్రారంభించింది. కనుకనే అతి విస్మయ, విపత్కర, సందిగ్ధ మలుపు దగ్గర దేశాధికారాన్ని తన భుజస్కంధాలపై పెట్టుకున్న శ్రీ మిహాయిల్ గోర్బచేవ్- ఒక 'కాలాతీత వ్యక్తి'గా కాక కాలానుగుణమైన పంథాని అనుసరించి పరిస్థితి ప్రేలిపోకుండా వుండడం కోసం- కిటికీలు, తలుపులు తెరిచినట్లు 'గ్లాస్‌నోస్త్,' పెరిస్త్రోయికా వంటి తరుణోపాయాలను ప్రయోగించారు.

డెబ్బై సంవత్సరాల కాలం- మెట్టు మెట్టుగా గట్టిగా కట్టబడ్డ కమ్యూనిస్ట్ పార్టీ పాలన డెబ్బై గంటల కాలంలో నేలమట్టమైన సంగతి రుమేనియాలో చూశాం! అంతకు ముందే పోలెండ్, జెకొస్లోవేకియా, తూర్పు జర్మనీ లాంటి దేశాలలోని ప్రజలు ప్రభుత్వాల మీద తిరగబడ్డ దృశ్యాలు అనేకం చూసిన తరువాత సువిశాల సోవియెట్ రాజ్యంలో పరిస్థితి చేజారిపోకుండా శ్రీ గోర్బచేవ్ చేస్తున్న నిరంతర కృషి మనకి అర్థం అవుతున్నది. అది ఎంతటిదో యిటీవల తూర్పు యిరోపాలో వచ్చిన మార్పుల దృష్టితో అంచనా వేస్తే తప్ప మనం గ్రహించలేం.

పార్టీ కార్యదర్శిగా కాక, దేశాధ్యక్షుని హోదాల్లో పరిస్థితులను చక్కబెట్టవచ్చుని శ్రీ గోర్బచేవ్ సుప్రీం సోవియెట్‌లో తెచ్చిన అనేకానేక సంస్కరణలు రెండు చేతులు జాచి ఆహ్వానించవలసినవే కానీ సామ్యవాద వ్యతిరేకము, కార్మిక సంక్షేమ రాజ్య విద్రోహము అనుకోవడానికి వీలు లేనివి. పార్టీ కూడా వాస్తవాన్ని చూడగలుగుతున్నది. ప్రజాస్వామ్యానికి, బహుళపార్టీ వ్యవస్థకి పరుగులు తీస్తున్న సోవియెట్ యూనియన్ ప్రగతిరథం చక్రాలు యిప్పుడిక ఆగవు! కాలమెంత చెడ్డదో అంత గొప్పది. ఎంత గొప్పదో అంత మంచిది. పార్టీ గుత్తాధిపత్య పెత్తందారీ వ్యవస్థకి ఉద్వాసన చెప్పి మరింత స్వేచ్ఛ, మరింత ప్రజాబాహుళ్య భాగస్వామ్యం, అన్ని వర్గాల వారికి కష్టం కలగని నవీన మార్గం యివాళ సోవియెట్ యూనియన్ ప్రజలు కోరుతున్నారు. పటిష్టమైన ఆర్థిక వ్యవస్థ, స్ఫటికంలాంటి ప్రజా ప్రవర్తనా వ్యవస్థ, సువిశాలమైన సోవియెట్ యూనియన్‌లో వున్నాయి. ఈ రెండూ చెడిపోకుండా రాజీమార్గాన, మధ్యేమార్గాన దేశాన్ని 21వ శతాబ్దంలోనికి తీసుకుపోగల శక్తి మిహాయిల్ గోర్బచేవ్‌గారికి ఆయన్ని బలపరిచే వర్గాలకి పుష్కలంగా లభించాలని అందరూ ఆశించాలి! ప్రజల కోసం 'పార్టీ'యేగాని పార్టీ కోసం ప్రజలు కారు! ○



# సూర్యుడు 'దక్షిణాన' ఉదయించిన వేళ



జైలునుంచి విడుదలైన తరువాత సతీమణితో నెల్సన్ మండేలా

ఆఫ్రికన్ నేషనలిస్ట్ లీడర్ మండే గుండెల నెల్సన్ మండేలా ఫిబ్రవరి 11 సన్‌డే నాడు- 27 సంవత్సరాల సుదీర్ఘ కారాగృహ వాసానంతరం వెల్తుర్లోకి స్వేచ్ఛా ప్రపంచంలోకి వర్ణవిచక్షణ అనే దారుణ దాష్టీకాన్ని తన బలమైన బరువైన పెద్ద పెద్ద అడుగుల క్రింద అణగద్రొక్కుతున్నట్లు భారంగా వేస్తూ భార్య-'విన్నీ మండేలా' తోడు రాగా కారు దగ్గరకి వచ్చి 'కేప్ టౌన్'కి పయనం అవుతున్నప్పుడు ప్రపంచ వ్యాప్తంగా హర్షాతిరేక జయజయధ్వానాలు చెలరేగాయి. భారత ప్రధానమంత్రి దేశప్రజల తరఫున 'నెల్సన్'ని 'మహాత్మాగాంధీ' పుట్టిన మనదేశానికి రమ్మని ఆహ్వానించడం ఎంతో సబబైన పని. ఇంతకు ముందే అమెరికా అధ్యక్షుడు, శ్రీ మండేలాను 'వైట్‌హౌస్'కి రమ్మని ఆహ్వానం పంపించారు. సౌత్ ఆఫ్రికా అధ్యక్షుడు 'ఎఫ్. డబ్ల్యు. డిక్లార్క్' తీసుకున్న యీ చరిత్రాత్మక నిర్ణయాన్ని హర్షిస్తూ బ్రిటిష్‌ప్రధాన మంత్రి శ్రీమతి 'మార్గరెట్ థాచర్' దక్షిణాఫ్రికా మీద విధించిన కొన్ని ఆంక్షలను అప్పటికప్పుడు రద్దుచేశారు. నలుపు, తెలుపుల మేలు కలయికగా దక్షిణాఫ్రికా బంగారు భూమి ఒక నవీనశకానికి నడుం కట్టి ముందుకు దారితీస్తుందని ప్రపంచం అంతా ఆశిస్తోంది.

## రాముడు లేనిదెక్కడ?

రామజన్మ భూమి బాబ్రీ మసీదు రగడ మళ్లీ పాములవాడు-త్రాచుపాము పడగమీద నొక్కి బుట్టలో పెట్టేసినట్టు మరో నాలుగన్నర మాసాల పాటు వాయిదా పడ్డది. దేశంలో అన్ని మతాలవారు ఇందుకు సంతోషించారు. పార్లమెంట్ ఎన్నికల ముందు యిదే వివాదం ఆధారంగా ఒక రాజకీయ పార్టీ 'తంతే బూర్లగంపలో పడ్డట్టు' ఒక్కసారిగా 88 పార్లమెంట్ సీట్లు చేజిక్కించుకొని ఫ్రంట్ గవర్నమెంట్ పిలక తన చేతిలో పట్టుకొని కూర్చోగలిగింది. పార్లమెంట్ ఎన్నికల ముందు గత నవంబర్‌లో ఎంత డ్రామా జరిగిందో యిప్పుడు ఉత్తరాది రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికల ముందు కూడా అంత నాటకం ఆడబడ్డది! "ఎక్కమంటే ఎద్దుకి కోపం-దిగమంటే శివుడికి కోపం" అన్న తీరున వున్న యీ దేవాలయం - మసీదుల తగాదా రాజకీయ పక్షాలచేతుల్లో ఒక పాచికలాట అయిపోయింది. ఇంతకీ రాముడు యిక్కడ పుట్టలేదని కొందరు-అసలు పుట్టనేలేదని మరికొందరూ వాదిస్తూ వుండగా కౌసల్యాదేవి పురిటిగదిని కూడా చూపిస్తామని బయలుదేరారు మరికొందరు. 'బాబర్' గారు ఇక్కడ మసీదు కట్టారు అన్నదానికి కూడా నిఖార్సయిన ఆధారాలు లేవని ఎందరో చరిత్రకారులు అంటున్నారు. రాముడు యజ్ఞకుండంలో నుంచి లభించిన పాయసం వల్ల పుట్టాడని 'వాల్మీకి' గారు వ్రాశాడు. మరి దశరథుడు యజ్ఞం చేసిన ఆయజ్ఞకుండం ఈ 'అయోధ్య'లో ఎక్కడుందో? విశ్వహిందూ పరిషత్ వారికి బి. జె. పి. వారికి, బాగా తెలిసి వుండాలి. రాముడు ఎక్కడ పుట్టినా పుట్టకపోయినా అతని నామధేయం మాత్రం హిందువులందరి హృదయాల్లోనూ నిత్యసత్యమై నిత్యనూతనమై నిఖిల కాంతియై విరాజిల్లుతునే వుంది. దివ్యమంగళమూర్తి



శ్రీ రామచంద్రమూర్తిని మహాభక్తుడు రామదాసు, సంత్ కబీరుదాసు భారతస్వాతంత్ర్య ప్రదాత మహాత్మాగాంధీజీ వీరంతా కూడా మనసారా చూసి నోరారా కీర్తించిన వారే. రాముడెక్కడ పుట్టినా సీతాన్వేషణలో దేశమంతా తిరిగి ఆసేతు హిమ నగము సందర్శించిన వాడే. గ్రామగ్రామాన వెలిసిన రామమందిరాలలో సీతారామలక్ష్మణ భరత శత్రుఘ్న సమేతుడైన శ్రీరాముడు ఆంజనేయ సహితుడై నిత్యహారతులందుకుంటున్నాడు. కానీ రామజన్మ భూమి - బాబ్రీ మసీదు వివాదం మాత్రం ఎన్నికలకే ఉపయోగపడుతోంది. రామజన్మ భూమి - బాబ్రీ మసీదు లాంటి వివాదాలు తలెత్తినపుడు ఆ ప్రాంతాన్ని యదాపూర్వస్థితిలో ఒక మ్యూజియంగా సర్వులకు సందర్శనీయ చారిత్రక స్థలంగా ఎందుకట్టే పెట్టకూడదూ? ఉభయవర్గాలు కూడా పట్టువిడుపు ప్రదర్శించి ఉభయ తారకమైన ఒక ఒప్పందానికి వచ్చే విధంగా యీ నాలుగు మాసాల కాలంలో చిత్తశుద్ధిగల ప్రయత్నాలు జరుగుతాయని ఆ రాముడు మీద ఈ 'అల్లా' మీద భారం వేసి ఊరుకోవడం కన్నా మనలాంటి 'నాన్‌పొలిటికల్ స్టఫ్' ఏంచేయగలదు?



## క్రిందపడ్డా మీదవాణ్ణే

ఒక మహాపర్వతం కూలిపోయినట్టు, ఒక పెనువృక్షం కూకటివేళ్లతో పెకలింపబడ్డట్టు పదో రౌండులో ప్రత్యర్థి యిచ్చిన పిడికిలి దెబ్బకు వరల్డ్ హెవీవెయిట్ ఛాంపియన్ 'మైటీటైసన్' కుప్పకూలిపోయాడు. మండేలా విడుదలకి హర్షాతిరేకం వెలిబుచ్చుతున్న ప్రపంచం యీ వార్త విని ముక్కున వేలేసుకు వుండిపోయింది. మహాబలుడు, మహాకాయుడు, బాక్సింగ్ రింగ్‌లో ప్రత్యర్థుల రక్తపిపాసి, రింగ్‌కింగ్ అయిన మైక్‌టైసన్‌ని మట్టి కరిపించిన 'జేమ్స్ డగ్లస్' అసంభవం అనుకున్నదానిని సంభవంచేశాడు. కానీ 'మైక్‌టైసన్' అంతలోనే లేచి 'అసంభవం' అని అరిచాడు. 'జేమ్స్‌డగ్లస్' ఎనిమిదో రౌండులోనే తన పిడిగుద్దుకి 'భూమాతా! శరణు శరణు' మంటూ నేలకొరిగిపోగా 'రిఫరీ' మూడు సెకన్లు ఆలస్యంగా "అంకెలు. చిటికెలూ" మొదలెట్టాడని 'తొమ్మిది' అన్నతరువాత గానీ 'డగ్లస్' కాలు చెయ్యి కూడదీసుకోలేకపోయాడని అంచేత కౌంట్ డౌన్‌లోనే 'జేమ్స్' ఓడిపోయినట్టని టైసన్ పెడబొబ్బలు పెట్టాడు. ప్రపంచ బాక్సింగ్ సంఘాలు దీనిమీద విచారణ జరిపి తిరిగి యీ పోటీ నిర్వహిస్తామని చెప్పేసరికి 36 సార్లు అరివీర భయంకర విజేతగా హెవీవెయిట్ బాక్సింగ్ పోటీలు గెలుచుకున్న 'మైటీమైక్'కి యిది పెద్దషాక్! 36 సార్లలో 33 నాకౌట్లు అతని 'క్రెడిట్'లో వున్నాయి. నిజంగా 'డగ్లస్ జేమ్స్' ఎంత నిరాశాంబుధిలో మునిగిపోయాడో పాపం!

డగ్లస్‌ను అలా వొదిలేసి ఉత్తరదిశగా 'ఫైజాబాద్' వైపు "ఈశ్వర్ అల్లా తేరే నామ్, వున్‌కో సన్మతిదే భగవాన్" అంటూ ఒక సందేశాన్ని విసిరి శలవు తీసుకుంటాను. చిన్నమాట - 'ఉన్‌కో అంటే బాబ్రీ మసీదు వారికి + రామజన్మ భూమి వారికి' అని కవి హృదయం!

*11-2-'90* *

రామజన్మభూమి - బాబ్రీ మసీదు



# సీరియల్
# ద్రౌపది
## ప్రయాగ రామకృష్ణ



(గత సంచిక తరువాయి)

**ఇంతవరకూ సాగినకథ:- 28** పాండవులు జూదంలో ఓడిపోయి పన్నెండేళ్లు అరణ్యవాసము, ఒక యేడు అజ్ఞాత వాసము పూర్తిచేసి తమకు అర్ధరాజ్యం ఇవ్వవలసిందిగా కృష్ణుడిని ధృతరాష్ట్రుడి వద్దకు రాయబారం పంపిస్తారు. కృష్ణుని సంధియత్నం విఫలమై యుద్ధం అనివార్యమవుతుంది. యుద్ధరంగంలో కౌరవ, పాండవులు భీకర యుద్ధానికి తలపడతారు. భీష్ముడి క్రోధాగ్నికి తాళలేని పాండవసేనలను చూసి పాండవులు కృష్ణుడి సలహాపై భీష్ముడి వద్దకు వెళ్తారు. భీష్ముడు తాను అస్త్ర సన్యాసం చేసే రహస్యాన్ని పాండవులకు తెలియజేస్తాడు.

మర్నాడు శిఖండిని ముందు పెట్టుకుని వచ్చారు పాండవులు. ఆ వేళ భీష్ముడి మీద మూడు క్రూరాస్త్రాలు వేశాడు శిఖండి.

'నువ్వు ఆడదానివి! నన్ను చంపడం కోసమే మగ వాణ్ణి చేశాడు దేవుడు నిన్ను. నువ్వు నా మీద కోటి బాణాలేసినా నీలాంటి దానితో యుద్ధం చెయ్యను నేను. నువ్వు బాణాలు వేస్తుంటే నాకు నవ్వొస్తోంది గాని కోపం రావడం లేదు' అన్నాడు భీష్ముడు నవ్వుతూ.

ఒళ్ళు మండిపోయింది శిఖండికి. మొహం ఉక్రోషంతో ఎర్రబడింది.

'ఔనౌను! చేతగానప్పుడు ఇలాంటి మాటలే వస్తాయి. అయినా నేనెవర్నయితే నీకేం అస్త్ర విద్యా పారంగతుడవన్న నీ పేరును ఈవేళ నేను బూడిదలో కలపక పోతే చూడు' అని మరో బాణం వేశాడు.

గాంగేయుడు తప్పించుకున్నాడు. కాని అది వెళ్ళి కౌరవ సైన్యాన్ని నాశనం చేసింది.

దుర్యోధనుడు కలవర పడ్డాడు. భీష్ముడిలో ఏదో మార్పు వచ్చిందని తెలుస్తూనే వుంది. అయితే అది ఎందువల్లో కారణం తెలియలేదు అతనికి.

'తాతా! నువ్వుండగా కూడా మన సైన్యం ఎందుకిలా దైన్యంగా పారిపోతోంది?' అని అడిగాడు భీష్ముణ్ణి.

ఆయన దుర్యోధనుడి మొహంలోకి చూస్తూ 'కారణాలు కావాలా?' అని అడిగాడు. దుర్యోధనుడు మాట్లాడలేదు. అతని మొహంలో అలజడి ఆందోళన కొట్టొచ్చినట్టు కనిపించాయి.

'.....పాండవ సేనలోని వేలాది మంది యోధుల్ని చంపుతానని నీకు మాటిచ్చాను. అది చెల్లించుకున్నాను. కాని ఈ వేళ ఎందుకో నాకు నా శక్తి తగ్గుతున్నట్టనిపిస్తోంది. నీ ప్రత్యర్థులు నైతికంగా ఎంత బలమైన వాళ్ళో తెలిసుండి కూడా నువ్విన్నాళ్ళూ నా మీద చూపిన ఆదరణకు నీ పక్షానే వుండి పోయాను. పాండవులు నా చేతుల్లో చస్తారని నేను అనుకోను. అయినా నీకోసం పోరాడుతాను' అని పాండవ సేన మీదికి దూకాడు భీష్ముడు.

శిఖండి నిస్సహాయంగా చూస్తుంటే 'భీష్ముడికి భయపడకు. నువ్వూ ఎదిరించు. నేనుండగా నువ్వు పారిపోవల్సిన పనిలేదు. నువ్వు ముందుంటే చాలు. వెనక నుంచి బాణాలు వేసి నేను పడగొడతానతన్ని' అన్నాడు అర్జునుడు.

ఆ మాటలు విన్నాక ధైర్యం వచ్చింది శిఖండికి. 'ప్రతిపక్షం విజృంభిస్తోంది. భీష్ముణ్ణి చుట్టి తరమండి' అని పెద్దగా అరిచాడు.

ధృష్టద్యుమ్నుడు అర్జునుడికీ, శిఖండికీ తోడయ్యాడు. అర్జునుడు భీష్ముడి ముందున్న సైన్యాన్ని గడ్డి పరకల్లా తరిగేస్తున్నాడు.

భీష్ముడికి అడ్డం వెళ్ళబోయిన ద్రోణాచార్యుణ్ణి కదలకుండా నిలేశాడు ధర్మరాజు.

అర్జునుడి ముందు ఈ రోజు ఎవరూ చాలేట్టు లేరనుకున్నాడు ద్రోణాచార్యుడు. తలెత్తి చూశాడు.

కూలే గుర్రాలూ, నేల వాలే ఏనుగులూ, దొర్లుకుంటూ పోయే రథ చక్రాలూ నేల రాలుతున్న ఉల్కలూ చూస్తుంటే భీష్ముడికేం కీడు మూడుతుందో అనిపించింది. కొడుకును దగ్గరికి పిలిచి 'నువెళ్ళి భీష్ముడికి తోడుగా నిలబడు. ఇది ప్రాణాలు దాచుకునే సమయం కాదు' అన్నాడు దిగులుగా.

వెంటనే అశ్వత్థామ భీష్ముడి దగ్గరకు పరుగెత్తాడు. అప్పటికే భీమార్జునులిద్దరూ వీర విహారం చేస్తున్నారు. ప్రత్యర్థుల్ని దెబ్బ కొడుతున్నప్పుడు కలిగే ఆనందం వాళ్ళ మొహాల్లో స్పష్టంగా కనబడుతోంది. అశ్వత్థామను చూసి నవ్వుకున్నారు వాళ్ళిద్దరూ.

జీవితం మీద విసిగిపోయిన భీష్ముడు యుద్ధం చేస్తున్నట్టు నటిస్తూనే ధర్మరాజు దగ్గరకు వెళ్ళి నెమ్మదిగా 'నాయనా! ఈ రాక్షసకృత్యం ఇంక నేను చెయ్యలేను. నాకు ఈ జీవితం మీద విసుగొస్తోంది. ఈ శరీరంతో పొత్తు ఇంక చాలనిపిస్తోంది. మీరు నా హితం కోరే వాళ్ళయితే ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా శిఖండిని ముందుంచుకుని అందరూ కలిసి నన్ను తొందరగా కడతేర్చండి' అన్నాడు. ఆ సంగతి ఎవరికీ తెలీకుండా వుండేందుకు వెంటనే రథాన్ని పాంచాల సైన్యం వైపు మళ్ళించాడు.

ధర్మరాజు కళ్ళ వెంట గిర్రున నీళ్ళు తిరిగాయి. ఆ బాధ నుంచి ఆయన తేరుకునే లోపలే భీముడూ అర్జునుడూ కలిసి యోధులందర్నీ కూడగట్టుకుని భీష్ముణ్ణి ముట్టడించబోతున్నారు.

ఏదో చెప్పటానికి నోరు తెరిచిన ధర్మరాజును

కళ్ళతో నే వారించాడు భీష్ముడు.

నీళ్ళు నిండిన కళ్ళతో కురువృద్ధుడికి మనస్సులో నే నమస్కరించాడు ధర్మరాజు.

హోరాహోరీగా పోరు సాగుతోంది.

అర్జునుడు శిఖండితో కలిసి చెలరేగుతున్నాడు.

శిఖండి ఎన్ని బాణాలు వేసినా నవ్వుతూ ఉపేక్షిస్తున్నాడు భీష్ముడు.

శిఖండిని అడ్డం పెట్టుకుని తాతగారు చేతపట్టిన ధనుస్సునల్లా విరగ్గొడుతున్నాడు పాండవ మధ్యముడు.

అది చూసి పగలబడి నవ్వుతున్నాడు శిఖండి. 'తనను వధించే ఉపాయ మేదో తనేగా పాండవులకు చెప్పాడు. ఇదంతా తన ప్రతిభే అయినట్టు ఆ శిఖండి రెచ్చి పోవడం చూడు' అనుకున్నాడు భీష్ముడు.

నిజంగా ఆ రోజే గనక పాండవులు కృష్ణుణ్ణి వెంట పెట్టుకుని వచ్చి దీనంగా తనను గెలిచే విధానం అడగకపోతే ఇప్పుడీ శిఖండులూ పాండవులూ తనకో లెక్కా! అప్పుడాక్షణాన ఎందుకో ధర్మరాజును చూస్తే జాలేసి, అతని మంచితనానికి తల వొగ్గాడు తను. తనను ఎలా ఓడించొచ్చో తనే చెప్పాడు వాళ్ళకు.... ఆయన ఆలోచన్ని భగ్నం చేస్తూ దుర్యోధను డొచ్చాడు దగ్గరికి.

అతన్ని చూస్తూనే యుద్ధం చేస్తున్నట్టు నటిస్తూ కత్తీ డాలూ పట్టుకుని రథం మీద నుంచి కిందకు దూకాడు భీష్ముడు. అప్పుడే పాండవులందరూ కలిసి వ్రేలెడు కూడా ఎడం లేకుండా వాడి బాణాలు గుచ్చేసారాయన శరీరం మీద.

దానితో భీష్ముడు తూలి కింద పడ్డాడు. అయితే ఆయన శరీరం కింద పడకుండా వొంటిన గుచ్చుకున్న బాణాలే ఆధారమయ్యాయి.

అందరూ ఒక్క అంగలో ఆయన దగ్గరకు పరుగెత్తారు. శరతల్పం మీద ఒరిగిన భీష్ముడ్ని చూస్తూ

'అయ్యో! ఈ మహాను భావుడు చనిపోతున్నాడేమిటి?' అంటూ అందరూ హాహాకారాలు చేశారు.

కురుకుల శిరోమణిని చూసి శిలలా అచేతనుడయ్యాడు ధర్మరాజు.

'ఈ పాపం నేనే చేసాను. నాకు శిక్ష విధించండి' అంటూ అన్నను కౌగిలించుకుని బావురు మన్నాడు అర్జునుడు.

భీష్ముడు కళ్ళు తెరిచి చూశాడు. ఆయన కళ్ళు కాంతిని కోల్పోయి గాజు గోళాల్లా వున్నాయి. మొహమంతా పాలిపోయి వుంది. శరీరమంతా



రక్తంతో తడిసి ఎర్రకలువలా వుంది.

చాలా సేపటికి గొంతు పెగుల్చుకుని ఎక్కడో నూతి లోంచి మాట్లాడుతున్నట్టు 'నేను అప్పుడే చనిపోవడం లేదు. ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చే వరకూ ప్రాణాలతోనే వుంటాను. మీరు బాధ పడకండి' అన్నాడు.

పైన పశ్చిమాన అస్తమించ బోతున్న సూర్యుడి కాంతి విశ్లేషణ చెంది సింధూర పువ్వులా వున్న భీష్ముడి మీద పడడంతో ఆయన మరింత ఎర్రగా జ్యోతిలా ప్రకాశించాడు.

అర్జునుణ్ని దగ్గరకు పిలిచి 'విజయా! నా తలగడకు సరిపోయే బాణాలు పెట్టవూ' అని ప్రేమగా అడిగాడు.

అర్జునుడు వెంటనే గాండీవం తీసుకుని, గాంగేయుడి తల కాస్త ఎత్తి పట్టుకుని మూడు బాణాలు మంత్రించి అవి భూమి మీద నిలబడేటట్టు వేశాడు. అవి ఎత్తుగా భీష్ముడికి తలగడగా అమిరాయి.

'నేను నీకెలా కృతజ్ఞతలు చెప్పుకోను? దూది పరుపులా వుంది నువ్వు అమర్చిన తలగడ' అని మనమణ్ని మెచ్చుకున్నాడు భీష్ముడు.

అర్జునుడు తల దించుకున్నాడు.

అతనికళ్ళు నీళ్ళతో నిండుగా వున్నాయి. భీష్మణ్ని శర తల్పం మీద చూడలేక అక్కడ నుంచి వెళ్ళిపోబోతుంటే 'దాహం వేస్తోంది' అని చిన్న పిల్లాడిలా అర్థించాడాయన.

వెంటనే కొందరు వెళ్ళి బంగారు పాత్రలతో చల్లని నీళ్ళు తీసుకొచ్చేసరికి 'నేను శరతల్పం మీద వున్నాను. మరొకరు తెచ్చిన నీళ్ళు తాగను. తేజోమయాస్త్రంతో భూమిలోంచి వచ్చిన నీళ్ళే కావాలి నాకు' అన్నాడు భీష్ముడు.

అందరూ ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు.

భీష్ముడు అర్జునుణ్ని దగ్గరకు పిలిచి అతని చేతిమీద చెయ్యి వేశాడు. అర్జునుడు తాతగారి ప్రేమకు కదిలి పోయాడు. చేతిని వెనక్కి తీసుకోలేదు. భీష్ముడు అర్జునుడి చేతిని రాస్తూ "ఈ బాణాల వల్ల శరీరం క్షోభ పడుతోంది. పెదవులు ఎండి పోతున్నాయి. నా దాహం తీరేనీళ్ళు నువ్వే తేగలవు. త్వరగా పట్టుకురా" అన్నాడు.

అర్జునుడు లేచి తాతగారికి ప్రదక్షిణం చేసి తేజోమయ బాణాన్నొకదాన్ని పర్జన్య మంత్రం జపించి భూమికి నాటేలా వేశాడు. వెంటనే తెల్లని నీళ్ళు బుస బుస పైకి పొంగాయి. అది చూసి అందరూ ఆశ్చర్య పోయారు. ఆ నీళ్ళు తాగి దప్పిక తీర్చుకున్నాడు భీష్ముడు. ఇదంతా చూసిన దుర్యోధనుడి మొహం తెల్లగా పాలిపోయింది. వెంటనే తేరుకుని "కర్ణా" అన్నాడు. అప్పటికే అతను సుయోధన చక్రవర్తి ఆజ్ఞకు బద్ధుడైనట్టు ముందుకు వచ్చి నిలబడ్డాడు. ఇద్దరూ అక్కడ నుంచి వెళ్ళిపోబోతూంటే భీష్ముడు పిలిచి "నాయనా! నర నారాయణులు అజేయులు. నా మాట విని ఇంకనైనా యుద్ధం మానేసి వాళ్ళకు అర్థ రాజ్యం ఇచ్చెయ్యి" అన్నాడు.

దానికేం బదులు చెప్పకుండా దుర్యోధనుడు మౌనంగా వెళ్ళిపోయాడు. రారాజు వెనకే కర్ణుడూ, దుశ్శాసనుడూ మిగిలిన వాళ్ళూ వెళ్ళారు.

* * * * * * * * *

"భీష్ముడి తరువాత సేనాధిపత్యాన్ని శస్త్రాస్త్ర గురుడైన ద్రోణుడికి అప్పగించాలను కుంటున్నాను" అని అందరి వైపు ఒకసారి పరీక్షగా చూశాడు దుర్యోధనుడు.

ఎవరూ ఔను, కాదు అనలేదు.

దుర్యోధనుడు ముందు వరుసలో కూర్చున్న ద్రోణుణ్ని పిలిచి "మాకు సేనాపతివై జయలక్ష్మిని వరించు ఆచార్యా" అన్నాడు.

ద్రోణుడు అంగీకరించాడు.

వెంటనే బంగారు కలశాలతో పవిత్రోదకం తెప్పించి ఆయనకు పట్టాభిషేకం చేశాడు దుర్యోధనుడు.

కౌరవులంతా శంఖాలు పూరించారు. పంచ మహా వాద్యాలు మోగించారు.

"కౌరవ సేనా ముఖానికి తిలకమై నువ్వు భాసించాలి" అన్నాడు దుర్యోధనుడు ద్రోణుడి పాదాలు తాకుతూ.

ద్రోణుడు సంతోషించి "నన్ను సేనాపతిని చేసి పూజించావు. దానికి తగిన ఫలం లభిస్తుంది నీకు. ఏం వరం కావాలో కోరుకో" అన్నాడు.

దుర్యోధనుడు కాసేపు ఆలోచించి "ఆచార్యా! నువ్వు వరం ఇస్తానన్నావు గనుక కోరుకుంటున్నాను. ధర్మరాజును ప్రాణాలతో పట్టి నా దగ్గరకు తీసుకు

## ద్రౌపది క్విజ్

1) ద్రౌపది అసలు పేరు ఏమిటి ?
2) ద్రౌపది స్వయంవరానికి పాండవులు ఏ వేషంలో వెళ్లారు ?
3) ద్రౌపది యొక్క సోదరుడు ఎవరు ?
4) ద్రుపదునిచే పరిపాలింపబడే రాజ్యం పేరు ఏమి ?
5) కౌరవ సభలో ద్రౌపది వస్త్రాపహరణ సమయంలో రక్షించినది ఎవరు ?
6) ద్రౌపది కురులను పట్టి కౌరవ సభలోకి ఈడ్చినది ఎవరు ?
7) పాండవుల గుడారాలలో ప్రవేశించి ద్రౌపది కుమారులను చంపినది ఎవరు?
8) ద్రౌపది కుమారులెందరు ?
9) కొన్నిసార్లు ద్రౌపది పాంచాలి అని పిలువబడుతుంది ఎందుకని ?
10) విరాటుని కొలువులో ద్రౌపది పేరు ఏమి ?
11) పాండవుల ఆశ్రమానికి దుర్వాసుడు తన శిష్యులతో వచ్చిన సందర్భంలో వారి ఆకలి తీర్చడానికి ద్రౌపదికి సహా

## ప్రయాగ రామకృష్ణ సీరియల్

**రు.1000/- విలువైన బహుమతులు**

1. ద్రౌపదికి ఐదుగురు భర్తలలో ఎవరి మీద మక్కువ ఎక్కువ?
   –పదిహేను వాక్యాలలో రాయండి.
2. ద్రౌపదికి కర్ణుడు మీద కోపం ఎక్కువా? దుర్యోధనుడు మీద కోపం ఎక్కువా?
   –పది వాక్యాలలో రాయండి.

ఈ రెండు ప్రశ్నలు లోగడ సంచికలలో ఇచ్చిన రెండు ప్రశ్నలు చదివి మొత్తం నాలుగు ప్రశ్నలలో ఏ రెండింటి కయినా జవాబు రాసి కూపన్ నెం. 1, కూపన్ నెం. 2 రెండూ జత చేసి – ద్రౌపది వ్యాస రచన పోటీ, ఎడిటర్, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ –3. కి ద్రౌపది సీరియల్ ముగిసిన తరువాత పది రోజుల్లో అందేలా పంపండి. అంత వరకు ఈ కూపన్లు రెండూ మీ దగ్గరేపెట్టుకోండి.

**నిబంధనలు:**

* మీరు పంపే వ్యాసం అరఠావు నుంచి అర ఠావున్నరకి మించకూడదు. పంక్తులు దూరంగా అక్షరాలు విడి విడిగా వుండాలి-
* ఈ ప్రశ్నలు కూపన్‌సహా మీవద్ద వుంచుకోండి!
* వ్యాసాలలో ఉత్తమమయిన వాటికి

## చెప్పండి చూద్దాం

యపడినది ఎవరు ?

12) అజ్ఞాతవాసంలో భీముని సౌగంధిక పుష్పాలు తెమ్మని కోరినదెవరు ?

**ద్రౌపది క్విజ్-జవాబులు**

1) కృష్ణ.
2) బ్రాహ్మణులుగా.
3) ధృష్టద్యుమ్నుడు.
4) పాంచాల.
5) కృష్ణుడు.
6) దుశ్శాసనుడు.
7) అశ్వత్థామ.
8) ఐదుగురు.
9) పాంచాల రాజు పుత్రిక గనుక.
10) శైరంధ్రి.
11) కృష్ణభగవాన్.
12) ద్రౌపది.

రావాలి" అన్నాడు.

ద్రోణుడు ఆశ్చర్య పోయాడు. దుర్యోధనుడిలో వున్నట్టుండి ఇంత మార్పెలా వచ్చిందా అనుకున్నాడు.

"చక్రవర్తీ! ధర్మరాజు అజాత శత్రుడనే మాట ఇప్పుడు నీవల్ల కూడా నిరూపణయింది. అతను నీకు బద్ధ శత్రువైనా నువ్వతన్ని చంపమని కోరకుండా ప్రాణాలతో బంధించి తెమ్మన్నావు. కారణం ఏమిటి? పాండవులను గెల్చినట్టు ప్రకటించి ఔదార్యంగా వాళ్ళ అర్ధ రాజ్యం వాళ్ళ కిచ్చేస్తావా?"

## ద్రౌపది

అని అడిగాడు ద్రోణుడు.

దుర్యోధనుడు నవ్వేడు. "ఆచార్యా! ఆ ధర్మరాజును చంపితే కోపించి కురుబలాన్నంతటినీ నాశనం చేస్తాడు అర్జునుడు. ఒకవేళ కష్టపడి నేను పాండవులను జయించినా, కౌరవుల తలలన్నీ తన చక్రంతో ఏరేసి రాజ్యం కుంతికైనా కట్ట బెడతాడు గాని మనకు దక్క నివ్వడు కృష్ణుడు. కనుక ధర్మరాజును తెచ్చి మళ్ళీ జూద మాడేటట్టు చేసి, అరణ్యాలకు పంపామంటే నిశ్చింతగా ఈ సామ్రాజ్యమంతా నేనే పాలించుకోవచ్చు. ఎలా వుంది ఆలోచన" అన్నాడు దుర్యోధనుడు వికటంగా నవ్వుతూ.

దుర్యోధనుడి మనసులోని మనిషి ఇంత నీచుడా అనుకున్నాడు ద్రోణుడు. లోలోపల అతన్ని అసహ్యించుకున్నాడు.

ద్రోణుడు కోపాన్ని తమాయించుకుని అసహ్యాన్ని ఏమాత్రం మొహంలో కనబడనీయకుండా "అర్జునుడు అడ్డొస్తే మాత్రం నేనా పని చెయ్యలేను. అతను కాకుండా ఎవ రెదురొచ్చినా సరే ధర్మరాజును బంధించి నీ ముందు నిలబెడుతాను. సరేనా" అన్నాడు.

అర్జునుడు ప్రాణాలతో వుండగా ధర్మరాజును పట్టుకోవడమనేది తనకే కాదు, ప్రమధ గణాలతో కూడిన స్థాణుడికి కూడా సాధ్యం కాదని ద్రోణుడికి తెలుసు.

తెలియందల్లా తెలివి తక్కువ దుర్యోధనుడికీ, అతన్ని గుడ్డిగా అనుసరించే అతని తమ్ములకీ. ధర్మరాజు అప్పుడే తమకు బందీ అయినట్టు, అరుచుకుంటూ వెళ్ళారు వాళ్ళు.

* * * * * *

ద్రోణుడు పద్మవ్యూహం పన్నాడు.

కౌరవ యోధులందరూ ఎర్రని వస్త్రాభరణాలతో పద్మ దళాలై మోహరించారు.

కృష్ణుడూ, అర్జునుడూ, ప్రద్యుమ్నుడూ, అభిమన్యుడూ తప్ప ఎవరూ ఆ వ్యూహాన్ని భేదించలేరు.

ధర్మరాజుకా సంగతి తెలుసు. కాని సమయానికి కృష్ణుడూ అర్జునుడూ ఇద్దరూ దగ్గర లేకుండా పోయారు. సంశప్తకుల మీదికి యుద్ధానికి వెళ్ళారు వాళ్ళు.

ధర్మరాజు ఆలోచనలను భగ్నం చేస్తూ ఇంతలో అభిమన్యుడు వచ్చాడు- "మహారాజా! ఏమిటాలోచిస్తున్నారు?"

ధర్మరాజు ఒక క్షణం పూరుకుని-

"నువ్వు ఈ వ్యూహాన్ని భేదించాలి" అన్నాడు.

"నా తండ్రి నాకు పద్మవ్యూహంలోకి ప్రవేశించడం మాత్రమే నేర్పాడు. వెళ్ళడమైతే వెళ్తాను. కాని అందులోంచి బయటకు రావడం తెలీదు నాకు...."

అభిమన్యుడు చెప్పడం ఇంకా పూర్తి కాలేదు- ధర్మరాజు మధ్యలోనే అందుకుని "నువ్వు పద్మవ్యూహాన్ని భేదించావంటే నేనూ ధృష్టద్యుమ్నుడూ అందరం నీ వెనకే వచ్చేయం" అన్నాడు.

అభిమన్యుడికి ఉత్సాహం వచ్చింది.

వెంటనే రథ మెక్కి బయలు దేరాడు.

వ్యూహ ముఖంలో వున్న ద్రోణుణ్ని శర వర్షంతో నొప్పించి మెరుపు మెరిసినట్టు పద్మ వ్యూహంలోకి ప్రవేశించాడు.

అతని చేతి వేడికాగలేక కురుసేనంతా కాసేపట్లో చెల్లా చెదరైంది. దుర్యోధన, కర్ణ, శల్యాది యోధులందరి శరీరాలూ బాణాలతో నింపేశాడు. దుశ్శాసనుడి విల్లు విరిచాడు. అతని గుండెల్లోకి అమ్ములు గుచ్చాడు. దాంతో అతను జీవచ్ఛవంలా రథం మీద అడ్డం పడ్డాడు.

కర్ణుడు అది సహించలేక సైన్యాన్ని కూడ దీసుకుని అభిమన్యుడికి ఎదురు వెళ్ళాడు. సౌభద్రుడు కర్ణుడి కవచం చీల్చాడు. అతను వేసిన అస్త్రాలన్నీ మధ్యలోనే వారించాడు. చాలా సేపు ద్వంద్వ

## "ద్రౌపది"-వ్యాసరచనపోటీ(2)



**1) బ్రీఫ్‌కేసు, 2) చిన్న కామిరా, 3) గోడగడియారం, 4) ట్రాన్సిస్టర్ రేడియో- యింకా మరి కొన్ని చిన్న బహుమతులు వుంటాయి!**
**వీటి వివరాలు కూడా మీకు "సీరియల్" పేజీల్లోనే త్వరలో దొరుకుతాయి!**
**ఈలోగా మీరు కూపన్ (2) కత్తిరించి దాచుకొని ప్రశ్నలు కూడా తీసుకొని సీరియల్ చదువుతూ సంసిద్ధులు కండి!**

బహుమతుల సమర్పణ : నాగేశ్వరీ పబ్లికేషన్స్, విజయవాడ-2.

ద్రౌపది కూపన్ నెం. 2.

మీ పేరు . . . . . . . . . . . . . . . . .

చిరునామా . . . . . . . . . . . . . . . .



# యువతా! కవితా!

## ది రిజల్ట్

గుడ్డి వెలుతురులో –
చదివితే– మంచి మార్కులే వచ్చాయి
కాని, ఫలితం– కళ్ళు మసకబారాయి!
ఉద్యోగం వెతుకులాటలో
కులం గోత్రం– రిజర్వేషన్లు చూసి
కళ్ళు తిరిగిపోయాయి...
చివరికి, కాళ్ళ నొప్పులే మిగిలాయి!

–బొల్లిముంత
వెంకటరమణారావు

## విజ్ఞప్తి

తనదేహమును తానదహియించుకొని దివ్య
దీప్తులొసంగెడు దీపమాత,
కట్నాల కారుచీకటి కోనలోజిక్కి
యూపిరాడక చూచు దీపకాంత,
గుండెలో నార్ద్రిత కోల్పోయి, కొడిగట్టి
దీనంబుగా జూచు దీపకన్య,
మారుతాహతి జేసి తారుమారైపోయి
దిక్కరియేడ్చెడు దీపవనిత,
లిలయెలుంగులు రాని గొంతులను విప్పి
పిలుచు చున్నారు దీపాల వెల్లి నిన్ను
వారి బ్రతుకుల చీకటి వరదలాపి
కాంతి రేఖలు ప్రసరింపకదలిరమ్ము!

-ఎం.పి. జానుకవి

## "అ"

అమ్మ, అక్క, అన్న పదాలకు
'అ' అక్షరం ముందుగావుండి
అనుబంధం సూచించింది కదాయని
ధర్మం, న్యాయం, సత్యాలకు
'అ' అక్షరం ముందుంచాను!
ఆశ్చర్యం!
ధర్మం 'అ'ధర్మం అయింది,
న్యాయం 'అ'న్యాయమైంది,
సత్యం 'అ'సత్యమైంది...
నా
అంచనా
తారుమారైంది!

– పి. ప్రశాంతి

## తేడా

గాఢనిద్రలో మునిగి
గమనించుకోలేదు తన స్థితిని తల్లి!
వింత దృక్కులు చూస్తూ
గమనించుకోలేదు స్తనాల్ని పాపాయి–
ఆకలేస్తే "స్తన్యం" గుర్తుకొస్తుంది పాపకి.
అప్పుడు
పాల కోసం "స్తన్యం" వైపు మళ్ళు పాపాయి కళ్ళు–
ఆకలేస్తే ఆ దౌర్భాగ్యురాల్ని సైతం
ఆశగా చూస్తాయి కామపిపాసుల కళ్ళు
అప్పుడు–
ఆతృతగా సాగుతాయామె వైపు వారి కాళ్ళు
పాపాయి ఆకలికీ
పాపాత్ముల ఆకలికీ
ఎంత తేడా?

– పురిజాల సుధాకర్

## శాస్త్రి!

వస్తువు కొన్నవాళ్ళ
ఆయుర్దాయం తగ్గించుతా...
దాన్ని అమ్మినవాళ్ళ
ఆదాయం పెంచుతా...
"ఇందుగలను– అందులేనను
సందేహం లేక
ఎందెందు వెతికినా
అందందు కనిపించుతా
కలియుగాన
అంతటి ఘనత వహించిన
ఆ 'శాస్త్రి'ని
నేనే 'కల్తీ'ని!"

– వెలివల సాంబశివరావు

## ప్రేమ - మనిషి

ప్రేమపుట్టిన చోటనే
ఎన్నడూ వుండలేదు
చేరాలనుకున్న చోటికి
మనిషిని చేర్చలేకపోతే
మరో చోటికి పోలేక
పుట్టినచోట ఉండలేక
చావులేని ప్రేమ చేసేది లేక
సిద్ధం చేస్తుంది చావుకి మనిషిని!

యర్రంశెట్టి శ్రీను

## ఉపమానం

ఆకలేస్తే
ధర్మం అగుపించదు!
దాహమేస్తే
నీతి తలకెక్కదు!
అక్షయం- వాడి
విలాసమనే ఆకలి!
ఎడారి-వాడి
సంపాదనాదాహం!!

-జంజూరు అచ్చిబాబు

యుద్ధం జరిగాక అభిమన్యుడు కర్ణుడితో అన్నాడు–

"జూదంలో సర్వస్వం పోగొట్టుకుని నిస్సహాయత తప్ప మరేమీ తోడులేక దీనంగా నిలబడ్డ వాళ్ళను అవమానించడానికీ, కురువంశ కులాంగనను అందరి ముందూ పరాభవించడానికీ దుర్యోధనుడికి బుద్ధి లేకపోవచ్చు. కాని నీ సంస్కార మేమైంది? అప్పుడు నువ్వు కూడా నా తల్లిని అనరాని మాటలన్నావుట. ఇప్పుడు నీకు దిక్కెవరు? నిన్ను నీ సైనికుల ముందు, సేవకుల ముందు, స్నేహితుల ముందు పడదోసి కక్ష తీర్చుకుంటాను చూడు."

ఆ మాటలకు కర్ణుడు భయపడ్డాడు.

ధైర్యం చాలక పరుగెత్తాడు.

* * * * * * *

పద్మవ్యూహంలోకి ఒంటరిగా వెళ్ళిన అభిమన్యుడికి సాయపడడానికి ధర్మరాజు మహావీరు లందర్నీ

## ద్రౌపది

సమాయత్తం చేయడం దుర్యోధనుడు చూసాడు. వీళ్ళని ఎలాగైనా సరే అడ్డుకోవా లనుకున్నాడు. తీవ్రంగా ఆలోచించాడు. సైంధవుడు స్ఫురించాడు. వెంటనే అతన్ని దగ్గరకు పిలిచి "నీ మీదనే ఈ రోజు యుద్ధమంతా ఆధారపడి వుంది" అన్నాడు.

సైంధవుడు అర్థం కానట్టు, "నా వల్లనా" అన్నాడు.

"నీకు గుర్తు లేదా? పాండవులు అరణ్యవాసం చేస్తున్నప్పుడు ఒకసారి నువ్వు ద్రౌపదిని మోహించి చెరబడితే పాండవులు నిన్ను చావు దెబ్బలు కొట్టారు. ఆ అవమానం భరించలేక నువ్వు పరమేశ్వరుణ్ణి గురించి తపస్సు చేసి పాండవులను జయించే వరం కోరావు. అర్జునుడు తప్ప మిగిలిన వాళ్ళందర్నీ ఒక రోజు మాత్రం నువ్వు నివారిస్తావని శివుడు వరమిచ్చాడు నీకు. ఈ రోజు అర్జును డెలాగో లేడు. శివుడిచ్చిన వరాన్ని ఉపయోగించుకుని నాకు మేలు చెయ్యి" అన్నాడు దుర్యోధనుడు బ్రతిమాలుతున్నట్టుగా.

సైంధవుడికి కూడా పాండవుల మీద కక్ష తీర్చుకునేందుకు ఇదే మంచి అవకాశమనిపించింది. కళ్ళు మూసుకుని పార్వతీ పతిని ప్రార్థించాడు. అక్కడికక్కడే మట్టితో శివలింగం చేసి అర్చించాడు. ఈశుడికి దయ కలిగి సైంధవుడికి వర ప్రభావం సంక్రమింప చేశాడు. దానితో అతను ఆ రోజు అమిత బలవంతుడయ్యాడు.

పద్మ వ్యూహంలోకి ప్రవేశించ బోయి

పాండవులందర్నీ అడ్డుకున్నాడు. భీముడు మండిపోయి సైంధవుడి గొడుగు, విల్లు, జెండా పడగొట్టేశాడు. సైంధవుడు మరో విల్లందుకుని భీముణ్ణి విరథుణ్ణి చేశాడు. ఉత్తర క్షణంలో భీముడు అతని జుట్టు పట్టుకు లాగి విసురుగా తోశాడు. సైంధవుడు కింద పడ్డట్టేపడి అమాంతం మళ్ళీ లేచి నిలబడ్డాడు. హోరా హోరీగా పోరు సాగింది ఇద్దరికీ. ఆ వేళ సైంధవుడిదే పై చెయ్యి అయింది. ఎవర్నీ లోపలికి పోనీకుండా నిలబెట్టాడు.

"భీమా! నాకు భయంగా వుంది. లోపల అభిమన్యు డొక్కడే ఇందరు కౌరవయోధులతో ఎలా పోరాడుతున్నాడో" దిగులుగా అన్నాడు ధర్మరాజు.

అది విని పద్మవ్యూహం చుట్టూ పిచ్చివాడిలా పరుగెత్తాడు భీముడు. సైంధవు డొక్కడే భిన్న భిన్న రూపాలలో అన్ని మార్గాలకు అడ్డంగా నిలబడి వున్నాడు. భీముడికి అతన్ని తప్పించుకుని లోపలికి వెళ్ళడం సాధ్యం కాలేదు.

ఈ లోగా కౌరవసేనంతా అభిమన్యుడి మీదికి ఒకేసారి తిరగబడింది. అతని కేం చేయాలో తోచక మాయోపాయం పన్నాడు. దాంతో కౌరవ సేనలోని వాళ్ళందరికీ ఎంతో మంది యోధులు రథాలమీద వచ్చి తమను చుట్టుముట్టి యుద్ధం చేస్తున్నట్టు అనిపించింది. ఏం జరుగుతున్నదీ అర్థంకాక కళ్ళు నలుపుకుని చూశారు. కత్తులూ, ఈటెలూ పుచ్చుకుని, కదిలేత్తే ఒళ్ళు తూట్లు పొడిచేలా వేలకొద్దీ యోధులు భయంకరంగా కనిపించారు. ఒళ్ళంతా చెమటలు పట్టాయి వాళ్ళకు. కాళ్ళూ, చేతులూ ఆడక బొమ్మల్లా నిలబడి పోయారు కౌరవయోధులు. అభిమన్యుడు అదే మంచి అవకాశం అనుకుని అందర్నీ చిందరవందర చేసి నాశనం చేశాడు.

దుర్యోధనుడు విచ్చిపోతున్న తన సేనను చూసి 'ఇలా ఎందుకు జరుగుతోంది ఆచార్యా?' అని దీనంగా ద్రోణుణ్ణి అడిగాడు.

'ఇదివరకోసారి అర్జునుడు తపస్సు చేస్తే తుంబురుడూ మొదలైన వాళ్ళు మెచ్చుకుని గాంధర్వి అనే మాయను అతనికిచ్చారు. దాన్ని అర్జునుడు కొడుక్కి నేర్పినట్టున్నాడు. వున్నది లేనట్టుగా, లేనిది వున్నట్టుగా కనిపించడ మనేది గాంధర్వి మాయ' అన్నాడు ద్రోణుడు. 'అయితే ఇప్పుడేం చేద్దాం?'

"అందరూ కలిసి ఒకణ్ణి చంపడమనేది ధర్మంకాదు. కాని ఇంతవరకూ వచ్చాక ధర్మాధర్మాల ప్రసక్తేముంది? ఎలాగైనా అతణ్ణి మోసం చేసి, విల్లు విరిచి, విరథుణ్ణి చెయ్యగలవేమో చూడు. చేతిలో విల్లు వుండగా దేవతలు కూడా ఏంచేయలేరు అతన్ని. అందువల్ల విల్లు విరపడం, సారథిని చంపడం, రథం విరగ్గొట్టడం అన్నీ ఒక్కసారే జరగాలి. ఆ తరువాత నిస్సహాయ స్థితిలో వున్నవాణ్ణి ఎలా వీలయితే అలా చంపుదాం. ఇప్పుడింక మోసం తప్ప మరో ఉపాయం లేదు మనకు" అన్నాడు ద్రోణుడు.

ఇదంతా కర్ణుడు విన్నాడు. మెల్లగా అభిమన్యుడి రథం వెనుకకు వెళ్ళాడు. సమయం చూసి వెనకనుంచే ఒక మహాస్త్రం ప్రయోగించి అభిమన్యుడి విల్లు విరిచేశాడు కర్ణుడు. వెంటనే ద్రోణుడు గుర్రాలను కూల్చాడు. కృపుడు సారథిని చంపాడు.

ఇలా అందరూ అధర్మంగా ఆక్రమించి అభిమన్యుడి చేతిలో ఆయుధమనేది లేకుండా చేశారు.

ఆ దిగ్భ్రమ నుంచి తేరుకోవడానికి అర్జున కుమారుడికి చాలా సేపు పట్టింది.

చుట్టూ చూశాడు.

తనకు సాయమొచ్చే వాళ్ళు ఒక్కరూ కనిపించలేదు. అతను ఆలోచనల్లో వుండగానే 'నీకు మా ప్రగాఢ సానుభూతి' అని ఎవరో అనడం వినిపించింది.

తలెత్తి చూశాడు.

ఎదురుగా శకుని.

పిడికిళ్ళు బిగించాడు అభిమన్యుడు. 'నువ్వు మాకు శత్రువు అవుతే అవచ్చుగాక. చిన్న వాడివైనా సూర్యుడిలా నిప్పులు కురిపించావు. నీ ప్రజ్ఞకు జోహార్లర్పిస్తూనే నీ ఆత్మకు శాంతి కలగాలని కోరుకుంటున్నాం' అని దుర్యోధనుడు, కర్ణుడు, దుశ్శాసనుడు, శకుని, అశ్వత్థామ ఒకేసారి అభిమన్యుడి మీద శస్త్రాస్త్రాలు కురిపించారు.

(ఇంకా వుంది)

# మోక్షానికి 'ద్రాక్ష' రుద్రాక్ష

మన తాత ముత్తాతలు తమ మెడల్లో గరుకుగావుండే కాయల్ని ధరించటమో లేక భగవధ్యానంలో వాటిని ఉపయోగిస్తుండటమో మనలో ఎంత మంది గమనించి వుంటారంటారు? చెప్పటం కష్టమే. అత్యంత విలువైన ఈ కాయలకి చాలా చారిత్రాత్మకమైన, పురాణేతిహాస మైన కథలున్నాయట.

ఈ కాయలనే 'రుద్రాక్షలు' అంటారు. హిందువుల జీవన సరళిలో 'ఆధ్యాత్మిక చిహ్నాలు'గా ఈ రుద్రాక్షలు చాలా ముఖ్యమైన పాత్ర వహిస్తున్నాయి.

హిమాలయ ప్రాంతాలలో ఎక్కువగా దొరికే వీటిని ఆధ్యాత్మిక చిహ్నాలుగానే కాకుండా, వైద్య శాస్త్రరీత్యా కూడా ఎంతో మంది ధరిస్తుంటారు.

అసలు వీటికి రుద్రాక్షలు అనే పేరు ఎలా వచ్చింది? వీటికున్న ప్రాముఖ్యత ఏమిటి? అన్న ప్రశ్నలు ఉత్పన్నం కాక మానవు కదూ! ఈ రుద్రాక్షలపై అనేక కథలున్నాయి–

అసలు 'రుద్రాక్ష' అంటే రుద్రుడి కళ్ల నీళ్లు అని అర్థమట. త్రిమూర్తులలో రుద్రుడు చాలా శక్తిమంతుడు. ఋగ్వేదంలో రుద్రుడు గురించి ఎక్కువగా ఉదహరించబడు తుంటుంది.

పురాణాలలో ఈ రుద్రాక్షల గురించి అనేక కథలు వున్నాయట–

అసురులతో జరిగిన యుద్ధంలో ప్రాణాలు కోల్పోయిన వారిని చూసి రుద్రుడు విలపించాడట. ఆ సందర్భంగా ఆయన కంటి వెంట కారిన కన్నీటి చుక్కలు చెట్లుగా ఏర్పడి అవి కాయలను ఉత్పత్తి చేశాయని, అవే 'రుద్రాక్ష' లని చెప్పబడుతోంది. కాగా వేల సంవత్సరాలు శివుడు కళ్ళు తెరిచి తపస్సు చేశాడట. తపస్సు అనంతరం ఆయన కళ్లు రెపరెప లాడించగా పడిన కన్నీటి చుక్కలే రుద్రాక్ష చెట్లుగా ఆవిర్భవించాయట.

సూర్యుడి నుంచి 12 రకాల రుద్రాక్షలు, చంద్రుడి నుంచి 16 రకాల రుద్రాక్షలు, అగ్నినుంచి 10 రకాల రుద్రాక్షలు ఆవిర్భావం పొందాయని మరొక కథ వుంది. సూర్యుని నుంచి ఉద్భవించినవి ఎరుపుగాను, చంద్రుని నుంచి ఉద్భవించినవి తెల్లగాను, అగ్ని నుంచి ఉద్భవించినవి నల్లగాను వుంటాయని మరికొందరి వాదము.

ఈ రుద్రాక్ష చెట్లు దక్షిణ, తూర్పు ఆసియాలోను, ఆస్ట్రేలియా, పసిఫిక్ దీవుల్లో కనుగొన బడినాయి. భారతీయ ఉపఖండంలో ని నేపాల్, బీహార్, బెంగాల్, అస్సాం, మధ్యప్రదేశ్‌లలో కూడా వీటిని కనుగొన్నారు.

భారతదేశంలో ఈ రుద్రాక్షలు 25 రకాలున్నాయట. ఈ రుద్రాక్ష చెట్లు 60 అడుగుల ఎత్తు వరకు పెరుగుతాయి.

అనేక ముఖాలు కలిగి వుండటమే ఈ రుద్రాక్షల్లో చెప్పదగిన విశేషం. వీటిలో పంచముఖ రుద్రాక్షలు చాలా ఎక్కువగా దొరకటమే కాకుండా చౌకగా కూడా లభిస్తాయట. ఒకటి, పదకొండు, పద్నాలుగు, ఇరవై ఒకటి ముఖాలుగల రుద్రాక్షలు చాలా అరుదు.

రుద్రాక్షల మంచి చెడులను కనుగొనేందుకు రెండు పరీక్షలు చేస్తారు. రెండు రాగి నాణాల మధ్య వుంచిన రుద్రాక్ష అటు యిటు వూగినట్లయితే అది మంచిదని, నీళ్లలో గాని లేదా పాలలో గాని వుంచిన రుద్రాక్ష తేలినట్లయితే అదికూడా మంచిదేనని తెల్పి చెప్తారట. మరగబెట్టని పాలలో వేసిన రుద్రాక్ష వల్ల ఆ పాలు గడ్డకట్టక పోయినా అది కూడా మంచిదనే మరికొంతమంది నిపుణులు అభిప్రాయం వ్యక్తం చేస్తున్నారు



## మహిమాన్వితమైన "రుద్రాక్ష" కథ

ఈ రుద్రాక్షలు ఆయుర్వేద పరంగా పనిచేసే ప్రయోజనాలేమిటో శివపురాణంలోను, స్మృతిలోను, భాగవతంలోను వివరించబడింది.

రుద్రాక్షలు ముఖాలు కలిగివుండటంలో తేడాలున్నాయట. 21 ముఖాల రుద్రాక్షలతో 'ఇంద్రమాల'ను చేస్తారు.అన్నింటిలోకి అరుదైన ఈ రుద్రాక్షలతో తయారైన ఇంద్రమాలను ధరించిన వారికి ఏదీ అసాధ్యం కాదట.

శివుడ్ని తలపించే ఏకముఖ రుద్రాక్ష దొరకటం కష్టసాధ్యం. దాని మీద శివుని చిహ్నాలైన త్రిశూలము, లింగము, సర్పము దర్శన మిస్తాయి. ఇవి ధరించిన వారికి దయ్యాలు, భూతాల నుంచి భయం వుండదు.

అర్ధ నారీశ్వరుడ్ని ప్రతిబింబింప చేసే ద్విముఖ రుద్రాక్షలు లైంగిక పరమైన కోరికలను అణచి వేస్తాయట. త్రిముఖ రుద్రాక్ష అగ్ని దేవుడ్ని తలపిస్తూ స్త్రీ హత్యకు పాల్పడకుండా చేస్తుంది. చతుర్ముఖ రుద్రాక్షలు మానసికారోగ్యానికి దూరమైన వారికి బాగా పనిచేస్తాయి. వేదాధ్యయనం చేసే బ్రహ్మచారులు వీటిని ధరిస్తారు.

హృద్రోగులకు, మానసికంగా దెబ్బతిన్న వాళ్లకు పంచముఖ రుద్రాక్షలు మేలు చేస్తాయి. ఆరు ముఖాలుగల రుద్రాక్షలు సిద్ధి పొందేందుకు సహకరించటమే కాకుండా రక్తపీడనాన్ని, మూర్ఛ వంటి రోగాలను నయం చేస్తాయి. గ్రహపీడ బాధను తట్టుకొనేందుకు సప్త ముఖ రుద్రాక్షలను ఉపయోగిస్తారు. వినాయకుడిని తలపించే అష్టముఖ రుద్రాక్షలు ఏకాగ్రతను పెంపొందిస్తాయి, సంపదను చేకూర్చి పక్షవాత రోగాలను, నరాలకు సంబంధించిన రోగాలను నయం చేస్తాయి.

ఎడమ చేతికి ధరించే తొమ్మిది ముఖాల రుద్రాక్ష వల్ల దేవుడికంటే ఎక్కువగా కొనియాడ బడతారట. గుండెకు సంబంధించిన అన్ని రోగాలు దీనివల్ల మటుమాయమై పోతాయి. పది ముఖాల రుద్రాక్ష తాంత్రిక విద్యలవల్ల అనారోగ్యానికి గురైన వారికి, సాధారణంగా మహిళలే ధరించే పదకొండు ముఖాల రుద్రాక్షలు పిల్లల గోల భరించే శక్తిని యిచ్చి ఊరట కలిగిస్తాయి. ఇంద్రియనిగ్రహాన్ని సంపాదించేందుకు 12 ముఖాల రుద్రాక్ష బ్రహ్మచారులకు ఉపకరిస్తాయి.

ఏ కోరికనుకుంటే ఆ కోరిక నెరవేరాలంటే 13 ముఖాల రుద్రాక్ష ధరించాలిట. అన్ని రోగాల నుంచి దూరంగా వుండాలంటే 14 ముఖాల రుద్రాక్షను, ఆధ్యాత్మికతను పెంచుకోవాలంటే 15 ముఖాల రుద్రాక్షను ధరించాలి.

అరుదుగా లభించే 21 ముఖాల రుద్రాక్ష ధరించిన వారికి ప్రపంచంలో వారి కోరికలు నెరవేరేందుకు యిక ఎదురేలేదట.

ఈ రుద్రాక్షల శక్తి కనుగొనటంపై పరిశోధన మరికొంత కాలం పాటు కొనసాగుతుందట. జాన్‌గారెట్ ఈ రుద్రాక్షల మీద ప్రత్యేక శ్రద్ధ కనబరుస్తున్నారు. 1864లో లెఫ్టినెంట్ కల్నల్ కెర్బర్ డ్రోరీ ఈ రుద్రాక్ష మీద ఔషధ సంబంధమైన అధ్యయనాన్ని చేశారు.

ఈ రుద్రాక్షలకు సాధ్యం కానిది లేదని, అది మన అదృష్టాన్ని మార్చగలగటమే కాకుండా వశీకరణం చేసుకుంటుందని హాల్ హ్యామ్ అనే ఆంగ్లేయుడు తన అధ్యయనం ముగింపులో పేర్కొన్నాడు.

పశ్చిమ దేశాలలో చేసిన పరిశోధనల వల్ల క్యాన్సర్, రక్తపీడనం వంటి రోగాలను యిది నయం చేస్తుందని రుజువయిందట. ఈ రుద్రాక్ష ఆధ్యాత్మిక చిహ్నంగా రూపు దాల్చినప్పటికీ వైద్య పరంగా చాలా ముఖ్యమైనదిగా పేర్కొంటున్నారు. పశ్చిమ దేశవాసులు పరిశోధనలు నిర్వహించి వాటి ప్రయోజనాలను తెలుసుకుంటుంటే మన దేశంలో దాని ప్రాముఖ్యతను విస్మరించటం చూస్తుంటే ఎంతగానో బాధేస్తుంది!

ఆధ్యాత్మిక చింతనకు, సర్వ రోగ నివారిణి గాను ఈ రుద్రాక్షల ప్రాముఖ్యాన్ని అందరూ గుర్తించ వలసిన అవశ్యకత ఎంతైనా వుంది. కదూ!

–తిలక్

సాయంకాలం ఆరుగంటలవేళ- శివరామ్ చెరువు ఒడ్డున- ఒక రాతి మీద కూర్చుని- చెరువులో తలలూపుతున్న తెల్లటి తామరపూలను తదేక దృష్టితో చూస్తున్నాడు. ఆ దృశ్య మొకప్పుడు అతడికి ఉత్సాహాన్ని కలిగించేది. ఎన్నో తీయటి కలలకు ఆస్కారమయ్యేది.




కాని ఇప్పుడో?

అతడి గుండెలోని విషాదాన్ని కళ్లల్లోకి తెప్పిస్తోంది.

శివరామ్ ఒకచిన్న రాయిని చెరువులోకి విసిరాడు. రాయి నీటిలోకి దిగిపోతూ చిన్న సుడిగుండాన్ని, దాని చుట్టూ అలలనూ సృష్టించింది. మరి కాసేపటికి ఆ అలలు అంతరించిపోయి, నీరు ఎప్పటిలా నిశ్చలంగా ప్రవహించటం చూశాడు.

ఈసారి మరొక పెద్ద రాయిని విసిరి చూశాడు. అది నీటిలోకి దిగిపోతూ మరింత పెద్ద సుడిగుండాన్నీ పెద్ద వలయాకారంలో అలలనూ సృష్టించి చాలాసేపు నీటిలో సంచలనాన్ని కలిగించింది.

అతడు మరొక రాయి విసరబోతుండగా ఒక బలమైన చెయ్యి భుజమ్మీద పడ్డది. ఆ చేతిమీద తన చేతి నుంచి వెనక్కు తిరిగి చూశాడు శివరామ్.

"రాంబాబూ. ఎప్పుడొచ్చావు? ఎంత కాలమయిందిరా నిన్ను చూసి?" పక్కన కూర్చోబెట్టుకున్నాడు.

"నేనీ ఊరు వచ్చి ఆరు నెలలయింది. కాని- వచ్చినప్పటి నుంచీ టూరు ప్రోగ్రాములతో సరిపోయింది. ఇంకా కుటుంబాన్ని తీసుకురాలేదు. ఇప్పుడిప్పుడే ఇళ్లు చూడటం మొదలు పెట్టాను. అది సరేగాని- నీవిక్కడున్నావేం? సెలవు మీద ఉన్నారా?"

## పెద్ద కథ

# మనశ్శాంతికి మందులా?



"దీర్ఘకాలపు సెలవు మీద ఉన్నాను."

"ఎందుకు? ఏమవసరం వచ్చింది? మా వదినె గారెక్కడున్నారు?"

"వదినెగారా? ఆమె ఎక్కడున్నదో తెలియదు. నీకు తెలుసుగా? అప్పుడు ఆమెకు ట్రాన్స్‌ఫర్ వచ్చింది. మార్చటానికి ఎంతో ప్రయత్నించాము. కాలేదు. నేను కూడా వెళ్లి ఇల్లు కుదిర్చి వచ్చాను. వచ్చిన మూడోనాడే నన్ను మా ఇంటెలిజన్సు డిపార్టుమెంట్ వారు అండమాన్స్ వెళ్లమన్నారు. సంధ్యకు ఉత్తరం రాస్తూ- నేను త్వరలోనే సెలవు పెట్టి వస్తానని పురిటి సమయానికి తన దగ్గరే ఉంటాననీ తెలిపాను. కాని- కాని- నాకు సెలవు దొరకలేదు. నేను సంధ్యకు రాసిన ఉత్తరాలు తిరిగి వచ్చాయి. స్నేహితులకూ ఆమె ఆఫీసర్‌కూ జాబులు రాశాను. స్నేహితులకు ఆమె ఎక్కడున్నదీ తెలియలేదు. ఆఫీసర్ ఆమె అక్కడినుంచి ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నదని తను కొత్తగా వచ్చాననీ రాశాడు. నేను మా ఆఫీసర్‌తో నా సంగతంతా చెప్పి మళ్లీ అక్కడి నుంచి ట్రాన్స్‌ఫర్ చేయించుకునేసరికి ఎనిమిదేళ్లు పట్టింది. అండమాన్స్‌కు వెళ్లటానికి ఎవరూ అంతగా ఇష్టపడరు. అందుకని ఇంత ఆలస్యమైంది. వచ్చినప్పటి నుంచీ ఎక్కే రైలు- దిగే రైలు. సంధ్య విషయం తెలియటం లేదు. నన్ను గురించి ఏమనుకుంటున్నదో? ఎక్కడుందో తెలియదు. ఈ తిరగటాలలో నా కాలు మడమ దగ్గర ఫ్రాక్చరయింది. దానికి ఆపరేషన్- వైద్యము జరిగింది. కాని బాగా నడవలేను."

"అందుకే ఈ చెరువు ఒడ్డున కూర్చున్నాను? నేను చాలా సేపటి నుంచీ నీ వెనక నిలబడి చూస్తున్నాను. నీ మనసెక్కడో ఉన్నదనీ, నీవు ఏ కారణం చేతనో సర్వమూ పోగొట్టుకున్న వాడిలా కనబడ్డావు. నీళ్లల్లో రాళ్లు వేసి నీటివంక చూస్తున్నావు. ఏం కని పెట్టావు?"

"అయ్యగారూ. చీకటయిందని నాయన చెప్పి రమ్మన్నాడు" ఒక పిల్లవాడు వచ్చి శివరామ్ ఎదుట నిలబడ్డాడు.

"శివరామ్. నీవింటికెళ్లు. రేపు కలుద్దాం. కాని- ఒక్క సంగతి జ్ఞాపకం ఉంచుకో. ఏ పని సాధించాలన్నా ధైర్యం కావాలి. జీవితంలో ఎన్నో కష్టాలొస్తాయి. అంతమాత్రాన క్రుంగిపోకూడదు. చూడు. సముద్రంలో కెరటం లేచినప్పుడు తలవంచాలి. కెరటం దాటిపోయిన తరువాత తల ఎత్తాలి. ఇది తెలుసుకుంటే ధైర్యమూ నిబ్బరమూ కలుగుతాయి. అన్నిటికీ నేనున్నానుగా. నీవు భారమంతా నా మీద పెట్టు. సంగతులన్నీ జరిగినవి జరిగినట్టుగా రేపు చెప్పు."

"రాంబాబూ. ఇంటికి వెళితే గుండె చెరువయిపోతుందిరా. రాత్రిళ్లు నిద్ర పట్టదు. కుంటుతూ ఇల్లంతా తిరిగి తిరిగి తెల్లవారుఝాముకు అలసిపోయి మంచానికి అడ్డంపడతాను" మెల్లగా లేచి కుంటుతూ అడుగులు వెయ్యసాగాడు శివరామ్.

"పూర్ ఫెలో. చిక్కి సగమయ్యాడు. మునుపటి ఉత్సాహం చురుకుదనం ఇప్పుడు లేవు. వీడు మళ్లీ కోలుకోవాలంటే ఆ సంధ్య కనపడాలి" రాంబాబు ఇంటిదారి పట్టాడు.

ఆ రాత్రి- పదమూడు సంవత్సరాల క్రిందట- శివరామ్‌కూ సంధ్యకూ మధ్య ప్రేమ అంకురించినదని తెలుసుకుని, తనూ మరొక స్నేహితుడూ కలిసి, రిజిష్టరు మారేజి చెయ్యటమూ, ఆ తరువాత అగ్నిసాక్షిగా మంత్రాలతో దేవాలయంలో పెళ్లి చేయటమూ రాంబాబు కళ్లల్లో మెదిలింది. సంధ్యకూ దగ్గిరి వాళ్లెవరూ లేరు. శివరామ్‌కి ఉన్న తల్లి ఏడాది క్రిందట చనిపోయింది. అందుకే స్నేహితులంతా కలిసి సంధ్యకు మూడవ నెల రాగానే పెద్ద పార్టీ చేశారు. అప్పుడు- సంధ్యకు ట్రాన్స్‌ఫర్ ఆర్డరు వచ్చింది.

మరి- సంధ్య ఏమయింది?

ఆమె మోసం చేసే మనిషి కాదు. తనకు బాగా తెలుసు. దూరపు బంధువు కూడా.

ఆ మరునాడే ఇల్లు కుదుర్చుకొని భార్యను రమ్మని ఉత్తరం రాసి, రెండు రోజులయిన తరువాత రాంబాబు శివరామ్ దగ్గరకి వచ్చాడు.

గదిలో బల్ల ముందర కుర్చీలో కూర్చుని తల మీద చేతులు పెట్టుకుని ఉన్నాడు శివరామ్.

బల్లమీద కాగితాల దొంతర పడి ఉన్నది. వీటన్నిటినీ చదివిన తరువాత తల పట్టుకు నికూర్చున్నాడేమో?

వాటిని చేతిలోకి తీసుకుని విప్పి చూడాలనిపించింది. కాని అవి ఉత్తరాలయితే తను చూస్తే ఏమనుకుంటాడో? కొంతసేపు ఆలోచించాడు.

ఏమన్నా అనుకోనీ, అవన్నీ చదివితేనే గాని అతడి పరిస్థితి కొంతయినా తెలియదనుకుంటూ ఒక్కొక్కటి మడత విప్పి చదవటం మొదలుపెట్టాడు గది అవతలికి వెళ్లి.

"శివరామ్

ఇల్లు కుదిర్చి నన్ను ఈ యింట్లో దింపి వెళ్లావు. ఈ ట్రాన్స్‌ఫర్ మనిద్దరినీ విడదీసింది. ఉత్తరాలు రాస్తానన్నావు. నీవు ఈ ఊరికి బదిలీ చేయించుకుంటానన్నావు.

కొల్లించల సరస్వతీదేవి

## మనశ్శాంతికి మందులా?

...వు? నీవు కట్టిన
...ట్టిన ఉంగరం చూసు
...ం కోసం ఎదురు చూస్తు
మునిగిపోయి, నన్ను మరిచి
నీవు ఇక్కడి నుంచి వెళ్లినప్పటి
...మేమి చేశావో డైరీ రాసి పంపు
...న్నవు. రాయవూ? అదంతా చదువు
...టూ నీవు నాపక్కన ఉన్నట్టే భావించు
...ని కాలం గడుపుతాను. శివరామ్. రాస్తావు
కదూ?

నీ సంధ్య."

"అయితే సంధ్య అక్కడి నుంచి ఉత్తరా రాసిందన్నమాట. పిచ్చి పిల్ల. ప్రాణానికి ప్రాణమిచ్చే రకం" అనుకుంటూ మరొకటి తీశాడు.

"శివరామ్

నీవు నిజంగా మారి పోయావు. కాని- నన్ను మరిచిపోతే నేనింతగా బాధపడను. కాని మనకొక పాప పుట్టబోతున్నదని తెలిసి కూడా ఇట్లా చేస్తావా? నీకు నేను రాసిన ఉత్తరమొకటి తిరిగి వచ్చింది. నీవెక్కడున్నావో తెలపమని నీ స్నేహితులకు రాశాను. ఎవరూ జవాబు రాయలేదు. నీవక్కడలేవా? పక్క ఊరికి కూడా రాసి చూశాను- ఒకటి కాదు నాలుగు ఉత్తరాలు... ఈ పిచ్చిదానికి జవాబు రాయట మెందుకనుకున్నావా? అదంతా పోనీ. ఇప్పటికయినా రాస్తావా?

నీ సంధ్య"

"శివరామ్

నేను నీకు రాసిన ఉత్తరాలన్నీ క్షేమంగా నలిగిపోకుండా తిరిగి వచ్చాయి. నీవు ఒకసారి మీ అమ్మ విజయవాడలో కొంచెం ఊరికి దూరంగా ఇల్లు కట్టించిందనీ, నీవా యింటి నిచూడక ముందే కృష్ణా పుష్కరాలలో కృష్ణా నదిలో స్నానం చేస్తూ కొట్టుకుపోయిందనీ చెప్పావు. ఆ యిల్లు తాళం పెట్టి కాపలా దారుని పెట్టాననీచెప్పావు. ఇక నుంచీ నా ఉత్తరాలు పాతవీ, కొత్తవీ ఆ యింటి ఎడ్రస్‌కే వెళ్తాయి. చదువుకో- అక్కడికి వెళ్లినప్పుడు.

నీ సంధ్య"

ఊరి పేరు లేదుగాని ఉత్తరాలు రాస్తూనే ఉన్నది సంధ్య.

"శివరామ్

ఒక రాత్రివేళ- నింగికీ నేలకూ దారాలు కట్టినట్టు కుంభ వర్షము కురిసే సమయంలో నీకు ఒక మగపిల్లవాడు పుట్టాడు. నెలరోజులు కాగానే సెలవయిపోతుంది ఇక్కడి నుంచి బదిలీ చేయించుకుంటాను. ఎందుకంటే లేడీ డాక్టర్ నన్ను అనుమానంగా చూడడం మొదలు పెట్టింది. పేరు, ఉద్యోగం, వయసూ రిజిస్టరులో రాసుకుని పిల్లవాడితో కూడా నాకు ఫొటో తీసింది. పోలీసు రిపోర్టుకు కావలసినదంతా సేకరించింది. కాని- నేను బేబీతో వెళ్లిపోతాను. పిల్లవాడు ఏడు పౌండ్లు. ఎడమచేతికి ఆరవ వేలుంది. కుడి చెవికి వెనకగా నల్లటి పుట్టుమచ్చ. డాక్టరు పేరు మంగళ, ఆమెది ప్రయివేటు నర్సింగ్‌హోమ్. మనిషి చాలా మంచిది. విసుగు లేకుండా ఓపికతో పని చేస్తుంది. ముందు జాగ్రత్తకోసం తను కూడా ప్రక్కన నిలబడి హెడ్ నర్స్ చేత ఫొటో తీయించి రిజిష్టరులో అందరివీ అంటిస్తుంది. కాని- నాకేం భయం? తాళి కట్టించుకున్నదాన్ని. నీవు నేను కట్టలేదంటే నీ స్నేహితులే నాకు సాక్షులు.

నీ సంధ్య."

"శివరామ్‌గారూ!

కొడుకు పుట్టాడని రాసినా మీలో చలనం కలుగలేదు కదూ? సరే మీ బాబును మీ యింట్లోనే అప్పగిస్తాను. నేను పెంచితే పిల్లవాడికి అపఖ్యాతి రావచ్చు. వాడు మీ పోలికే కనుక ఎవరూ అనుమానించరు. పైగా తల్లి లేని పిల్లవాడన్న సానుభూతి లభిస్తుంది.

సంధ్య."

రాంబాబు ఉత్తరాలు చదివి మళ్లీ మడతపెట్టి శివరామ్‌బల్లమీద పెట్టాడు.

పదమూడేళ్లు గడిచిన తరువాత సంధ్య కోసం ఎక్కడని వెదకటం? ఇప్పుడు ఉద్యోగం చేస్తున్నదో లేదో?

పిల్లవాడిని శివరామ్ ఇంట్లో అప్పగించా'నని స్పష్టంగా రాసిందే? ఎవరికి అప్పగించింది?

రాంబాబు గిరున వెనక్కు తిరిగి వాకిట్లోకి వచ్చాడు.

గేటుకు దగ్గరగా కూర్చుని కోటయ్య పొగాకు కాడలు ఝాడించి చుట్ట చుట్టుకుంటున్నాడు. రాంబాబును చూడగానే లేచి నిలబడ్డాడు.

"మీ అయ్యగారు రాకముందు ఇంటికి ఎవరయినా వచ్చారా?"

"ఎవరూ రాలేదు బాబయ్యా".

"ఆడవాళ్లెవరూ రాలేదా బిడ్డనెత్తుకుని?"

"రాలేదు"

"నిజం చెప్పు? నీవు ఈ అయ్యగారి ఇంట్లో ఎంత కాలం నుంచీ ఉంటున్నావు?"

"అమ్మగారు ఇల్లుకట్టించేటప్పటి నుంచీ ఉన్నానండి. అమ్మగారికి నేనంటే ఎంతో నమ్మకమండి. ఆరి తమ్ముడుగారి ఊరి నుంచి పిలిపించుకున్నారండి."

"ఆమె ఎవరో ఇక్కడికి వచ్చి పసిపిల్లవాడిని అప్పగించి వెళ్లిందని తెలిసింది. ఎవరికి అప్పగించింది? ఇంటికి నీవేగా కాపలాదారుడివి?"

"ఆ మాట నిజమేనండి. అమ్మగారు పోయిందగ్గరనుండీ నేనే ఈ యింటినీ తోటనూ చూసుకుంటున్నానండి. అయ్యగారు వచ్చినప్పటి నుంచీ వంట కూడా చేస్తూ ఆరి పనంతా చేస్తున్నానండి".

"అయ్యగారు లేనప్పుడు ఉత్తరాలేమయినా వచ్చాయా? దీనికయినాసరైన జవాబు చెప్పు?"

"ఉత్తరాలు వచ్చినమాట నిజమేనండి. వాటిని నేనేం చేసుకుంటానండి? నాకు చదువు రాదు బాబయ్యా. ఆ గోడకు అమ్మగారు ఉత్తరాలకని ఒక గూడు కట్టించి చిన్న తలుపు పెట్టించారు. తలుపు లాగితే వస్తుంది. అయ్యగారు వచ్చినాక రంగులేయిం



చారండి. రంగులాళ్లు అవన్నీ తీసి అయ్యగారి కిచ్చారండి."

"మరి- అయ్యగారు రాగానే నీవెందుకు తీసి యివ్వలేదు? పోనీ ఆ గూట్లో ఉత్తరాలున్నాయని ఎందుకు చెప్పలేదు?"

"ఆ గోడకు గూడు ఉన్నదని నాకు తెలియదుబాబయ్యా. మొన్న రంగులాళ్లు చూసి చెప్పే వరకు నాకు తెలియదండి."

"ఆ, ఉత్తరాలు ఎవరు పెట్టారు ఆ గూట్లో? అదయినా నిజం చెప్పు?"

"బాబయ్యా. నాకుతెలవదండి. నాకు మద్దెనాళ కనుమఱిగిపోతదండి. పోస్టు జవానుకు అమ్మగారు చెప్పి వెయ్యమన్నారేమో నాకు తెలవదండి."

"నీ పేరు కోటయ్యన్నావు కదూ? నీవు ఒక్క మాటయినా నిజం చెప్పటం లేదు. నేను మీ అయ్యగారితో చెప్పి పోలీసులను పిలిపిస్తాను. వాళ్లే నీచేత అన్నీ చెప్పిస్తారు. పిలవమంటావా?" గద్దించాడు రాంబాబు.

"నేను తప్పు చెయ్యలేదు బాబయ్యా. అళ్లు వచ్చినా ఇదేమాటండి."

రాంబాబు అతడి నిబ్బరానికి ఆశ్చర్యపడ్డాడు.

సాయంకాలం నాలుగు గంటలకు వాకిటి వరండాలో శివరామ్ రాంబాబు కూర్చుని మాట్లాడుకుంటుండగా కోటయ్య కాఫీ, టిఫిన్ తెచ్చి బల్లమీద పెట్టాడు.

"తినుకో. చల్లారిపోతాయి. అట్లా చూస్తూ కూర్చుంటావేం? నీకు నిజంగా పిచ్చి పట్టిందిరా శివరామ్. నీతో చాలా సంగతులు చెప్పాలి. నీవు ధైర్యం తెచ్చుకో- అలా చెరువు గట్టుకేసి వెళ్దాం. వస్తావా?"

రాంబాబు కోటయ్య విషయం శివరామ్‌తో ఆలోచించాలనుకున్నాడు.

చెరువు గట్టు మీద ఇద్దరూ కూర్చున్నారు. శివరామ్ దృష్టి మళ్లీ ఆకుల మధ్యనున్న తామరపూల దృశ్యం మీదికి పోతోంది.

"నిన్ను ఇక్కడికి తీసుకువచ్చింది మాట్లాడటానికి" శివరామ్ ముఖం తనవైపుకు తిప్పుకున్నాడు రాంబాబు.

"నీకు కోటయ్య మీద బాగా నమ్మకం ఉందా?"

"పని బాగా చేస్తున్నాడు. ఇంట్లో వస్తువులు ఏమీపోవటం లేదు. నా విషయం శ్రద్ధగా కనుక్కుంటున్నాడు. పనివాళ్ల దగ్గర్నుంచి అంతకంటె, ఇంకా ఏం ఆశిస్తాం?"

"నీ బల్ల మీద ఆ కాగితాలేమిటి? మధ్యాహ్నం వాటిని ముందర పెట్టుకుని, తల పట్టుకుని కూర్చున్నావు?"

"అవి సంధ్య రాసిన ఉత్తరాలురా. ఆ గూట్లో పడి ఉన్నాయట. మొన్న బయట పడ్డాయి."

"చదివావా?"

"అందుకే ఈ వేదన."

"అందుకు ఏం చేస్తావు ఇప్పుడు?"

"ఎక్కడని వెతకను? ఎవరినని అడగను?"

రాంబాబు తను ఆ ఉత్తరాలు చదివినట్లు చెప్పదలచుకోలేదు. కర్తవ్యమేమిటో కూడా తోచని శివరామ్‌ను చూస్తే రాంబాబుకు జాలి కలిగింది. కొంతసేపు అతడికి చిన్నప్పటి విషయాలేవో చెప్పి కాలక్షేపం కలిగించాడు.

ఇద్దరూ లేచి ఇంటికి వస్తుండగా దారిలో రాంబాబు అడిగాడు- "నీవు ఈ నిర్వేదమూ నిస్పృహలో పడి, వాటినెదుర్కోలేక మదిరకు అలవాటు పడలేదు కదా? నేనడిగినందుకు మనస్సు నొచ్చుకోకు. ఈ రోజుల్లో ఉల్లాసానికి కొందరు, విచారాన్ని కష్టాలనూ మర్చిపోవడానికి కొందరు దానికి బానిసలయిపోతున్నారు."

"అన్ని బాధలూ మరిచిపోవటానికి అలవాటు చేసుకుంటారు. కాని- నాకు సంధ్యను కలుసుకోవాలనీ ఆ పిల్లవాడిని చూడాలనీ ఆకాంక్ష ప్రబలంగా ఉంది. ఎంత కష్టమైనా వెతకాలనీ కలుసుకోవాలనీ ఉంది కాని- మరిచిపోవాలని లేదు. అందుకని ప్రతినిమిషమూ అప్రమత్తతో నిరీక్షిస్తున్నాను. నాకు అటువంటి ఆలోచనలు కూడా రావు."

రాంబాబు పదిహేను రోజులపాటు కనపడకపోయేసరికి శివరామ్‌కు పిచ్చెక్కినట్టుగా ఉంది. స్నేహితుడు చివాట్లుపెట్టినా- మందలించినా- అంత బాధనిపించదు. అతడు ఎట్లా మాట్లాడినా మనసు కొంత ఉపశమించేది.

ఇరవై రోజుల తరువాత రాంబాబు వచ్చినట్టు తెలిసింది శివరామ్‌కు. తన కార్డు లోపలికి పంపించి వెళ్లిపోయాడు రాంబాబు. ఆ సాయంకాలం వరకూ శివరామ్‌కు క్షణమొక యుగంగా గడిచింది.

"ఇన్ని రోజులు ఎక్కడికి వెళ్లావు?" చిన్న పిల్లవాడు అలిగినట్టుగా ముఖం పెట్టాడు శివరామ్. రాంబాబును చూడగానే.

"నేను ఎక్కడికీ వెళ్లకుండా నీ ముందరే కూర్చుంటే నా ఉద్యోగం ఎలా చేస్తాను? అలా కొన్ని ఊళ్లు తిరిగి వచ్చాను." అన్నాడు రాంబాబు.

రాంబాబు సంధ్య ఉత్తరాలలో రాసినట్టుగా శివరామ్ ఆమెకు ఇల్లు కుదిర్చిన ఊరి నుంచి, ఒక్కొక్కరినే అడుగుతూ, ఆమెకు పురుడు వచ్చిన ఊరు చేరుకుని మెటర్నిటీ హోమ్‌కు వెళ్లి డాక్టర్‌తో మాట్లాడాడు. సంధ్య పేరు చెప్పాడు.

ఆమె ఆ రోజు విరామమన్నది లేకుండా పని చేసి చాలా అలసిపోయి ఉన్నది. ఆ సాయంత్రం వరకు మరో నాలుగు పురుళ్లు వచ్చేటట్టుగా ఉన్నాయి. రాంబాబును మరు



## క్రీడారంగం క్విజ్



(1) భారతదేశానికి టెస్ట్ క్రికెట్ ఆడిన అతి చిన్న వయస్కుడెవరు?

(2) గౌరవ డాక్టరేట్ పొందిన ప్రథమ భారతీయ క్రికెటర్ ఎవరు?

(3) 8వ ఆశియా ట్రాక్ అండ్ ఫీల్డ్ పోటీల్లో 'క్రీడాజ్యోతి' వెలిగించిన క్రీడాకారులెవరు?

(4) ఆశియా క్రీడలలో మొట్టమొదటి బంగారు పతకం సాధించిన భారతీయ వనిత ఎవరు?

(5) ఈ సంవత్సరం 'జూనియర్ ఆస్ట్రేలియన్ ఓపెన్' పోటీలో సంచలనం సృష్టించిన భారతీయ బాలుడెవరు?

(6) అయిదుసార్లు 'మిస్టర్ ఆశియా' మరియు ఒకసారి 'మిస్టర్ యూనివర్స్' గెలిచినదెవరు?

(7) అంతర్జాతీయ స్విమ్మింగ్ పోటీలలో గోల్డ్ మెడల్ సాధించిన మొదటి భారతీయ బాలిక ఎవరు?

(8) 'ఇంగ్లీషు ఛానల్'ను అత్యంత వేగంగా (తక్కువ సమయం) ఈదిన ఆశియా వ్యక్తి ఎవరు?

(9) 'గ్రాండ్ మాస్టర్ నార్మ్' పొందిన భారతీయ వనిత ఎవరు?

(10) "బీస్ట్ ఆఫ్ ప్రాగ్" అని ఎవరిని అంటారు?

— వై.

(జవాబులు ఈ సంచికలో నే)





## "శివలింగార్చన"; "శివభక్తి పరీక్ష!"

శ్రీశైల దేవాలయ ప్రాకారశిల్పం

ఫొటో: వి. పూర్ణానంద శర్మ

## కళ్లతో నడుస్తున్నా!

నేను కాలుపెట్టిన చోటు
నాదన్నాడు రాముడు!
కాదు నాదే
బాబరు నాటిదన్నాడు భాయీ రహీమ్!
ఇరువురు నాకాళ్లపై కన్నేసి వుంచారు
ఈశ్వరఅల్లా తేరేనామ్‌కు శిలువ సిద్ధంచే
శారు!
ఊటిలో ఉత్తరాది గజల్ ఊడలు దిగింది...
ఢిల్లీలో దక్షిణాది 'భరతం' దర్బారెక్కింది!
కాశ్మీర్ యాపిల్
కన్యాకుమారీ దాకా కాళ్లుసాపింది!
ఈనేల ఎవరు తెచ్చినది
ఆనేల ఎవరు యిచ్చినది?
గిరాగిరా తిరిగే భూమికీ
జలజలా పారే నీటికీ
బిరబిరా ప్రాకే గాలికీ
గిరిగీయడం ఎవడితరం?
గాంధారీ నయనాల కేమి తెలుసు
సింధుత్రయం బిందువైన సొగసు?
ఇంగితజ్ఞానం లోంచి యీశ్వరుడు మాయ
మైనచోట
అడుగుపెడ్తే ఏమౌస్తుందో తంటా!
అందుకే-
కాళ్లు భుజాన వేసుకొని
కళ్లతో నడుస్తున్నా
పశువుతో, పక్షితో మనిషిని కొలుస్తున్నా!!

-జీప్సీ

నాడు రమ్మన్నది.

మరునాడు రాంబాబు వెళ్లేసరికి చేతులు తుడుచుకుంటూ డాక్టర్ వరండా లోకి వచ్చిందప్పుడే.

రాంబాబు ఆమెకు నమస్కారం చేసి వచ్చినపని చెప్పాడు. ఆమె సాధారణంగా తన రిజిస్టర్‌ను ఎవరి చేతికీ ఇవ్వదు. ఆఫీసు గదిలోకి అతడిని తీసుకువెళ్లి "మీరిలా కుర్చీలో కూర్చోండి. నేను రిజిస్టరు తిరగ వేస్తాను" అంటూ బల్లమీదున్న రిజిస్టరులో పేజీలు తిప్పుతూ-

"మీరామెను గుర్తు పట్టగలరా?" అడిగింది.

"గుర్తు పట్టగలను కాని మనిషి ఉంటే గదా?"

డాక్టర్ నవ్వుకుంది. "పదేళ్లకు పైగా జరిగిన సంగతి నేనెట్లా చెప్పగలననుకుని వచ్చారు? ఒక వేళ ఆమె ఇక్కడే పురుడు పోసుకున్నా ఇంతవరకూ ఇక్కడే ఉంటుందనుకుని వచ్చారా? అసలు ఐదవరోజే పంపించేస్తాను. ఎవరోగాని పది రోజుల వరకూ ఉండరు" అంటూ రిజిస్టరులో ఒక పేజీలో

## మనశ్శాంతికి మందులా?

వేలు పెట్టి మూసింది.

"మీకు ఆమె బంధువా? ఆమెను మీరే వచ్చి ఇంటికి తీసుకువెళ్లారా?"

"ఆమె నా స్నేహితుడి భార్య అని సంగతంతా వివరించి చెప్తూ ఆమె ఎక్కడున్నదో తెలియటం లేదు. నా స్నేహితుడు ఇంచుమించుగా పిచ్చివాడైనాడు" అన్నాడు.

"అయితే ఈ ఫొటోను చూడండి. ఈ ఫొటోలో ఉన్న ఆమె పేరు కూడా సంధ్యే." వేలు పెట్టి చూపించింది.

రాంబాబు ఫొటోను గుర్తు పట్టి పురిటికి సంబంధించిన వివరాలు తన డైరీలో రాసుకున్నాడు.

"డాక్టర్. ఈ ఫొటో కాపీ ఒకటి నాకిప్పించగలరా?" అర్థించాడు.

"నా దగ్గర ఒకే ఒక కాపీ ఉంది. నెగిటివ్ ఇస్తాను. మీరు మళ్లీ నాకు అందజేయాలి" గంభీరంగా అన్నది.

"ఫొటోగ్రాఫర్ ఇవ్వగానే మీకు అందజేస్తాను." ఆమెకు కృతజ్ఞతలు చెప్పి బయలుదేరాడు. ఇంత సులభంగా పనిపూర్తి అవుతుందని అతడనుకోలేదు కాని- ఆమె ఎక్కడున్నదో తెలుసుకోవాలి" నొసలు రుద్దుకున్నాడు.

ఆ రోజే అతడు ఆఫీసుకు వెళ్లి సంధ్యను గురించి వాకబ్ చేశాడు. అక్కడ ఆఫీసర్ "ఇన్ని సంవత్సరాల ఫైళ్లు వెతకటం సాధ్యం కాదు. అయినా ప్రయత్నిస్తాను. బహుశః పదిరోజులు పట్టవచ్చు" అన్నాడు.

రాంబాబు క్లార్కు చేతిలో పాతిక రూపాయలు పెట్టి ఫైలు తియ్యమని చెప్పి, ఫొటోగ్రాఫర్ దగ్గరికి వెళ్లాడు.

ఆ ఊళ్లోనే అతడికి నాలుగు రోజులు పట్టింది పని కావటానికి. అక్కడి నుంచి బస్సులో ఆరుగంటలు ప్రయాణం చేస్తే రైల్వే స్టేషన్ వస్తుంది. అక్కడి నుంచి పన్నెండు గంటల ప్రయాణం చేస్తేగాని తనకు లభించిన సమాచారాన్ని మిత్రుడికి అందజేయలేదు.

(ముగింపు వైవారం)

# ప్రశ్నావళి

**— కె. రామలక్ష్మి**

_కె.శ్యామల. కలకత్తా_

**15-9-89** సంచికలో జి.వి.ఆర్. మూర్తి హైదరాబాద్ గారికిచ్చిన జవాబు చూశాను. ఓహ్! బ్రహ్మాండమైన సత్యాన్ని ప్రతి ఒక్కరికి తెలియపరిచేది రాశారు. ఎవరి ప్రశ్న అడు గుతారా ఎలాంటి జవాబు రాస్తారా అనుకున్న నాకు మీ జవాబుతో అక్షర లక్షలు విలువ చేసే నిజాన్ని తెలిపారు. అందుకే నాకు మీరంటే చాలా.....చాలా అభిమానం. నిస్సంకోచంగా నిర్మొహమాటంగా నిజాల్ని చెప్తుంటారు.

*

థ్యాంక్స్ శ్యామలా, నిజం చెప్పి అందరి చేతా దీవెనలు తింటూ వుండే నాకు నీ పొగడ్త కొండంత బలాన్నిచ్చింద నుకో. నాకు నిజం చెప్పేస్తే పోయి- డొంక తిరుగుడుగా చెప్తే- నే చెప్పాలను కున్నది చెప్పలేను. నా నూటి మాట స్నేహితుల్ని కన్న శత్రువులనే పెంచింది. అయినా ఒకటీ అరా అభిమానులు అప్పు డప్పుడిలా వెన్ను తట్తుంటారు (తెలుసో లేదో నా శత్రువులు కూడ తిట్టుకుంటూనే చదువుతూ వుంటారు! నాక్కావలసినదీ అదే.) రియాక్షన్ చూపని వాళ్లు, కోపం తెచ్చుకోని వాళ్లు ఎక్కువగా వుంటే బాగుం డదు! ఏమంటారు?!

_జి. రమాదేవి. హైదరాబాద్_

**కష్టాల్లో ఆదుకోని స్నేహితులెందుకు?**

*

పొరపాటు రమా! కష్టాలు, దుర దృష్టం-మనం స్నేహితులనుకనే వాళ్లని ఒడ పోసి తేల్చి వేస్తుంటాయి. నిజమైన స్నేహి తులెప్పుడూ-నీ పక్క వుంటారు-కష్టంలో, సుఖంలో.

_ఎల్.పి.చంద్ర. ధర్మవరం_

**అక్కయ్యగారూ మీ దృష్టిలో విదేశాలు గొప్పవా? మనదేశం గొప్పదా?**

*

దేనిగొప్ప దానిదే. అలా పోల్చి చూడడానికేం లేదనిపిస్తుంది నాకు.

_పి.నాగేశ్వరరావు, అనకాపల్లి._

**సృష్టిని నిర్వచించండి?**

*

ఏ సృష్టినో చెప్పకపోతే ఎలాగండీ?

_కె.రామచంద్రరావు, అయిజ._

**ఒక పక్క ఇంటర్ ఫేలవుతానేమో అన్న భయం. మరో పక్క ప్రేమలో ఓడిపోతా నేమో అన్న బాధ. ఈ రెంటిలో విజయం పొందేమార్గం చెప్పరూ?**

*

ఇంతకీ మీవయసెంత? ఇంట రేనా పాసపక ప్రేమ వ్యవహారం ఏమిటి? ముందా చదువేదో గట్టెక్కించి నాలుగు రాళ్లు సంపాదించే మార్గం చూడండి. ప్రేమ కేం ఎప్పుడేనా ప్రేమించవచ్చు!

_జి.వెంకటేశ్వరరావు, హైదరాబాద్._

**మన జీవితం జరిగేది జరుగుతూనే వుంటుంది మధ్య బ్రహ్మరాత తలరాత జాతకాల రాత లెందుకు?**

*

పిరికితనం వల్ల. వర్తమానపు వెల్గులో మన జీవితపు పోస్టు చదవాలని ప్రయత్నిస్తాం. రాత మారుతుంది కదా- వెల్గు మారుతూంటే! నీడలు వాలినప్పుడు దృష్టి మారినప్పుడు-కాస్త ధైర్యం సడలి మనిషి-తెలియని 'రాత' ఏదైనా వుందేమో నని వెతుకుతాడు ఆశగా.

_టి.రవీందర్ రెడ్డి, వరంగల్._

**మహిళా మండలులు సంపన్న మహిళలకే పరిమితమా?**

*

ఎవరన్నారలా? వాళ్లకి క్లబ్బు లుంటాయి! నేడు నిరక్షరాస్యులైన మహి ళలు సహితం మండలులేర్పరచి-పొదుపు, చదువు, పనిపాటలు, ఆరోగ్యం మొదలైన వాటి నట్ల ఎంతో శ్రద్ధ చూపిస్తున్నారు. కావాలంటే బి.సి. టి.యలమంచిలి వంటి ప్రదే శాలు వెళ్లి చూసిరండి.

_జి.రమేష్ పట్నాయక్, రాయగడ._

**కలం స్నేహంపై మీ అభిప్రాయం ఏమిటి?**

*

కలం స్నేహం చెయ్యాలంటే- రాసే వారూ అందుకునే వారూ కూడ సంస్కారవంతులై వుండాలి.

_పోలోజు వెంకటాచారి, బోడుప్పల్._

**చదువు 'కునే' వారికంటే చదువు'కొనే' వారి సంఖ్య ఎక్కువ అవుతోంది. మీరేమం టారు?**

*

ఏముంది డిగ్రీ ఉద్యోగం కోసం కావాలి. చదివే ఓపిక లేనప్పుడు కొనే మార్గం వున్నప్పుడు హాయిగా కొనేస్తున్నారు. ఈ మధ్య థీసిస్సులు కూడా రాసిపెట్టే గురువులు వున్నారని తెలిసి ఆశ్చర్య పోయాను

_సిహెచ్. బాబూజీ, రాజమండ్రి._

**నేటి బ్రహ్మర్షి లాగే ఆ కాలపు విశ్వా మిత్రుడు కూడా ఎన్నెన్నో అవమానాలని సహిస్తూ జీవనం సాగించే వాడా విశ్వామి త్రుడు?**

*

ఒకటికి రెండు చూస్తూ ఎందుకీ అనుమానాలు?! సీరియల్ అయిపోగానే సినిమా చూస్తాం కదా. అసలు విశ్వామి త్రుడ్ని గురించి తరువాత ఎవర్నేనా అడిగి తెలుసుకోవచ్చు.

○




(గత సంచిక తరువాయి)

"నవ్యా.......!"

"నవ్యా......!"

పిచ్చిగా ఉన్మాదిలా అరుస్తున్న స్వాగత్ భుజం మీద చేయిపడడంతో ఉలిక్కిపడ్డాడు.

కళ్ళుతెరిచాడు.

ఎదురుగా నవ్య!! సాదానేత చీరెలో-తల చెరిగి-తనను కోపంగా చూస్తూ-చివాలున లేచి కూర్చున్నాడు.

మైగాడ్! ఎంత దారుణమైన పీడ కల? చెమటతో తడిసిపోయిన షర్ట్‌ను చూసుకున్నాడు. చెమటతో ధారలు కారుతున్న ముఖాన్ని తుడుచుకుని-నవ్యను చూసి నవ్వి అన్నాడు.

"నువ్వు వంటగదిలోకి వెళ్ళి తలుపేసుకున్నట్టు కలొచ్చింది......"

ఆమె మాట్లాడలేదు.

"వంట గదిలోకెళ్ళి బెడ్‌రూంలా తలుపేసుకోవాల్సిన అవసరం ఏమిటా అని ఆలోచిస్తున్నావ్ కదూ-"

"ఏ గదిలో కెళ్ళినా తలుపులేసుకోవాల్సిన అవసరం నాకు లేదు" కోపంగా అంది.

"కానీ నువ్వు ఆత్మహత్య చేసుకోడానికి-వంటగదిలోకెళ్ళినట్టు కలొచ్చింది. బైదిబై-అప్పుడు కూడా తలుపేసుకోవా?" అమాయకంగా అడిగాడు.

"అంత ఖర్మనాకేం పట్టలేదు-"

"ఈజిట్? అనవసరంగా కలలో చాలా కంగారుపడిపోయాను. ఈ సారి అలాంటి కలొస్తే తాపీగా పేపర్ చదువుతూ కూర్చుంటానయితే-"

ఆమె విసురుగా లేచి-తాను పడుకున్న మంచాన్ని దూరంగా లాగి దిండువేసుకుంది.

అతని మనస్సు బాధగా మూల్గింది.

"నా పక్కన పడుకుంటే నీక్కూడా అలాంటి పీడకలలొస్తాయని భయమా?"

"కలలో కాదు-వాస్తవంలోనే నాకు పట్టిన పీడవు నువ్వు-మెలకువలోనే పీడకలగా దాపురించిన రాక్షసుడివి-"

అని విసురుగా మంచం మీద పడుకుని-దుప్పటి కప్పుకుంది.

అతను మాట్లాడలేదు.

వెల్లికిలా పడుకుని-తిరుగుతున్న సీలింగ్ ఫ్యాన్‌ని చూస్తున్నాడు.

తాను కలలో కూడా ఊహించలేదు. తన జీవితం ఈ విధమైన మలుపు తిరుగుతుందని-

పిచ్చివాడిలా ఆశలు పెంచుకుని-ఊహల్లో తేలిపోతూ కలలుగంటున్న తన వెనుకనే దురదృష్టం నీడలా వెంటాడుతుందని ఊహించలేకపోయాడు.

మనిషికీ-దేవుడికీ తేడా భవిష్యత్తే-

భవిష్యత్తేవిటో తెలిసినప్పుడు - మనిషి దేవుణ్ణి నమ్మాల్సిన అవసరం ఉండదు.

బాబాలు-స్వామీజీలు-మనిషిలోని ఈ బలహీనత మీదనే ఆధారపడి-దాన్ని పెట్టుబడిగా చేసుకుని మహత్తరంగా బ్రతికేస్తున్నారు.

నవ్యతో తన జీవితం ఈ విధంగా ఉంటుందని తాను ఓ క్షణమైనా ఆలోచించగలిగితే-

అవును- ఏం చేసేవాడు?

తెలిసి ఇప్పుడు ఏం చేయగలుగుతున్నాడని?

కాదు...చేయాలి.....

ఏదో ఒకటి చేసి ఆమెను వశపర్చుకుని తన పందెం గెలవాలి.

తలపక్కకి తిప్పి చూశాడు.

అటు తిరిగి పడుకుంది నవ్య.

నిద్రపోయిందో-ఆలోచిస్తోందో తెలీదు.

ఒక్కసారిగా లేచి-ఆమెను బలవంతంగా తనదాన్ని చేసుకుంటే?

ఎవరాపగలరు తనను?

సంస్కృతీ-సాంప్రదాయం-కట్టుబాట్లు-అన్నీ తననే సమర్థిస్తాయి.

ఆమె తాను అగ్నిసాక్షిగా పెళ్లాడిన భార్య. గదిలో తామిద్దరూ వేరుగా పడుకున్నా- గది బయటి ప్రపంచానికి తామిద్దరూ ఏకశయ్యా గతులే! అలాంటప్పుడు తాను అనవసరంగా సెంటిమెంట్స్‌కు కట్టుబడి- చేతగానివాడిలా ఆమెకు దూరంగా బ్రతుకుతున్నాడేమో!

రౌతు మెత్తనైతే గుర్రం మూడు కాళ్ళ మీద నడుస్తుందట-

అది జంతువు-కానీ.....

ఛీ.....తానెంత దారుణంగా ఆలోచిస్తున్నాడు?

స్త్రీ గుర్రమైతే-మగాడు ఆమెను లొంగదీసుకునే రౌతయితే-

ఈ దేశంలో గుర్రాలు స్త్రీలతో రేసులు నిర్వహిస్తూ వినోదిస్తాయి కాబోలు-

గొంగళిపురుగు సీతాకోక చిలుకగా పరిణమించడం ప్రకృతి ధర్మం.

కరడుగట్టిన మనస్సు నవనీతంలా మారిపోవడం మానవ నైజం.

**ఇంతవరకూ సాగినకథ:- 4** పెళ్లయిన భార్యాభర్తలు ఆనంద లోకాల్లో విహరించే మధురాతి మధురమైన తొలిరోజు అనుభవాలను ఊహించుకుంటూ తన నవ్యతో వాటిని చవిచూడాలని లండన్ నుంచి వస్తాడు స్వాగత్. జీవితంలో కొత్త రహస్యాలు తెలుసుకొనే తొలిరోజున భార్య నవ్య నుంచి ఊహించని వ్యతిరేకత స్వాగత్‌కు ఎదురవుతుంది. పెద్ద వాళ్ల బలవంతం మీద జరిగిన ఈ పెళ్లి తనకు యిష్టం లేదని సంవత్సరం తర్వాత విడాకులు తీసుకోవాలన్న నిర్ణయానికి బద్ధుడై కొత్త కాపురం పెట్టేందుకు నవ్యను తీసుకువెళ్తాడు స్వాగత్. ఒకనాడు స్వాగత్-నవ్య పొందుకోరబోతాడు. కాని నవ్య ప్రతిఘటించి ఆగ్రహంతో కత్తితో పొడుచుకుంటుంది.

అందుకే-

తాను తన సర్వశక్తులూ ధారపోసైనా సరే-

ఆమెనే కాదు- ఆమె హృదయాన్ని గెలుచుకోవాలి-

ఆ రాత్రి గోడగడియారం మూడు గంటలు కొడుతుండగా నిద్రపోయాడు స్వాగత్

*** *** **** ****

సరిగ్గా అదే రోజు ఉదయం-

మద్రాస్-టినగర్-హబీబుల్లారోడ్‌లో-

అరంగనాయకం ఇంటి మేడ మీదున్న పోర్షన్‌లో-

గోడగడియారం ఐదు కొట్టింది. అప్పటికే నిద్రలేచిన శ్రీమతి ట్రాక్ సూట్‌లో మార్నింగ్ వాక్‌కి రెడీ అయింది. కుర్చీలో కూర్చుని షూలేస్ కట్టుకుంటూ-

"డాడీ కూల్......" హమ్ చేస్తోంది శ్రీమతి.

ఆమె ముఖం అప్పుడే విరిసిన గులాబీలా తాజాగా ఉంది.

ఆకుపచ్చ ట్రాక్ సూట్‌లో ఉన్న ఆమె-గులాబీ కొమ్మలా ఉంది.

లేస్ కట్టుకుని నిలబడి అరిచింది శ్రీమతి.

"పొన్నూ-అయాం గోయింగ్......"

రెండు క్షణాల్లో వంట గదిలో నుంచి బయటికొచ్చింది పొన్ను అనబడే పొన్నమ్మ! ఆమె శ్రీమతికి సర్వెంట్ కమ్ కుక్ కమ్ సెక్రటరీ కమ్ ఫ్రెండ్ కమ్.....ఇలా చెప్పుకుపోతే చాలా చాలా అవుతుంది.

గులాబి రంగు ఫ్రాక్ కింద ఆకుపచ్చ పైజమా వేసుకుని తెలుగు ఆడపడుచులా ఫ్రాక్ మీద పైట కప్పుకుని-చేతిలో కాఫీ కప్పుతో నిలబడ్డ ఆమెను చూసి ఫకాల్న నవ్వింది శ్రీమతి.

"ఎందుకు నవ్వుతున్నారు మేడం......" ఆశ్చర్యంగా అంది పొన్నమ్మ.

"మేరా భారత్ మహాన్!" అంది ఆవేశంగా శ్రీమతి.

"హాఁ! మేడమ్! హమారా భారత్ మహాన్!" అంది పొన్నమ్మ కూడా ఆవేశంగా.

"ఎందుకని?" అడిగింది శ్రీమతి.

"మీరన్నారు కదా మేడం? అందుకే....." అంది పొన్నమ్మ.

"షటప్! నేను అన్నది అందుక్కాదు.

తెలుగుదేశంలో పుట్టి- మద్రాసులో పెరిగి-కేరళ వాణ్ణి పెళ్ళి చేసుకుని-వాడి నొదిలి బెంగాలీ బాబుతో లేచిపోయి- కలకత్తా చేపల వాసన పడక- మళ్ళీ పంజాబీతో మద్రాసొచ్చి-వాడి తన్నులు భరించలేక చైనా కుక్ ని పెళ్ళి చేసుకుని-సెటిలయిన నిన్ను-అన్ని రాష్ట్రాల సంస్కృతిని దుస్తుల రూపంలో ప్రదర్శించే నీ జాతీయతా భావాన్ని చూసి నాకు ఆవేశం వచ్చిందంతే!" అంది శ్రీమతి-

"ఏంటో మేడం... ప్రతి రోజూ నా బట్టల గొడవ ఎత్తకపోతే మీకు తెల్లారదు. ఇంద.. ..కాఫీ తీసుకోండి....." అంది పొన్నమ్మ.

కాఫీ తాగి కప్ టేబుల్ మీద పెట్టి అంది శ్రీమతి.

"నేను వాకింగ్ వెళ్తున్నాను-"

"కారులో వెళ్ళండి మేడం! అసలే రోజులు బాగోలేవు...."

అమాయకంగా అంది పొన్నమ్మ.

ఫకాల్న నవ్వి గుమ్మం వేపు వెళ్ళిన శ్రీమతి-

అప్పుడే మోగిన ఫోన్ని చిరాగ్గా చూసింది.

పొన్నమ్మ ఫోనందుకుని-"అలో...." అని-

"మేడం...మీకే...." అంటూ శ్రీమతికిచ్చింది.

అవతలి వేపు మాట్లాడుతున్న వ్యక్తి పేరు విని-

ఆనందంగా-ఎక్సైటింగా అరిచింది.

"హాయ్....దుర్మార్గురాలా...ఏమైపోయావిన్నాళ్ళూ? అసలిప్పుడు ఎక్కణ్ణుంచి మాట్లాడుతున్నావ్? మైగాడ్...ఏమిటే అంత ముఖ్యమైన విషయమా?......నేను అక్కడికి రావాలా?......వస్తాను...నాకక్కడికి ట్రాన్స్ ఫర్ అయేలా ఉంది...అంచేత త్వరలో నేనక్కడికి శాశ్వతంగా రావొచ్చు......అసలింతకీ ఏమిటి విశేషం?.....చెప్పవే బాబూ......ఈ మధ్య నా చేతుల దురద తీరి చాలా కాలమైంది......అదేకేసా? వెరీగుడ్!.....

## లవ్ గేమ్

అయితే తప్పకుండా వస్తాను.....ఐసీ.....నువ్వేం దిగులుపడకు.....బీబ్రేవ్ మైడియర్ స్టుపిడ్.....గుడ్ బై....."

ఫోన్ పెట్టేసింది.

"ఎవరమ్మగారూ...." అడిగింది పొన్నమ్మ.

"నీ చైనా మొగుడి చెల్లెలు...."

"దొంగ ముండకేం కావాలంట? ఆడపడుచు కట్నం కోసమేనా?"

"కాదు. చైనా పాకిస్తాన్ సంబంధాల మీద భారతదేశం అభిప్రాయం ఏమిటో అడిగింది..." అనేసి వాకింగ్ కెళ్ళిపోయింది శ్రీమతి.

"ఏంటో.....ఒక్కోసారి మేడం చెప్పరాని తిక్కగా మాట్లాడుతుంది......"

అనుకుని-తన చైనా ఆడపడుచుని తిట్టుకుంటూ వంట గదిలోకి వెళ్ళిపోయింది పొన్నమ్మ.

సరిగ్గా ఆరున్నరకి ఇంటికి తిరిగొచ్చింది శ్రీమతి.

రాగానే స్నానం చేసి-పాలు తాగి-బాల్కనీలో కూర్చుని ఓ అరగంట పాటు పేపర్ చూసింది.

ఆ తర్వాత లేచి-

"పొన్నూ-కూరగాయలేం తేవాలో చెప్పు.." అంది బ్యాగ్ తీసుకుని.

పొన్నమ్మ చైనా సిల్కు రుమాల్ని స్కార్ఫ్ లా తలచుట్టూ కట్టుకుంటూ చెప్పింది.

"గోబీ-కుంటికూర-బ్రింజాల్స్-పచ్చిమొలగ వాంగ్ చెంగ్ బూ-"

"వాంగ్ చెంగ్ బూ? అదేం కూర?" అంది శ్రీమతి ఆశ్చర్యంగా.

"తెలీదమ్మా! చైనా భాషది-అలా అని అడగండి. వాడే ఇస్తాడు-"

శ్రీమతి నవ్వి కిందికి దిగింది.

తోటలో మొక్కలకి నీళ్ళు పోస్తున్నాడు ఆ ఇంటి ఓనర్ అరంగనాయకం...

శ్రీమతిని చూసి ఓ వెకిలి నవ్వు నవ్వాడు.

వీడికి బుద్ధి చెప్పాలంటే కుదరడం లేదు... అనుకుంటూ సైకిల్ స్టాండ్ తీసింది.

"ఏమ్మా...అప్పుడే సైకిల్ ఎక్కుతుండావ్. బజారుకు పోయి వూడుస్తావా?" అన్నాడు.

అతని నోరు మాట్లాడుతోంది-కళ్ళు మాత్రం బిజీగా ఆమె జీన్ ప్యాంట్ మూదాని మీది టీషర్ట్ నే చూస్తున్నాయ్.

సైకిల్ చైన్ సరి చేసే నెపం మీద కిందకు దిగిన శ్రీమతి-టీ షర్ట్ నెక్ లోకి తన డేగ కళ్ళను ప్రసరింప చేశాడు. అరంగనాయకం.

అతని గుండె ఆరంగుళాలు కిందకు జారింది.

అతని అవస్థ చూస్తున్న శ్రీమతిలోని మాన్ ఈటర్ సరదాగా నవ్వుకుంది.

"సైకిల్ అడ్డంగా ఉండాది- ఆ పంచ ఎత్తిపెడుతునా?"

ఓ గుటక మింగి అన్న అరంగ నాయకానికి యాభై ఏళ్ళు. భార్య లేదు. ఉన్న ఇద్దరు కొడుకులూ ఉత్తరాంధ్రాలో ఉద్యోగాల్లో సెటిలయారు.

'లేజీ మెన్స్ మైండీజ్ డెవిల్స్ వర్క్ షాప్' అన్నదానికి అతను ప్రత్యక్ష నిదర్శనం.

"ఏమమ్మా-తుని తీసుకుని ఊగుతూ ఉండావు-సైకిల్ క్లీన్ దా చేస్తువా?" అన్నాడు ఇంకా కిందికి వంగి సైకిల్ తుడుస్తున్న శ్రీమతిని మరో గుటక మింగి చూస్తూ.

శ్రీమతి మాట్లాడలేదు.

"ఆయిల్ మరకలు పోయి వూడుస్తదా?" అన్నాడు నవ్వుతూ-

శ్రీమతి సైకిల్ హాండిల్ పట్టుకుని చిన్నగా నవ్వి-

"గోర్బాచెవ్ అంకుల్-" అంది.

అసంకల్పిత ప్రతీకార చర్యలా చప్పన

## అమితాబ్ సవాల్!

దేశంలో యింకే సమస్యలూ లేనట్టు గత మూడేళ్ళుగా పార్లమెంటును దద్దరిల్లచేసి 1989 సాధారణ ఎన్నికల్లో కేంద్రంలో ప్రభుత్వం మారటానికి దోహదం చేసిన బోఫోర్స్ కుంభకోణంలో ఆరోపణలకు గురైన ప్రఖ్యాత సినీ నటుడు, మాజీ ఎం. పి. అమితాబ్ బచ్చన్ యిటీవల ప్రధానికి సవాల్ విసిరిన విషయం పాఠకులకు విదితమే.



ఈ కుంభకోణంలో తనకు సంబంధం వున్నట్టు రుజావు చేయలేకపోతే తనమీద ఆరోపణలు నిలిపివేసి పరిశుద్ధుడని ప్రకటించండి అంటూ అమితాబ్ ప్రధాని శ్రీ వి. పి. సింగ్‌ను సవాలు చేశాడు.

30 రోజులలో తనపై వచ్చిన ఆరోపణలకు తగిన సాక్ష్యాధారాలు వెలికి తీయాలని ప్రధానికి వ్రాసిన లేఖలో కోరాడట. మూడేళ్ళుగా చూపలేని ఆధారాలు 30 రోజుల్లో చూపెట్టి కొత్త ప్రభుత్వ సత్తా ఏమిటో చూపెట్టమంటున్నట్టుంది అమితాచ్ సవాల్. ఇదిట్లా వుంటే అమితాబ్ సోదరుడు అజితాబ్ బచ్చన్‌కు స్విస్ బ్యాంకు ఆరవ ఖాతా వుంగని స్టాక్‌హోం నుంచి వచ్చిన సమాచారాన్ని ఈ చెవిన విని ఆ చెవిన వదిలేస్తున్నాడు అమితాబ్. బోఫోర్స్ వ్యవహారంలో ఎఫ్. ఐ. ఆర్. దాఖలు చేసిన 14 మంది పేర్లలో అమితాబ్ పేరు లేకపోవటమే ఈ సవాలుకి కారణమేమో! మరి కొత్త ప్రభుత్వం ఏం చెయ్యబోతోందో వేచి చూడాలి!

---

కుడిచేత్తో తన బట్టతల నిమురుకుని-మిర్రి మిర్రి చూశాడతను.

అతనికి ఆస్తి మొత్తం సినిమా ఎక్స్‌ట్రాలకీ-రేసులకీ పెట్టి-పోయినా బాధ లేదుగానీ-జుట్టు ఊడిపోయినందుకు-విపరీతంగా బాధపడతాడు.

పైగా శ్రీమతి లాంటి అందమైన అమ్మాయి తననలా కామెంట్ చేసే సరికి అతను విలవిలలాడిపోయాడు-

"కోడి గుడ్డులో నాలుగు స్పూనుల కారం-ఓ స్పూను నూనె వేసి గ్రైండ్ చేసి-తర్వాత మూడు స్పూనులు పెట్రోలు పోసి క్రీంలా తయారు చేసి-అందులో కాస్త తేనె-నిమ్మకాయ రసం కలిపి-నెత్తికి మర్దన చేసి-అగ్గిపుల్ల గీచి మెల్లగా కాపడం పెడితే- బట్టతల మీద వెంట్రుకలు మొలుస్తాయట!" అంది శ్రీమతి.

"ఏమీ.....ఏమీ.....మళ్ళీ చెప్పు....."

అరంగనాయకం ముఖం చాటంతయి ఆతృతగా అడిగాడు.

"వచ్చాక చెప్తానంకుల్....బై....."అంటూ సైకిలెక్కింది శ్రీమతి.

కూరలు తెచ్చి పొన్నమ్మకిచ్చి ఆఫీస్ ఫైల్స్‌లో లీనమయింది శ్రీమతి! తొమ్మిదిన్నరకి ఓ యాపిల్-రెండు బ్రెడ్ స్లైసులు తిని టీ తాగి-కంచిపట్టు చీర కట్టుకుని-తల నిండా కనకాంబరపు మాల పెట్టుకుని-ఆఫీస్‌కి బయల్దేరింది.

"వాకింగ్ కెటూ కారు తీసుకెళ్ళరు. ఆఫీస్‌కైనా కారేసుకెళ్ళండి మేడం-" అంది పొన్నమ్మ.

"కారు సాయంత్రం షటిల్ కోర్టుకు వెళ్ళడానికే పొన్నా-అయినా నీకంత సరదాగా ఉంటే-సాయంత్రం కారులో విన్నలా షికారు తిప్పుకొస్తాలే-" అంది శ్రీమతి.

"ఒక్క రిక్వెస్ట్ మేడం!" అంది పొన్నమ్మ సిగ్గుపడుతూ

"ఏవిటది? కార్లో నీ చైనా మొగుడితో షికారెళతావా? నో పొన్నా నా కార్లో మగపురుగెక్కడం నేను సహించను" అని సీరియస్‌గా బస్ స్టాప్ వేపు వెళ్ళిపోయింది శ్రీమతి.

*** *** *** *** ***

స్వాగత్ ట్రావెల్స్ -

స్వాగత్ ఇంటీరియర్ డెకరేటర్స్ -

స్వాగత్ ఎంటర్‌ప్రైజెస్ -

వీటన్నింటికీ సెంట్రల్ అడ్మినిస్ట్రేటివ్ ఆఫీస్ అది.

అబిడ్స్ - రాజధాని కాంప్లెక్స్ - అయిదో అంతస్తు పూర్తిగా ఎయిర్ కండిషన్ చేసి - అత్యంత ఆధునికంగా ఉంది.

సరిగ్గా పది గంటలకు కారు దిగి -

ఆఫీస్‌లో ప్రవేశించి - తన ఛాంబర్స్‌లోకి నడిచాడు.

"మే ఐ కమిన్ సర్?"

సీట్లో కూర్చుని తలెత్తి చూశాడు స్వాగత్.

ఆఫీస్ మేనేజర్ రత్నాకర్ వినయంగా నిలబడి వున్నాడు.

"యస్. కమిన్..." అన్నాడు స్వాగత్.

రత్నాకర్ లోపలికి రాగానే అతని వెనకే ఆఫీస్ స్టాఫంతా లోపలికొచ్చారు.

రత్నాకర్ నవ్వుతూ -

"కొత్తగా పెళ్ళయిన మిమ్మల్ని విష్ చేద్దామని వచ్చాం సార్!" అన్నాడు.

"విష్ యూ హేపీ మేరీడ్ లైఫ్ సర్...." ముక్తకంఠంతో చెప్పారంతా. అతని పర్సనల్ సెక్రటరీ శైలజ అందమైన బొకేను అతని చేతి కందించింది.

"థాంక్యూ వెరీమచ్..." అన్నాడు లేచి నిల్చుని.

"మాదో కోరిక సర్!" రత్నాకర్ అన్నాడు.

"చెప్పండి...." నవ్వుతూ అన్నాడు స్వాగత్.

"మేడంగారిని చూడాలని మన స్టాఫంతా సరదా పడుతున్నారు అంచేత...."

స్వాగత్ పెద్దగా నవ్వేసి అన్నాడు.

"ఈజిట్? అయితే త్వరలోనే ఓ పార్టీ అరేంజ్ చేసి మిమ్మల్నందర్నీ మా ఇంటికి ఆహ్వానిస్తాను. ఓ.కే.?"

"థాంక్యూ సర్...." అన్నారంతా.

"యు ఆర్ వెల్‌కం ఫ్రెండ్స్!"

అందరూ వెళ్ళిపోయారు ఆనందంగా.

అటెండరొచ్చి అతని టేబిల్ మీదున్న బొకేను తీసుకెళ్ళి కారులో పెట్టాడు.

సిగరెట్ వెలిగించుకున్నాడు స్వాగత్.

ఆమెను గెలుచుకోడానికి తానీ రోజు నుంచే తన ప్రయత్నాలు ప్రారంభించాలి.

ఇక నుంచి ప్రతి క్షణం తనకు విలువైందే.

ఇంతకాలం - క్షణాల్ని డబ్బుతో కొలుస్తూ కాలంతో పరుగెత్తాడు. కానీ, ఇప్పుడు ప్రతి సెకనూ తన జీవిత గమ్యాన్ని మార్చే అమూల్యమైన వరమే!

అతను తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

ఫోన్ కాల్స్ రిసీవ్ చేసుకుంటూ - డిక్టే షనిస్తూ - అపాయింట్ మెంట్స్ ఫిక్స్ చేసు కుంటూ - ఈ విషయమే ఆలోచిస్తున్నాడు. ఈ సాయంత్రమే తాను తన పథకాన్ని ప్రారంభించాలి.

స్క్రిబ్లింగ్ ప్యాడ్ ని చేతిలోకి తీసుకొని దానిమీద రాశాడు.

(1) నవ్య (2) మీనాక్షి (3) దుర్గ (4) తను.

తోటమాలి - డ్రైవరు - కుక్ వీళ్లంతా ఎప్పుడూ ఇంట్లో ఉండే వాళ్లు కాదు.

ప్రస్తుతం ఇంట్లో ఉన్నది తాము నలుగురే!

ఆ తర్వాత ఇంటి ప్లాను గీశాడు.

తలుపులు - కిటికీలు - అన్నీ మార్కు చేసుకున్నాడు.

ఎవరి గది లోపల వారి పేరు రాశాడు.

అంతా సరిగ్గా ఉందో లేదో ఓసారి చూసుకున్నాడు.

ముందుగా అసలామెకు మగవాడి స్పర్శ ఎలా ఉంటుందో చూపించాలి. అంటే బల వంతంగా తాను ఆమెను కౌగలించుకుంటే....

ఆ అనుభవం అసహ్యంగా పరిణమించ వచ్చు.

మానసికంగా తన గాలి కూడా తగల నంత దూరంగా వెళ్లిపోయే ప్రమాదముంది.

అందుకే -

తనకు తానుగా ఆమే వచ్చి తనను కౌగలించుకోవాలి.

ఎలా?

ఎలా?

చేతిలోని సిగరెట్ యాష్ ట్రేలో పడేసి మరొక సిగరెట్ వెలిగించాడు. అదయిపో యాక - మరొకటి...

టేబుల్ మీదున్న ఇరవై సిగరెట్ల ప్యాకెట్ లో ఇంకా రెండు సిగరెట్లు మాత్రమే మిగిలి ఉండగా

సరిగ్గా అప్పుడు వెలిగింది అతని మన సులో -

ఫ్లాష్ !!

ఆనందంగా తన ఇంటి ప్లాను వేపోసారి చూసుకున్నాడు.

ఏవో చిన్న చిన్న మార్పులు చేసుకుని తృప్తిగా నిట్టూర్చాడు.

తొంభై తొమ్మిది శాతం తన పథకం విజయవంతం అవుతుంది.

ఫ్లాస్క్ లో టీని కప్ లో పోసుకుని మెల్లగా సిప్ చేయసాగాడు.

తన పథకాన్ని అన్ని కోణాలనుంచీ ఆలో చించసాగాడు.

మరో పది నిముషాల్లో - అతని మన సులో -

పకడ్బందీగా తయారైంది బ్రహ్మాండమైన పథకం.




## తోక లేదుగాని ఆంజనేయులంతటోడివి!

ఇది ఓ వాగ్బాణం అనుకోండి దీన్ని మరో వాగ్బాణంతో మీరు ఉపసంహరించాలి– ఆ "రిపార్టీ" గుచ్చుకోవాలే గాని బాధించకూడదు. రసభరితంగా వుండాలే గాని అశ్లీలం కొట్టవచ్చి నట్లుండరాదు. కార్డు మీద మాత్రం రాయాలి. ఈ వాక్యం పైన రాసి మీ ప్రతి వాక్యం దాని క్రింద రాయండి. మీ పూర్తి చిరునామా ముఖ్యం. ప్రచురించిన రెంటికి రు. 25, రు. 15 చొప్పున బహుమతి వుంటుంది!- ఈ విషయంలో సంపాదకునిదేతుది నిర్ణయం.

## 26-2-'90తేదీలోగా అందేలాగారిపార్టీలు పంపించాలి!

చాలా మంది వెంటనే "రిపార్టీ"ల వర్షం కురిపించారు. కొన్ని మాత్రం ఎంపిక చేసి వేస్తున్నాం. బహుమతులు పొందిన రెండూకాక– మరికొన్ని యిక్కడ వేశాము. తతిమ్మా వారి "వాగ్బాణాలు" స్థలాభావం చేత వేయలేక పోయాం. లాటరీ తీసి కొందరి పేర్లు మాత్రం వేస్తున్నాం! ఒకసారి బహుమతి రాలేదని నిరుత్సాహపడక మళ్ళీ ప్రయత్నించండి.

– ఎడిటర్

## లవ్ గేమ్

ఉత్సాహంతో ఈల వేయబోయి అది ఆఫీసనీ తాను బాస్ననీ గుర్తొచ్చి ఆగిపో యాడు.

*************

సాయంత్రం ఆరు గంటలు -

తోటమాలి అందించిన చిన్న పెట్టెను - అపురూపంగా అందుకున్నాడు స్వాగత్.

అగ్గిపెట్టెలా ఉన్న ఆ పెట్టెపైన చిన్న చిన్న రంధ్రాలున్నాయి.

"ఎన్ని?" అడిగాడు స్వాగత్.

"రెండు బాబూ?" అన్నాడు తోట మాలి.

"గుడ్ - నువ్వెళ్లు!"

వినయంగా నమస్కరించి వెళ్లిపోయాడు తోటమాలి.

పెట్టెలోపల గరగరమని చప్పుడు వినిపి స్తోంది.

అంటే బ్రతికే వున్నాయన్నమాట.

తృప్తిగా నవ్వుకుని - ఇంట్లో కొచ్చాడు స్వాగత్.

మీనాక్షి - నవ్య హాల్లో కూర్చుని మాట్లా డుకుంటున్నారు.

అతన్నిచూసి అప్రయత్నంగా లేచి నిల బడింది మీనాక్షి.

అక్కని మనసులో తిట్టుకుంటూ - గత్యంతరం లేక తానూ లేచి నిలబడింది నవ్య.

స్వాగత్ నవ్వుతూ నవ్యని చూసి -మీనా క్షితో అన్నాడు.

"భర్త ఆఫీస్ నుంచి రాగానే - ఏం చేయాలో మీ చెల్లికి చెప్పలేదా వదినగారూ"

"అవన్నీ చెబితే వచ్చేవి కావండీ బాబూ....స్వతహాగా రావాలి" అంది మీనాక్షి.

నవ్య వంటగదిలోకి వెళ్లిపోయింది.

"ఎక్కడికి నవ్యా?" అడిగాడు స్వాగత్.

"టీ తీసుకొస్తాను" గోడవేపు చూస్తూ అంది నవ్య.

"ఎందుకు?"

"ఎందుకేమిటి? తాగడానికి!" అంది చిరాగ్గా.

"ఎవరికీ - నాకా?"

"అవును. మీకే!" వస్తున్న కోపాన్ని బలవంతంగా నిగ్రహించుకుంటూ అంది నవ్య.

"ఎందుకు?"

చాచి చెంపమీద కొడదామనుకుంది నవ్య.

"అదేమిటండీ...మొగుడు ఆఫీసు నుంచి రాగానే ఏంచేయాలో అదే చేస్తోంది..." అంది మీనాక్షి.

పెద్దగా నవ్వాడు స్వాగత్.

## "సింగిల్ విండోచాలదు డబుల్ డోర్ కావాలి!"

* **రు. 25 బహుమతి పొందిన రిపార్టీ:**

"బాబూ! కాస్త సరిగాచూడండి! అది 'బాత్రూమ్' కాబోలు!"

-టి.రవిందర్‌రెడ్డి (వరంగల్)

* **రు. 15 బహుమతి పొందిన రిపార్టీ:**

"మన చేతికొచ్చింది ఖాళీ ఖజానా అన్న సంగతి మర్చిపోకండి సామీ!"

-తుర్లి రాజగోపాల్ (రాజమండ్రి)

### మరి కొన్ని వాగ్బాణాలు

"అవునండీ బాబూ! మీరు మాట్లాడేది విజయవాడ సిటీ బస్సుల గురించేగా!"

-ఘంటసాల ఫణీంద్రరావు (కరీంనగర్)

"అంత సొమ్ము లేదు సార్, కుటీరానికి అంతా ఖర్చయిపోయింది!"

-కె. శ్రీకాంత్ (గుళ్లపల్లి)

### లక్కీ పేర్లు

ఆర్. వీరరాఘవులు (సూళ్ళూరుపేట), కె. భానుకిరణ్ (కర్నూలు), జి. రమేష్‌బాబు (ప్రత్తిపాడు), ఎస్.ఆంజనేయులు (విజయనగరం), ఎ. బాబూరావు (సంగారెడ్డి), ఎన్. నారాయణరెడ్డి (అనంతపురం), బి. నారాయణ రావు (బుచ్చిరెడ్డిపాలెం), జె.యస్.పి. సాయిబాబు (భట్టిప్రోలు), కె.పరమేశ్వర ప్రసాద్ (సికింద్రాబాద్).

"భలేవారండీ బాబూ... ఆఫీస్ నుంచి రాగానే టీ ఇవ్వడానికి దుర్గ ఉందిగా? భార్య చెయ్యాల్సిన పని అదికాదు."

"మరి?" ఆశ్చర్యంగా అంది మీనాక్షి.

"భర్త గుమ్మంలోకి అడుగుపెట్టిగానే చిరునవ్వుతో ఆహ్వానించాలి" నవ్వింది మీనాక్షి.

"ఆ నవ్వేదో నవ్వరాదే పాపం.... ఆయన ఇబ్బంది పడిపోతున్నారు" అంది రంగులు మారుతున్న నవ్య ముఖాన్ని చూసి

"అది ఒక్కరోజులో వచ్చేది కాదులెండి. ప్రాక్టీస్ చేయాలి" అని తన గదిలోకి వెళ్లి - బీరువా తెరిచి బట్టల వెనుక భద్రంగా పెట్టాడా అట్టపెట్టెను.

ఆ రాత్రి -

భోజనాలయ్యాక - టెర్రెస్‌మీద కెళ్లాడు స్వాగత్.

సిగరెట్ వెలిగించుకుని పచార్లు చేస్తున్న స్వాగత్‌కి తమ శోభనం రోజు సన్నివేశం గుర్తొచ్చింది.

నవ్య తమ్ముడు సూర్యం బేగాన్ స్ప్రే తీసుకుని గదంతా స్ప్రే చేస్తుంటే అడిగాడు తను.

"ఎందుకు చేస్తున్నావ్ సూర్యం?"

సూర్యం నవ్వి చెప్పాడు.

"మీకు తర్వాత తెలుస్తుందిలే బావగారూ - ఏమీ లేదు. మా అక్కకి బొద్దింకలంటే చచ్చేంత భయం - ఉన్న పళంగా డ్రాకులావచ్చి మీదపడినా భయపడదు గానీ - చిన్న బొద్దింక కనబడితే చాలు భయంతో చచ్చిపోతుంది. అందుకే - ఈ రాత్రి మీకు ట్రబులివ్వకూడదని ముందు జాగ్రత్త!"

స్వాగత్ నవ్వుకున్నాడు.

అంతెందుకు? తనకి బల్లులంటే మహా ఎలర్జీ.

అలాగే నవ్యకి బొద్దింకలు -

ఈ రాత్రి ఆమె నిద్రపోయాక - అట్టపెట్టెలోని రెండు బొద్దింకలు - ఆమెకు తెలీకుండా ఆమె మంచంమీద వదుల్తాడు. ఒకటి దారి తప్పినా - రెండోదయినా ఆమె శరీరంమీద పాకక తప్పదు.

ఏవిటోనని లేచి నవ్య చూడక తప్పదు.

తన చేతిమీదో - కాలుమీదో పాకుతున్న బొద్దింకనూ మంచంమీద తన వేపే వస్తున్న మరో బొద్దింకను చూసి ఆమె విపరీతమైన భయంతో కెవ్వున కేకేస్తుంది.

తాను ఉలిక్కిపడి లేచినట్టు లేచి - ఏమైందని అడుగుతాడు.

ఆమె వణికిపోతూ - భయంతో - తనను

గట్టిగా - గాఢంగా - హత్తుకుని.....

అతని ఒళ్లు పులకించిపోయింది.

"దేవుడూ.... ఇలాంటి సమయాల్లో సహాయం చేస్తే - నీ మీద నాకున్న గౌరవం రెట్టింపవుతుంది. హెల్ప్ చెయ్ ప్లీజ్!"

ఆకాశంవేపు చూసి రెండు చేతులూ జోడించాడు.

వాచీ చూసుకున్నాడు.

తొమ్మిదన్నరయింది.

మెట్లు దిగి నెమ్మదిగా తన గదిలోకి వెళ్లి - బీరువాలోంచి అట్టపెట్టెను తీసుకున్నాడు. లోపల గరగరమన్న చప్పుడు.....

అతనికి రవిశంకర్ సితార్‌లా వినిపించింది.

లాల్చీ జేబులో పెట్టెను వేసుకుని బెడ్‌రూంలో కొచ్చాడు.

రెండు మంచాలమధ్య దూరం నాలుగుడుగులుంది. తన మంచం మీద పడుకుని కళ్లమీద చేయి అడ్డుపెట్టుకుని ఉంది నవ్య.





అతని అడుగుల చప్పుడువిని చేయితీసి అతన్నోసారి చూసి కళ్లు మూసుకుంది.

స్వాగత్ మంచం మీద కూర్చుని ఏదో పుస్తకం చదువుతున్నట్లు నటించసాగాడు.

అరగంట గడిచింది. ఆమె గాఢ నిద్రలోకి వెళ్లిపోయింది.

అతను నెమ్మదిగా లేచి - జేబులోని అట్టపెట్టెను తీసి - పిల్లిలా ఆమె మంచం దగ్గరకొచ్చి - పెట్టెమూత తీసి మంచంమీద పెట్టాడు.

అంతే!

పంజరం వదిలిన పక్షుల్లా హడావుడిగా బయటి కొచ్చాయి. రెండంగుళాల పొడవుతో

ఓ అంగుళం వెడల్పుతో - ముదురు ఎరుపు రంగుతో గోధుమ వర్ణపు రెక్కలు కొట్టుకుంటూ - పొడవైన మీసాలతో దారిని వెదుక్కుంటూ -

తమను ఇంతవరకూ బంధించిన నేరానికి

## లవ్ గేమ్

ప్రతికారం తీర్చుకునే వాటిలా కసిగా -

తెల్లటి దుప్పటిమీద నుంచి -

జరజరా పాకుతూ -

ఓ బొద్దింక - తెల్లటి ఆమె నడుము మీదకెక్కింది.

మరొకటి కాళ్లవేపు వెళ్లబోయి - హఠాత్తుగా ఏదో గుర్తుకొచ్చినట్లు వెనక్కి తిరిగి వేగంగా వచ్చి - ఆమె మెడమీద ఎక్కడానికి ప్రయత్నిస్తోంది.

స్వాగత్ ఖాళీ అట్టపెట్టెను జేబులో పెట్టుకుని -

మంచం మీద కూర్చుని పుస్తకం తెరిచి క్రీగంట ఆమెనే గమనిస్తున్నాడు.

నడుముమీద బొద్దింక అక్కడే నిలబడి ఆలోచిస్తోంది.

మెడమీద పాకిన బొద్దింక ఎటు వెళ్లిందోగాని కనిపించడంలేదు. ఉత్సుకతా - ఉద్విగ్నతతో ఆమెనే గమనిస్తున్నాడతను.

ఆమె కుడి చేయి మెల్లగా లేచి నడుమును తాకింది.

క్షణాలు లెక్క పెడుతున్నాడతను.

ఆమె చేతిని గమనించిన బొద్దింక జరజర ఆమె గుండెలమీదకు పాకింది.

ఆమె చేయి వేగంగా గుండెలమీద వెదుకుతోంది.

అయిపోయింది.

ఆమెకు మెలకువ వచ్చింది.

పట్టరాని సంతోషాన్ని బలవంతంగా నిగ్రహించుకుంటూ చూస్తున్నాడతను.

ఉలిక్కిపడి లేచి

భయంగా కంగారుగా చూసుకుంది నవ్య.

ఓరగా ఆమెనే గమనిస్తున్నాడతను.

తన గుండెలమీద కంగారుగా రెక్కలు విప్పి పరుగెడుతున్న బొద్దింకను చూసిందామె.

ఓ మనిషి

తనకన్నా చాలా చిన్నదైన కీటకానికి అంతగా భయపడగలదని తొలిసారిగా తెలుసుకున్నాడు స్వాగత్. ఆమె భయంతో వణికిపోతూ -

కెవ్వున అరిచింది.

సరిగ్గా -

సరిగ్గా ఆక్షణంలోనే జరిగిందాసంఘటన!

(ఇంకా వుంది)

# బీరు త్రాగినందువల్ల లాభం వుందా?



సరి "కొత్త" శీర్షిక

## హలో డాక్టర్! నేనేం చెయ్యాలి?

డా. కొత్త రవీంద్రబాబు

**కె. నాగేశ్వరరావు-తిరువూరు**

మూడు సంవత్సరముల క్రితం వేశ్యతో కలిశాను. పురుషాంగం మీద పొక్కులు, పొట్టులేస్తుంది.

సుఖవ్యాధులు సోకాయేమో డాక్టరును సంప్రదించండి. రక్త పరీక్ష చేయించుకుని వైద్యం చేయించుకోండి.

**ఎస్. సురేంద్రరెడ్డి-చిత్తూరు**

తొడలో పుళ్లు లేచి చీము రక్తం కారుతున్నవి. దురద.

గ్రిన్ఒడి గొట్టాం రోజుకొకటి చొప్పున ఇరవై రోజులు వాడి చూడండి.

**శ్రీరాములు-ధర్మవరం, అనంతపురంజిల్లా.**

ఆయాసం, ఉబ్బసం ఇంద్రియపుష్టి తగ్గింది.

ఉబ్బసం వలన శరీర శ్రమ చేయలేని స్థితి వచ్చివుంటుంది. ఉబ్బసం వ్యాధి పూర్తిగా నివారించలేము-కాని కొన్ని స్ప్రే మందులు వాడి వ్యాధిని అదుపులో వుంచవచ్చు.

ఉబ్బసం వ్యాధి అదుపులో వుంచాక ఇంద్రియ పుష్టికి మందులు వాడండి. యానిక్స్ గొట్టాలు భోజనానంతరం ఉదయం అయిదు సాయంత్రం అయిదు వాడండి.

**ఎం. నాగేశ్వరరావు-విశాఖపట్నం**

నాకు కుడి బీజం పైన ఉబ్బుగా వుంటుంది. నిద్రలో వీర్య స్ఖలనం జరుగుతుంది.

మీకు హెర్నియా వుండివుంటుంది. డాక్టరుకు చూపించుకోండి. అవివాహిత యువకులలో నిద్రలో వీర్య స్ఖలనం జరగడం సహజమే.

**డి.ఎన్.ఎం.ఆర్.**

నేను ప్రేమిస్తున్న అమ్మాయి వయసు 17 సం. వక్షోజాలు చిన్నవిగా వున్నాయి.

వయసుతో మార్పురావచ్చు. నాలుగైదు సంవత్సరాలలో మార్పు రాకపోతే ప్లాస్టిక్ సర్జరీవలన వుపయోగం వుంటుంది (ఇంప్లాంట్స్ వాడుతారు.)

**కె. జ్యోతి, డోన్**

19 సంవత్సరాలు. వక్షోజాలు చిన్నవిగా వున్నాయి. మనిషిని బలహీనంగా వున్నాను. బరువు పెరగాలి.

ఒర బోలిన్ రోజుకో బిళ్ల వాడండి. పళ్లు, పాలు, ఆకుకూరలు విరివిగా వాడండి. అవసరం అయితే ప్లాస్టిక్ సర్జన్‌ను సంప్రదించండి.

**టి. శ్రీనివాస్, తుని**

బీరు తాగినందువల్ల లాభం వుందా? సెక్స్ పుస్తకాలు చదివి సెక్స్ సినిమాలు చూచినందువలన సెక్స్‌మీద విరక్తి కల్గుతుందా?

బీరు తాగినందువలన ఏ ప్రయోజనమూ కల్గదు. అతి సర్వత్ర వర్జయేత్, తినగా తినగా వెగటుపుడుతుంది అన్న విషయం గుర్తుంచుకోండి.

**కె.ఎస్. రావు, మల్లాపురం**

జుట్టు పల్చగా వుంది నొసటినుండి 1 న్నర అంగుళాలు వెనక్కు వెళ్లింది. వయసు 20 సంవత్సరాలు.

మిన్ టాప్ మందు ఉదయం సాయంత్రం స్నానానంతరం 1 సి.సి. తలకు అంటే పుర్రెకు రాయండి.



**రాజశేఖరరెడ్డి, మామిళ్ళపల్లి**

వయసు 17 సంవత్సరాలు ఎత్తు 4అ. 6 అంగుళాలు. ఆకలి సరిలేదు. ఎత్తు పెరగాలి.

సంవత్సరంపాటు రాక్సిన్ రోజు వుదయం ఒకటి రాత్రి ఒకటి బిళ్లలు వాడండి. విటా పెప్సిన్‌టానిక్ భోజనానంతరం వాడండి.

**కె. మురళి, విజయవాడ**

జుట్టు వూడిపోతోంది. బట్టతల వస్తుందేమో?

వారం వారం క్లినిక్ షాంపూతో తలంటుకుని రోజు 2 సార్లు మింటాప్ మందు తలకు రాసుకోండి.

**వుయ్యూరు వెంకటేశ్వర్లు, వుయ్యూరు**

పుల్లని చల్లని వస్తువులు తిన్నా తడిచినా పిల్లికూత వస్తుంది.

సరిపడని వస్తువు తినకండి. పిల్లికూత వస్తే డెర్యుఫిలిన్ బిళ్లలుగాని కార్టాస్మిల్ బిళ్లలుగాని రోజు రెండు లేక మూడు వాడండి.

**ఎస్.శంకరాచారి, హైదరాబాద్**

మలబద్ధకం ఎలాపోతుంది. పక్షవాతం వైద్యం తర్వాత పూర్తి ఫలితంరాలేదు.

పళ్లు, ఆకుకూరలు ఎక్కువ భుజించి పొద్దున్నే రెండు గ్లాసుల నీరు తాగితే మలబద్ధకం పోవచ్చు.

ఫిజియోథెరపీ వలన పక్షవాతం రోగికి ఉపయోగం వుండవచ్చు.

**ఎం. సాయిరాం, కాకినాడ**

పొడుగు పెరగాలి. వయసు 17 సంవత్సరాలు.

రాక్సిన్ బిళ్లలు ఉదయం సాయంత్రం వాడండి.

**ఎం. వెంకటేశ్వరరావు**

మొటిమలు - హస్త ప్రయోగం వలన వస్తున్నాయి.

మీ అలవాటుకు మొటిమలు రావటానికి సంబంధంలేదు. సబ్బు బదులు సున్నిపిండి వాడి, రోజూ వొక టెట్రాసైక్లిన్ 250 మిల్లీ గ్రాముల బిళ్లవాడండి.

**కె. రవిబాబు, పెద్దాపురం**

నాకు టి.బి. వుంది. గిలక ఆపరేషన్ చేయించుకోవచ్చా?

దగ్గులేకపోతే చేయించుకోవచ్చు.

# న్యాయచట్టం ప్రశ్నలు-జవాబులు



అడ్వొకేట్: **బి.భాస్కరరావు** ఎం.ఎ., ఎల్.ఎల్.బి.

జి.వి. సూర్యనారాయణ, సావారుద్రవరం (కృష్ణాజిల్లా)

ప్రశ్న: 1965వ సంవత్సరములో మేము సాగుభూమి కొన్నాము. మొత్తము డబ్బు ఇచ్చి స్వాధీన ఎగ్రిమెంట్ వ్రాయించుకొన్నాము. రిజిస్ట్రేషన్ కాలేదు. తరువాత లాండ్ సీలింగ్ వచ్చింది. డిక్లరేషన్ ఫారములో మా పేరున సర్వేనంబరు వేసి యిచ్చాము. ఇప్పటి వరకు మేము సాగు చేస్తూ శిస్తులు మా పేరున కట్టుచున్నాము. పరపతి సంఘములో ఆ నెంబరుతో అప్పులు కూడా తీసుకొంటున్నాము. 24 సంవత్సరములు అయినది. రిజిస్ట్రేషన్ కాలేదని భూమి అమ్మిన వారికి హక్కు ఉన్నదా?

జవాబు: మీరు సాగుభూమి 1965వ సంవత్సరములో కొని సాగుచేస్తూ వచ్చినప్పటికి రిజిస్ట్రేషన్ కాలేదు గనుక మీ భూమి మీద అమ్మిన వారికి కూడా హక్కు వున్నది. అయితే భూమి మీరు కొని మీ స్వాధీనములో వున్నది గాబట్టి మీకు కూడా హక్కు వున్నది. 1976లో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఇచ్చిన తీర్పును కొట్టివేస్తూ 1982లో సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చింది. ఆ తీర్పు వివరాలు ఇవి:

ఆదిలాబాద్ జిల్లాలో మొహమ్మద్ అష్రపుద్దీన్‌కు 88 ఎకరాల మెట్ట భూమి వున్నది. 36 సర్వే నెంబరులోని 17 ఎకరాల భూమిని, 41 సర్వేనెంబరు లోని 11 ఎకరాలభూమి అగ్రిమెంట్ రాసుకొని ఒక వ్యక్తికి అమ్మివేశాడు. కాని రిజిస్ట్రేషన్ కాలేదు. మిగిలిన భూమిని కాగితము మీద దానంగా ఇచ్చినట్లు వ్రాసి తన కొడుకునకు ఇచ్చివేశాడు. ఆంధ్రప్రదేశ్ భూ సంస్కరణల (వ్యవసాయభూములు కలిగి వుండుట మీద పరిమితి) చట్టంలోని 8 సెక్షన్ క్రింద డిక్లరేషన్ దాఖలు చేశాడు. ఈ డిక్లరేషన్‌లో రెండు రిజిస్ట్రేషన్‌కాని విక్రయ దస్తావేజులు, దానపత్రం కూడా ఉదహరించలేదు. ఈ బదిలీలను భూ సంస్కరణల ట్రిబ్యూనల్ పరిగణలోనికి తీసుకొనలేదు. అతని భూమిని 1.7692 స్టాండర్డు హోల్డింగుగా లెక్కకట్టి, చట్టము ప్రకారము అతనికి ఒక స్టాండర్డు హోల్డింగునకు హక్కు వున్నదని నిర్ణయించారు. మిగిలిన 0.7692 స్టాండర్డు హోల్డింగ్‌ను సరెండర్ చెయ్యవలసిందని వుత్తర్వులు ఇచ్చారు. దీనిమీద అష్రపుద్దీన్ అప్పీలు పెట్టుకున్నాడు. అప్పీల్లేట్ ట్రిబ్యూనల్ కూడా అప్పీలు తిరస్కరించారు. అష్రపుద్దీన్ ఆంధ్రప్రదేశ్ హైకోర్టుకు రివిజన్ పిటిషన్ పెట్టుకున్నాడు. హైకోర్టు రివిజన్ పిటిషన్‌ను అనుమతించారు. దీనిమీద ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సుప్రీంకోర్టుకు అప్పీలు పెట్టుకున్నారు. సుప్రీంకోర్టు తీర్పులో చట్టంలోని 3వ సెక్షనులో "హోల్డింగ్" అన్న పదము భూమి అమ్మిన వారికి కొన్న వారికి కూడ వర్తిస్తుందని పేర్కొన్నారు. ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీ ప్రకారం "హోల్డ్" అనగా యాజమాన్యము, స్వాధీనము అని కూడా అర్థం వున్నది. 3వ సెక్షనులోని వివరణ ప్రకారం, భూమిపై ఇద్దరు వ్యక్తులకు హక్కు వున్నది. కనుక ప్రతివాదికి కూడ భూమిపై హక్కు వున్నదని సుప్రీంకోర్టు తీర్పు చెప్పింది. అంతే కాకుండా ఒక వ్యక్తి స్వాధీనములో భూమి వున్నప్పటికి విక్రయ దస్తావేజు రిజిస్ట్రేషను కానిదే అది సక్రమమైన పత్రముకాదు. అయినప్పటికి భూమి బదిలీపొందిన వానికి కూడా భూమిని స్వాధీనములో వుంచుకొనుటకు హక్కువున్నది. అతని స్వాధీనము నుండి భూమి బదిలీ చేసినవాడు తీసుకొనినప్పటికి భూమిని మరల అతను స్వాధీనము చేసుకొన వచ్చును, బదిలీ చేసినవాడు భూమిని స్వాధీనము చెయ్యమని దావా వెయ్యలేదు. విక్రయదస్తావేజు సంపూర్ణంగా లేనందు వలన అమ్మిన భూమి కూడ ప్రతివాది యొక్క హోల్డింగ్ క్రిందకు వచ్చునని సుప్రీంకోర్టు 1982లో తీర్పు చెప్పింది. 1976లో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఇచ్చిన తీర్పు కొట్టి వేసింది.

సుప్రీంకోర్టు తీర్పు ప్రకారం విక్రయ దస్తావేజు రిజిస్ట్రేషన్ కాలేదు గనుక అమ్మిన వారికి కూడా భూమిపై హక్కు వున్నది. అయితే అతను మీనుంచి భూమిని స్వాధీనము చెయ్యమని దావా వెయ్యలేదు. మీరు భూమికొని, మీరు సాగు చేసుకొని మీ స్వాధీనములో వున్నది గనుక మీకు కూడ హక్కు వున్నది.

ఎస్.వి. వి.ఆర్. గణేశ్‌బాబు, భిలాయ్‌నగర్.

ప్రశ్న :- ఇంటర్ మీడియేట్ నుంచి బి. ఎస్. సి. వరకు నా 5 సంవత్సరముల ఆర్థోఫిజికల్లీ హేండీకేప్డ్ స్కాలర్ షిప్పులు ఇప్పుడు ఇవ్వడానికి వీలు లేదని 11-5-1989 తేదీన విద్యాశాఖ డైరెక్టర్ తెలియపర్చారు. డైరెక్టర్ మీద దావా వెయ్యవచ్చునా?

జవాబు : - మీరు ఆర్థోపెడిక్ సర్జన్ నుంచి సర్టిఫికేట్లు తీసుకొని విద్యాశాఖ డైరెక్టర్‌కు పంపించారా? మీరు 1982 నుండి 1988 వరకు విద్యాభ్యాసం చేసినప్పుడు ఈ సర్టిఫికేట్లు తీసుకొని పంపి వుంటే మీరు తప్పక దావా వెయ్యవచ్చును. సర్టిఫికేట్లు మీరు పంపినట్లు వివరించలేదు. ఇప్పుడు స్కాలర్‌షిప్పులు మంజూరు చెయ్యడానికి సాధ్యం కాదు అని 11-5-1989 తేదీన డైరెక్టర్ పంపిన సమాధానంలో అథారిటీ కోడ్ చెయ్యలేదు. మీ వద్ద ఆధారాలు వున్నప్పుడు కోర్టులో దావా వెయ్యవచ్చును. ○

ఆంధ్రసచిత్ర వారపత్రిక

న్యాయ చట్టం-ప్రశ్నలు జవాబులు

ప్రశ్న: ............................................................

పేరు: ............................................................

పూర్తి చిరునామా: ............................................................

............................................................

# మూగబోయిన వేళ



కొచ్చెర్లకోట వెంకట సుబ్బారావు

## ప్రియమైన రాజాకు -

ప్రేమతో ఎన్ని సంవత్సరాలు గడిచిపోయాయో! నేను యింకా గుర్తున్నానో లేదో! ఈ మధ్య ఎందుకో నీవు మాటిమాటికి గుర్తొస్తున్నావు. అంటే యింతకుముందు నిన్ను మర్చిపోయానని కాదు. నా గుండె గుడిలో నీవు ఎప్పుడూ ఆరాధ్య దైవమే. క్షణం మరిచింది లేదు. నా మాటలు నీవు నమ్ముతావో లేదో, నమ్మినా నమ్మక పోయినా, నా మనసులోని మాట నీకు చెప్పందే నాకు తృప్తి లేదు. అందుకే నిన్ను చూగాలని, మనసు విప్పి మాట్లాడాలని ఎన్నోసార్లు ప్రయత్నించాను. కానీ ఎదురుపడటానికి ధైర్యం చాల్లేదు. నీవు నన్ను అసహ్యించుకుంటావని కాదు. నేను నీకు చేసిన అన్యాయానికి నాకే మనస్కరించలేదు.

నిన్ను మొదటిసారిగా చూసిన రోజు ఈనాటికి పచ్చగా వుంది. సాయం సంధ్యవేళ పచ్చ పరికిణీ కట్టుకుని, నీలిరంగు ఓణీ పైటగా కప్పుకుని అంచుల జాకెట్టు మధ్య అందాలు బయటపడకుండా పదిలపరుస్తూ వస్తుంటే ఏటి ఒడ్డుకు వాహ్యాళికై వచ్చి, నీవు నాపై విసిరిన మొదటి చూపు, బాణంలా నేరుగా గుండె లోతుల్లోకి దిగింది. సంభ్రమంతో నేను పైట సర్దుకుని, బిత్తర చూపులతో ముందుకు నడుస్తుంటే, నీ చూపులు నావెంట పరుగులెత్తాయి. వడివడిగా అడుగులు వేస్తూ ఒక్కవుదుటున యింట్లో పడ్డాను. ఆ రాత్రంతా ఏదో తియ్య తీయని వూహాలు నన్ను ఉక్కిరిబిక్కిరి చేశాయి. రాత్రంతా కలత నిద్రే. ఆ మధుర క్షణం ఎందుకో మరపురానిదైపోయింది. ఎన్నోసార్లు ఈ మాట నీకు చెప్పాలని తపనపడ్డాను. ఏదో సిగ్గు ముంచుకొచ్చి పెదవి వెంట మాట రానిచ్చేది కాదు. ఇన్నాళ్లకు ధైర్యం చేయుగలిగాను. ఇలా రాస్తూంటే భయం ఒక ప్రక్కవున్నా, వుండబట్టలేక రాస్తున్నాను.

మరోసారి శ్రావణ మంగళవారం నోముల కని పేరంటానికి మీ యింటికి వచ్చాను. నీవు వుంటావో, లేదో అని లోపల ఎంత దిగులుపడ్డానో, కానీ అదృష్టవశాత్తూ నీవు బయటకు వెళ్లలేదు. కాళ్లకు పసుపు రాస్తున్నా, కంటికి

కాటుక దిద్దుకుంటున్నా, నా కళ్లు నీ కోసమే గాలిస్తున్నాయి. అనుకోకుండా నీవు నడవలోకి వచ్చావు. నీ కళ్లు ఏదో వెతుకుతున్నట్లు నావంక చూశాయి. నా నవనాడులు కుంగిపోయినట్లు అనిపించింది. చకచకా శనగలు రుమాలలో కట్టుకుని కనీసం వెళ్లొస్తానని మీ అక్కకు చెప్పకుండా చక్కా వచ్చేశాను.

రాజా! ఆనాడు ఏ శనిదేవత నెత్తిన కూర్చుందో! మీ అమ్మగారు మా యింటికి వచ్చి "మా రాజాకు నీ వంటే ఎంతో ఇష్టం. నీకూ యిష్టమై వుంటుందిలే. లేకపోతే మా రాజా ఎందుకు నువ్వే కావాలంటాడు" అని నవ్వుతూ అంది. "ఏమే శశీ! రాజా అంటే నీకు యిష్టమేనా?" అని మా అమ్మ గెట్టించి అడిగింది. అలా నలుగురూ అడుగుతుంటే నేను బిక్కచచ్చిపోయాను. నేను 'అవును' అంటే ఎక్కడ ఎగతాళి చేస్తారోనని నేను 'అలాంటిదేమీ లేదు. నేను మీ అబ్బాయితో పన్నెత్తి మాట్లాడనైనా లేదు. ఇష్టాలు గిష్టాలు నన్ను అడక్కండి' అని ఉక్రోషంగా అన్నాను. దాంతో మీ అమ్మగారు చిన్నబుచ్చుకున్నారు. 'అవున్లే. ఇంటికొచ్చి పిల్లనడిగితే లోకువేలే అయినా మాకు బుద్ధి ఉండాలి' అంటూ విసురుగా వెళ్లిపోయారు. నాకు ఎంత బాధ కలిగిందో చెప్పలేను. నేను ఎందుకు ఆనాడు తొందరపడి అలా అన్నానో యిప్పటికీ నాకు అర్థం కాదు. ఇందులో మావాళ్ల తప్పు ఏమీ లేదు. నీపై నాకు మనసున్నట్లు వాళ్లకు తెలియదు. అందుకే ఇది జరిగిన కొన్నాళ్లకి నాకు పెళ్లి సంబంధాలు చూశారు. నాకు నచ్చినా నచ్చకపోయినా పెళ్లికి ఒప్పేసుకున్నాను. కాదని ఏం చెబుతాను? ఎలా చెబుతాను? అంది వచ్చిన అవకాశం జారవిడుచుకున్నానే అని ఆ తర్వాత ఎంతో బాధ పడ్డాను.

మావారు చాలా మంచివారు. నన్ను కంటికి రెప్పలా చూసుకున్నారు. ఏనాడు

## మూగబోయిన వేళ

నామాట కాదన్నదిలేదు. నాకు ఏ లోటూ రానియ్యలేదు. జీవితం ఎంతో తృప్తిగా గడిచింది. అయినా ఏదో వెల్తి నన్ను ఎప్పుడూ వేధిస్తూ వుండేది. ఎన్నోసార్లు నిన్ను చూడాలనిపించింది. నీవు పై చదువులకు పట్నం వెళ్లిపోయావన్నారు. అక్కడే నీకు ఉద్యోగం కూడా వచ్చిందట. మీ అమ్మా నాన్నా కూడా నీతోనే వుండిపోయారట. నీ గురించి మరి నాకు చెప్పినవాళ్లు లేరు.

ఎన్నో వసంతాలు గడిచిపోయాయి. ఇప్పుడు వృద్ధాప్యం ముంచుకువచ్చింది. ఆయన ఎప్పుడో కాలం చేశారు. ఉన్న ఒక్క కొడుకు దగ్గర ఒంటరిగా జీవితం ఈడుస్తున్నాను. ప్రేమించిన నీవు దూరమయ్యావు. కావాలనుకున్న వారు ఎప్పుడో వెళ్లిపోయారు. జీవితం ఎడారి అయిపోయింది.

కన్నబిడ్డ ప్రేమ ఎంతకాలమో తెలిసిందే! వాడి భార్య, వాడి, బిడ్డలు. అమ్మా అని మనసారా పలకరించడు. ఆ ఆలోచనే వాడికి రాదు. ఏదో వేళకు యింత తిండి పడేస్తారు. దాంతో వాళ్ల కర్తవ్యం తీరిపోయిందనుకుంటారు. అమ్మ మనసుతో వాడికి పనిలేదు. వాడు చేస్తున్నది తప్పు అనను కానీ జీవితమంటే తిండి, బట్ట ఒక్కటే కాదు కదా! మనసులేని మనుష్యులమధ్య జీవించడం కష్టమని అనిపిస్తోంది. కానీ ఎక్కడకు వెళతాను. ఎవరున్నారని?

అవసాన దశలో నేను గుర్తొచ్చానా అని నీవు అనవచ్చు. కానీ కొన్ని విలువలు జీవితం చరమ దశలో కాని తెలియవు. ఆ తృప్తితో ఈ జీవితం చాలించాలని నాకు లేదు. అందుకే నీ దగ్గరకు వచ్చేయాలని అనుకుంటున్నాను. రాజా! నీవు నాకు కొంచెం నమ్మకమిస్తావా?

ఇలా కోరుకోవటం చాలా వింతగా తోచవచ్చు. ఎవరూ ఇలాంటి కోరిక కోరకపోవచ్చు. మన సంప్రదాయం ప్రకారం చాలా తప్పు కావచ్చు. కానీ యిప్పుడున్న నా మనఃస్థితిలో ఇవన్నీ ఆలోచించలేను. నీవు కాదనవనే నమ్మకంతో నీకు ఉత్తరం రాస్తున్నాను.

నాకోసం నువ్వు ఎంత త్యాగం చేయలేదు. జీవితాంతం ఒంటరిగా వుండిపోలేదా! ఎంత ప్రేమ లేకపోతే జీవితాన్ని యిలా మోడువార చేసుకుంటావు. నాకంతా తెలుసు. నేను కాదన్న తర్వాత మీవాళ్లు నీ పెళ్లికి ఎన్నోసార్లు బలవంతం చేశారట. ప్రతిసారి నువ్వు మౌనంగా తిరస్కరించావుట. ఎంతకీ మనసులోని బాధ యితరులకు చెప్పేవాడివి కాదట. ఇదంతా నీకెలా తెలుసంటావేమో నాకే కాదు , నీ కథలు ఎవరికైనా తెలుస్తుంది. ఈమధ్య ఏమీ తోచక పత్రికలు తిరగేస్తూంటే నీకథ ఒకటి చదివాను. ఆ కథ యావత్తు మన గురించే! చదివి ఆశ్చర్యం వేసింది. అందుకే నీ అడ్రసు పత్రికాఫీసు నుంచి తెప్పించి నీకు ఉత్తరం రాస్తున్నాను. ఈ ఉత్తరం చదివిన వెంటనే వస్తావని వేయి కళ్ళతో ఎదురు చూస్తుంటాను.

ఇట్లు,

**మీ శకు.**

ఉత్తరం పోస్ట్ చేసి వచ్చాక కానీ శకుంతలమ్మకు తృప్తిగా లేదు. ఇంటికి రాగానే 'అమ్మా ఇందిరా! ఇంకా అబ్బాయి యింటికి రాలేదా!' అని అడిగింది. "ఏం వస్తారు? ఆఫీసులో చచ్చేంత పని. సంపాదించేది ఒకళ్లు తినేది పదిమంది. ఏం చేస్తాం? తప్పుతుందా?" అని వ్యంగ్యంగా అంది.

శకుంతలమ్మ చిన్నబుచ్చుకుంది. ఎందుకు అనవసరంగా పలకరించానా అని బాధ పడింది. అనేకసార్లు అనుకునేది ఎవరెలా పోతే తనకెందుకు అని. కాని కన్నకడుపు వుండబట్టదు. రోజూ మధ్యాహ్నం భోజనానికి యింటికి వచ్చేవాడు. ఈ రోజు రాలేదు. ఎందుకో ఏమిటో అని అడిగినందుకు కోడలితో ఈ ఎత్తి పొడుపు. కానీ ఏం చేస్తాం? ఒకరి పంచన పడున్నప్పుడు మాటలు పడక తప్పదు. అనుకుంటూ కళ్లు ఒత్తుకుంటూ మంచంమీద పడుకుంది.

"ఇదిగో, మందు తాగండి" అంటూ ఇందిర వచ్చింది.

మనసు కల్లోలంగా వుండటంతో మందు తాగబుద్ధి కాలేదు. బ్రతుకుదామనుకునే వాళ్లకు వంద మందులు కానీ, చావాలనుకునే వారికి ఒక్క మందు చాలదూ! అనుకుంటూ వద్దంది.

"మందులకు వందలు పోసి డాక్టర్లకు చూపించటం. మీరు మందులు పుచ్చుకోక



రోగం ముదర పెట్టుకోవడం. మీకేం? రోగం తగ్గకపోతే మరింత ఖర్చు మాకేగా!" అంటూ ఇందిర రుసరుస వెళ్లిపోయింది.

మనిషిమీద గౌరవం లేకపోతే ఏం మాట్లాడినా అమర్యాదగా మాట్లాడినట్టే వుంటుంది. శకుంతలమ్మ ఏమన్నా కోడలకు పెడర్థమే కనబడుతుంది. అందుకే ఈ విదిలింపులు.

"అమ్మకి వంట్లో ఇవాళ ఎలా ఉంది?" అంటూ కొడుకు రఘు లోపలకు వచ్చాడు.

"బాగానే వుంది రా" అని శకుంతలమ్మ అంటోందో లేదో ఇందిర వంటింట్లోంచి బాణంలా వచ్చి "ఎలా వుంటుంది? కాల్చుకు తింటోంది. ఒక మందు వద్దు. ఒక పత్యం పనికిరాదు. రోగాలు తగ్గమంటే ఎలా తగ్గుతాయి? అదేమంటే కోడలు గయ్యాళి అంటారు...అని జరిగినదంతా ఏకరువు పెట్టింది. దాంతో రఘుకి కోపం తారాస్థాయికి చేరుకుంది. "ఏమ్మా! మందు పుచ్చుకోకపోతే రోగాలు ఎలా తగ్గుతాయి? ఈ ముసలి వయసులో ఈ మాత్రం చూసే వాళ్లు కూడా ఎవరుంటారు? చెప్పు? ఇందిర కన్నకూతురులా నీకు వేళకు అన్నీ అందిస్తూంటే దాని మాట ఖాతరు చేయకపోతే ఎలా?" అంటూ నిష్ఠూరంగా మాట్లాడాడు.

శకుంతలమ్మ బాధతో కృంగిపోయింది. తను యిప్పుడు ఏమన్నదని యింత రాద్ధాంతం? ఏదో మనసు బాగోక మందు తర్వాత తీసుకుంటానన్నది. దానికి యింత రభస జరగాలి. ఈరోజే కాదు నిత్యం యింతే. ఇంటికి రాగానే తన మీద కొడుకుకు లెక్కలేని నేరాలు చెబుతుంది. వెనకాముందు ఆలోచించకుండా రఘు తన మీద విరుచుకు పడతాడు. తను ఏమైనా అంటే కోడల్ని కొడతాడు. దానికి కారణం కూడా తనేనని చివరకు అంటారు. అందుకే పట్టించుకోనట్లు పడుకుని పోయింది. ఎప్పుడు నిద్రపట్టిందో కూడా తెలియదు.

వెలుగురేఖలు వసారాలో పరచుకుంటూంటే కళ్లు తెరిపిన పడ్డాయి శకుంతలమ్మకు. ఏదో రిక్షా యింటిముందు ఆగినట్టు మసకగా అనిపించింది. ఎవరొచ్చారబ్బా అని అనుకుంది అప్పుడు అనిపించింది. తన రాజా వచ్చాడేమో నని. మూడు రోజుల క్రిందట వుత్తరం తను పోస్టు చేసింది కదూ! అందగానే వచ్చి వుంటాడు. తనూ రాజా హాయిగా కలిసి వుండొచ్చు. కొడుకు, కోడలి విదిలింపులు ఇక వుండవు. ఈ పని తను యింతకుముందే చేసుంటే ఎంత బాగుండేది. అయినా యిప్పుడు మించిపోయింది లేదులే అనుకుంటూ లేచి కూర్చుంది. నడుము స్వాధీనానికి రావటంలేదు. కళ్లు బైర్లు కమ్మినట్టున్నాయి. లేవబోయిన మనిషి వళ్లు

తూలి మళ్లీ మంచంలో కూలబడింది. ఎంతో ఓపిక చేసుకుంటే కానీ కూర్చోలేకపోయింది.

"రఘురాంగారి ఇల్లు ఇదేనా?" అన్న మాటలు విని 'అవును రండీ' అని చెప్పింది.

ఎవరో యువకుడు వసారాలోకి వచ్చాడు. "శకు అని ఎవరో ఈ యింట్లో వున్నారట" అని అడగగానే ప్రాణం చచ్చినట్టు అనిపించింది. తను ఉత్తరం చివర 'శకుంతలమ్మ' అని రాయల్సింది పొరపాటు జరిగిపోయిందని నొచ్చుకుంది. ఇప్పుడు పండుముసలి పడుచుపిల్లలా 'శకు'. నేనే అని ఎలా చెప్పగలదు? ఇంతలో యింటి తలుపు తెరుచుకుంది. కొడుకు, కోడలు బయటకు వచ్చారు. ఏమిటన్నట్టు ప్రశ్నార్థకంగా అతని వంక చూశారు.

"నేను రాజశేఖరంగారి అబ్బాయిని. మా నాన్నగారి పేర ఈ వుత్తరం వచ్చింది. ఎవరో 'శకు'ట రాశారు. శకుంతలగారు ఏమోనని తెలుసుకుందామని వచ్చాను" అన్నాడు.

"ఏది ఆ ఉత్తరం యిటు ఇవ్వండి" అంటూ ఆ యువకుని వద్దనుండి ఉత్తరం తీసుకున్నాడు రఘురాం.

శకుంతలమ్మకు కళ్లు బైర్లు కమ్మాయి. ఈ వృద్ధాప్యంలో ఎంత పొరపాటు చేసింది. ఏదో తెలియని ఆవేదనతో, నా అనేవాళ్లు లేరే అనే దుఃఖంతో రాజశేఖరానికి అలా ఉత్తరం రాసింది. ఇప్పుడు అది ఎవరో చేతుల్లో పడటం చివరకు తన కొడుకు కంట పడటం అంతా అయోమయంగా వుంది. ఇప్పుడు ఏమని సమాధానం చెబుతుంది? ఎంత తలవంపులు?

## మూగబోయిన వేళ

ఉత్తరం చదివిన రఘురాం మండిపడ్డాడు.

"ఏమ్మా! నీవేనా ఈ ఉత్తరం రాసింది?"

శకుంతలమ్మ ఏమీ బదులు చెప్పలేదు.

"అవున్లే ఎలా చెబుతావు? చేసిన నిర్వాకం అలాంటిది. ఇంత వయస్సు పైబడ్డాక యిలాంటి పెడబుద్ధులు పుట్టినప్పుడు."

ఈలోగా ఇందిర కూడా ఉత్తరం చదవటం పూర్తిచేసింది. నిప్పుతో ఉప్పులా చిటపటలాడుతూ "ఇదేం ఉత్తరాలో! ఇదేం ప్రేమలో. లోకంలో కనీ వినీ ఎరుగం. ఈడొచ్చిన పిల్లకు పెళ్లి చేయకపోతే వయసు మోజులో పడి ఎవరితోనో లేచిపోవడం ఎరుగుదుము. నడివయసులో వుండగా భర్తపోతే చాటుమాటు వ్యవహారాలు కంటే నేరుగా మరొకరితో వుండిపోవడం విన్నాం. కానీ కాటికి కాళ్లు చాపుకు కూర్చున్న ముసలమ్మ ప్రేమలు ఒలకబోయటమేమిటి? పైగా చిన్నప్పుడు ప్రేమించిన వాడితో లేచి వస్తానని వుత్తరాలు రాయటం ఏమిటి? అవ్వా! మా పరువు బజారుపాలు చేయాలనేగా ఈ దుర్బుద్ధి. మేము నలుగురిలో తలెత్తుకు తిరగగలమా?" అంటూ నోరు నొక్కుకుంటూ లోపలకు వెళ్లిపోయింది. తల్లి మొహం చూట్టానికే అసహ్యమన్నట్టు భార్య వెనుకనే రఘు వెళ్లిపోయాడు.

శకుంతలమ్మకు ఈ భూమి ఎందుకు బ్రద్దలవదా? అందులో తాను ఎందుకు జీవసమాధి కాలేదాని అనిపించింది. పడరాని బాధలు కొడుకు పంచన అనుభవిస్తూ వాటిని భరించలేక ఆదరణగా పిలిచే దిక్కుకోసం ఎదురుచూస్తూండగా, రాజశేఖరం ఒక్కడే దిక్కనిపించింది. అందుకే అతనికి అలా ఉత్తరం రాసింది. కానీ కథ ఇలా అడ్డం తిరుగుతుందని కలలోనైనా వూహించలేదు. ఇప్పుడు తను ఏమని బదులు చెబుతుంది.

"అమ్మా! నా పేరు శ్రీకాంత్. నా తల్లిదండ్రులెవరో నాకు తెలియదు. ఎక్కడో అనాథ శరణాలయంలో పెరుగుతున్న నన్ను రాజశేఖరంగారు యింటికి తెచ్చి కన్నబిడ్డకంటే ఎక్కువగా చూసుకున్నారు. జీవితంలో ఒంటరితనం భరించలేక, మరొక స్త్రీతో జీవితం పంచుకోలేక నన్ను పెంచుకున్నారు. ఎన్నోసార్లు మీ కోసం ఆయన వెతికారు. మీగురించి అప్పుడప్పుడు నాకు చెబుతూ వుండేవారు. మిమ్మల్ని కలవాలని, తన ఆవేదన మీకు చెప్పుకోవాలని ఆరాటపడేవారు. అవకాశం వచ్చినా ఆయన మిమ్మల్ని కలవలేదు. పచ్చని సంసారంలో చిచ్చుపెట్టటం భావ్యం కాదని తన కోరికను బలవంతంగా అణచుకున్నారు. ఇలాంటి రోజు వస్తుందన్న ఆశ కాస్త మిగిలివున్నా ఆయన యింకా కొంత కాలం బ్రతికివుండేవారేమో! కాని ఆయనకు ఈ అదృష్టం లేదు. అందుకే వారు ఈలోకం నుంచి వెళ్లిపోయారు. తండ్రిగారి పేరు శాశ్వతంగా వుండిపోవాలని ఆయన పేరుతో నేను కథలు రాస్తున్నాను.

మీరు నాకు తల్లిలాంటివారు. తల్లిలేని ఈ అనాథకు కాస్తంత ప్రేమను పంచండి. తల్లి ప్రేమంటే ఏమిటో, అది లేకపోతే జీవితం ఎంత వెల్తో నాకు బాగా తెలుసు. చూపు విలువ కళ్లున్న వాళ్లకంటే కళ్లులేని కబోదికి బాగా తెలుస్తుంది. మీరు రాజశేఖరం గారి అడ్రసు తెలుసుకోవడం ఉత్తరం రాయటం నిజంగా నా అదృష్టం. మీకు ఏ లోటూ రాకుండా కంటికి రెప్పలా కాపాడుకునే బాధ్యత నాది. రాజశేఖరంగారు వదిలి వెళ్లిన ఆస్తి అంతటికి ఆస్తి హక్కుదారులు మీరు. మా నాన్నగారు మనసిచ్చిన ఓ మాతృమూర్తికి సేవ చేసుకుంటూ ఆయన ఋణం తీర్చుకుంటాను" అంటూ ప్రాధేయపూర్వకంగా అర్థిస్తుంటే శకుంతలమ్మ కడుపు నిండిపోయింది. ఇన్నాళ్లు కన్నకొడుకు పెట్టిన కష్టాలన్నీ క్షణం మర్చిపోయి ఏనుగునెక్కినంత బలం సంపాదించింది.

మబ్బుచాటున మరుగునపడ్డ బాలభానుడు బయటకు తొంగి చూశాడు. తల్లికాని ఆ తల్లి చేయిపట్టుకుని శ్రీకాంత్ ముందుకు నడిపిస్తూంటే శకుంతలమ్మగారి కడుపుప్రేగు కలుక్కుమంది. ●

## బబ్బర్‌కి దెబ్బ

ప్రముఖ సినీ నటుడు రాజ్ బబ్బర్‌కు ఎడమ కంటికి గాయమైందట. "అగ్నికాల్" అనే చిత్రం షూటింగ్‌లో మరో నటుడితో ఫైట్ చేస్తుండగా ప్రక్కనున్న జీపు హెడ్ లైట్ తగిలి రక్తం కారిందట.

ఇదేమంత పెద్ద దెబ్బ కాదని, కంగారు పడాల్సిందేం లేదని, కొద్ది కుట్లు, కట్టుతో సరిపోతుందని డాక్టర్లు చెప్పారట. కొంత మంది డూప్ లేకుండా నటించేప్పుడే యిటువంటి ప్రమాదాలు ఎదురవు తుంటాయి. ఒక్కొక్కప్పుడు నటీనటులు అరచేతిలో ప్రాణాలు పెట్టుకొని షూటింగ్‌లలో పాల్గొంటుంటారు. గతంలో 'కూలీ'



చిత్రం షూటింగ్ సందర్భంగా అమితాబ్ గాయపడి చాలా రోజులు మంచం పట్టిన విషయం పాఠకులకు తెలిసిందే!

# సినిమా... సినిమా...



"ప్రేమచరిత్ర"లో రమేష్, చాందిని

వేల్చూరి వెంకట్రావు కథ, సంభాషణలు రాశారు. శంకర్ గణేష్ సంగీతం, పుష్పాల గోపీకృష్ణ ఛాయ, భాస్కరరాజు శిల్పం, శ్రీను నృత్యాలు, మాధవరెడ్డి-ఉదయభాస్కర్ చౌదరి సహకార దర్శకత్వం, బి. రాము - టి. సత్యనారాయణ ప్రొడక్షన్, ఆదుర్తి హరినాథ్ కూర్పు, రవికుమార్ నిర్వహణతో ఎస్. రఘునాథ్ సహ నిర్మాత. "హైదరాబాద్‌లో ఫిబ్రవరి 2 నుంచి షూటింగ్. రెండు షెడ్యూల్స్‌లో మార్చి నెలాఖరుకు పూర్తవుతుంది." అన్నారు నిర్మాత ఎస్. రమానంద్.

## "ప్రజల మనిషి" కృష్ణ

"సమాజంలో జరిగే అన్యాయాలను సహించలేక ప్రజలకు న్యాయం జరగడానికి కృతనిశ్చయుడైన గాడ్ ఫాదర్‌లాంటి పాత్ర కృష్ణగారిది. నేను పోలీస్‌అధికారిణి, నరేష్ లాయరు. ఈ చిత్రంలో రాజకీయాలేవీ ఉండవు" అన్నారు విజయనిర్మల. ఈమె దర్శకత్వంలో కృష్ణ సమర్పించే విజయకృష్ణా మూవీస్ 17వ చిత్రం "ప్రజల మనిషి"లో కోట శ్రీనివాసరావు, గిరిబాబు, సింహపురి సుధాకర్, ప్రభాకరరెడ్డి, పృథ్వి, రజని, మీనా, పండరీబాయి, అత్తిలి లక్ష్మి, ఫణి, హైదరాబాద్ కళాకారులు పాల్గొంటారు.

## "కిరాయి గూండా"

"నెగెటివ్ కేరెక్టర్‌గా మొదలయ్యే హీరో పాత్ర ద్వితీయార్థంలో పాజిటివ్‌గా మారుతుంది" అన్నారు ఎస్.ఎస్. రవిచంద్ర. ఈయన దర్శకత్వంలో అంగర సత్యం నిర్మించే రాజలక్ష్మి మూవీస్ "కిరాయి గూండా" చిత్రంలో కృష్ణ, భానుప్రియ, రమ్యకృష్ణ, మోహన్‌బాబు, గొల్లపూడి మారుతీరావు, సుధాకర్, నూతన్ ప్రసాద్, వై.విజయ, ప్రదీప్‌శక్తి, ఏలేశ్వరం రంగా, పవనకుమార్, చిడతల అప్పారావు, కె.కె. శర్మ, వగైరా తారాసందోహం. సత్యానంద్ మాటలు, రాజ్-కోటి సంగీతం, పుష్పాల గోపీకృష్ణ ఛాయ, శాయికుమార్ శిల్పం, సాహుల్ సాహసాలు, శివశంకర్ నృత్యాలు, మూర్తి ప్రొడక్షన్, మోహన్ సహకార దర్శకత్వంతో అంగర శ్రీనివాస్, అంగర విజయకుమార్ సహ నిర్మాతలు.

## "బొబ్బిలిరాజా" వెంకటేష్

"థ్రిల్లర్ వెయిన్‌తో సాగే యాక్షన్ ఎంటర్‌టైనర్. మొదటి సగం అడవి నేపథ్యంలో, రెండో సగం నగరం-గ్రామం నేపథ్యాలతో సాగుతుంది. జనవరి 3 నుంచి 20 వరకు కోయంబత్తూరు సమీపంలోని పొల్లాచ్చి అడవుల్లో షూటింగ్ జరిపాం. వెంకటేష్ సరసన బొంబాయికి చెందిన దివ్య భారతిని పరిచయం చేస్తున్నాం. అటవీ శాఖ మంత్రిణి వాణిశ్రీ. 'మంత్రిగారి మొగుడు' పేరుతో తప్ప సొంతపేరుతో పిలిపించుకోడానికి నోచుకోని భర్తగా సత్యనారాయణ, మంత్రిణి అన్నగా కోట

శ్రీనివాసరావు, కుమార్తెగా దివ్యభారతి నటిస్తున్నారు" అన్నారు సురేష్ ప్రొడక్షన్ ప్రైవేట్ లిమిటెడ్ అధినేత డి. రామానాయుడు. ఈ బ్యానర్‌మీద ఈయనిప్పుడు సమర్పిస్తున్న నాలుగో చిత్రం "బొబ్బిలి రాజా" సినిమా స్కోప్‌లో భారీ ఎత్తున తయారవుతోంది. పరుచూరి సోదరుల రచన, ఇళయరాజా సంగీతం, రవి ఛాయ, విజయన్ సాహసాలతో డి. సురేష్‌బాబు నిర్మాత. స్క్రీన్‌ప్లే, దర్శకత్వం బి. గోపాల్.

## టి.సుబ్బరామిరెడ్డి చిత్రం "సూర్య"

"వెంకటేశ్ సరసన మీనాక్షిశేషాద్రి నాయిక. సినిమా స్కోప్‌లో రూపొందుతోంది" అన్నారు ఎ. కోదండరామిరెడ్డి. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో టి. సుబ్బరామిరెడ్డి నిర్మించే మహేశ్వరి పరమేశ్వరి ఫిలిమ్స్ "సూర్య" చిత్రంలో శరత్‌బాబు, రావు గోపాలరావు, సత్యనారాయణ, నూతన్‌ప్రసాద్, అల్లు రామలింగయ్య, నిర్మల ఆదిగా గలవారు పాల్గొంటున్నారు. రచన: పరుచూరి సోదరులు, రచనా సహకారం: బాబూరావు. లక్ష్మీకాంత్ ప్యారేలాల్ స్వరకల్పనలో వేటూరి గీతాలు రాశారు. పి.ఎస్. ప్రకాష్ ఛాయ, గూనా ప్రసాద్ సంయుక్త దర్శకత్వం, పేకేటి రంగా శిల్పం, త్రినాథ్ కూర్పు నిర్వహిస్తున్నారు.



"కిరాయిగూండా"లో రమ్యకృష్ణ

## "కలియుగ అభిమన్యుడు"

"రమేష్‌బాబు, శాంతిప్రియలమీద ఊటీలో పిక్చరైజ్ చేసిన మూడు పాటలు హైలైట్స్ అవుతాయి. ముఖ్యంగా బ్రేక్‌డ్యాన్స్‌లో రమేష్‌బాబు హర్షధ్వానాలు అందుకుంటారు" అన్నారు ఎస్.ఎస్. రవిచంద్ర. ఈయన స్క్రీన్‌ప్లే,దర్శకత్వంలో డి. కాశీవిశ్వనాథరావు నిర్మిస్తున్న శ్రీ వెంకట పద్మావతి ఫిలిమ్స్ "కలియుగ అభిమన్యుడు" చిత్రంలో రావుగోపాలరావు, కోట శ్రీనివాసరావు, తార, ప్రసాద్‌బాబు, దేవరాజ్, సుధాకర్, మల్లికార్జునరావు, మాడా, నిర్మల, కుయిలీ తతిమా తారాగణం. సత్యమూర్తి, వేటూరి, హంసలేఖ, మహీధర్, విజయన్, బి. చలం, రఘురాం, శ్యామలరావు, కె.వి. రమణమూర్తి, భరత్, బి.వి.ఆర్. మూర్తి, పి. కోటి, శ్రీను, ధవళ చిన్నారావు, సారిక రామచంద్రరావు, వాసు, వెంకట్రావు, కోటగిరి వెంకటేశ్వరరావు, డి. అశోక్ ప్రభృతి సాంకేతిక వర్గంతో డి. సత్యనారాయణ సమర్పణ.




టికి మించిన సంఖ్యలో డెలిగేట్ కార్డులు, దానికన్నా ఎక్కువగా ఫ్రీపాసులు యధేచ్ఛగా నిర్వాహకులు పంచి పెట్టేసినందువల్ల పరిస్థితి చెయ్యిదాటిపోయి ఘర్షణాలు, కొట్లాటలు, కొండొకచో లాఠీఛార్జీలు- ఇవన్నీ మెయిన్ వెన్యూ దగ్గరే- కనులారా వీక్షించాల్సిన దురదృష్టం చాలా మందికి కలిగింది.

ఇంత అల్లరి జరిగినా, వచ్చిన చిత్రాల్లో చాలా భాగం ప్రేక్షకులకి, డెలిగేట్లకి ఆశించిన సంతృప్తిని ఆనందాన్ని కలగజేయడంతో వెంట వెంటనే సద్దుమణగడం కూడా జరిగేది. బయట ఏడు కమర్షియల్ థియేటర్లలో చూపిన ఫెస్టివల్ చిత్రాలను, థియేటర్లు ఎంత అధ్వాన్నంగా వున్నా లెక్కచేయక కలకత్తా చలన చిత్రాభిమానులు హౌస్‌ఫుల్స్ చేసి విజయవంతంగా ఫెస్టివల్‌ని నడిపించారు.

## గ్రీకు చిత్రం

గ్రీకు చిత్రంతో ప్రారంభమై సత్యజిత్ రే తాజా బెంగాలీ చిత్రం 'గణశత్రు'తో ముగిసిన ఈ పది రోజుల సినిమా పండగలో మొత్తం 45 విదేశాల నుంచి వచ్చిన 173 చిత్రాలు, మన దేశంలో తయారైన 46 ఫీచర్ చిత్రాలు, 11 డాక్యుమెంటరీలు ప్రదర్శించబడ్డాయి. సినిమా ఆఫ్ ది వరల్డ్ సెక్షన్ క్రింద ఈసారి ఒకే సమయాన రెండు థియేటర్లలో తాజా విదేశీ చిత్రాలు ప్రదర్శించి డెలిగేట్లందరికీ మంచి ఛాయిస్ ఏర్పాటు కలిగించారు. ఫెస్టివల్ నిడివిని 10 రోజులకి తగ్గించినా, ఈ పద్ధతి వల్ల ప్రదర్శించే చిత్రాలకి లోటు రాకుండా జరిగింది. ఇవికాక ఇండియన్ పనోరమా క్రింద 21 చిత్రాలు ట్రిబ్యూట్ టు అశోక్ కుమార్ పేరున ఆయన నటించిన 13 చిత్రాలు, ఇటీవలే విడుదలైన, విజయవంతంగా ఆడిన 12 మెయిన్ స్ట్రీమ్ ఇండియన్ ఫీచర్ ఫిల్ములు, ఛార్లీచాప్లిన్‌కి, లారెన్స్ ఒలీవియర్‌కి, పోలిష్ దర్శకుడు కీస్లోవిస్కీకి హోమేజ్ పేరుతో 34 చిత్రాలు జార్జియా (యు.ఎస్.ఎస్.ఆర్.)కి చెందిన ప్రముఖ దర్శకుడు ఒసెలియానీకి, సుప్రసిద్ధ ఇటాలియన్ దర్శకులు టావియాని బ్రదర్స్‌కి ట్రిబ్యూట్స్ పలుకుతూ వారి చిత్రాలు 8, జపాన్ దర్శకుడు కినోషిటా రూపొందించిన చిత్రాలు 11, ఫారిన్ రెట్రాస్పెక్టివ్ విభాగంలోను చూపిస్తూ, అదనంగా థర్డ్ వరల్డ్ సినిమాని కలుపుకునే ఉద్దేశంతో ఫోకస్ ఆన్ ఆర్జెంటినా పేరుతో 19 ఆర్జెంటీనా చిత్రాలు ప్రదర్శించడం జరిగింది. అంటే మొత్తం మీద 230 చిత్రాల ప్రదర్శన జరిగిందన్న మాట.

ఐతే, వీటన్నిటిలో మనసుకి బాగా హత్తుకుపోగలిగినవి, కథాగమనంలో గానీ, ఇతివృత్తంలో గానీ, చిత్రీకరణలో గానీ ప్రత్యేకతలు కలిగిన శభాషనిపించుకోదగ్గ చిత్రాలు వేళ్లమీద లెక్కబెట్టే సంఖ్యలో వుండగా, చూసిన వారందర్నీ కాసేపు మైమరపింపజేసి, క్షణికానందాన్ని అద్భుతంగా పంచి పెట్టిన చిత్రాలు ఇంకొన్ని వున్నాయి.

\- శంకు.

1) ఆస్ట్రియా చిత్రం 'కారకాస్' నుంచి ఒక దృశ్యం.
2) మైనైట్స్ఆర్ మోర్ బ్యూటిఫుల్ దేన్ యువర్ డేస్ (ఫ్రాన్సు) చిత్రంలో ఒక దృశ్యం.
3) హౌ టు మేక్ లవ్ టు ఎ నీగ్రో విదౌట్ గెటింగ్ టైర్డ్ (ఫ్రాన్సు / కెనడా) చిత్రంలో ఒక దృశ్యం.

సీరియల్

# వజ్రసంకల్పం

## సాతవాహన

(గత సంచిక తరువాయి)

జూడా ఆశ్చర్యంలోంచి తేరుకుంటూనే ఆనందం పట్టలేక చప్పట్లు చరిచాడు.

"స్ప్లెండిడ్! గ్రేట్! మార్వెలస్!" అతను డేవిడ్ వైపు చూశాడు. "నేను చెప్పలేదా డేవిడ్! షీ ఈజ్ గ్రేట్!" అంటూ మరోసారి పింకీ వైపు తిరిగాడతను.

"వెల్, వెల్, వెల్! మీ గురించి నా వూహ పొరపాటు కాదు మిస్ పింకీ! నేను తలపెట్టిన కార్యం సాధించాలంటే మీరొక్కరే సమర్థులు."

పింకీ ప్రశ్నార్థకంగా చూసింది.

జూడా సర్దుక్కూర్చున్నాడు.

"సరే, మరో ప్రశ్న అడుగుతాను. శాపగ్రస్తమైన వజ్రంగా ఓ గొప్ప వజ్రం చరిత్రలో చెడ్డపేరు తెచ్చుకుంది. ఏమిటా వజ్రం?"

ఆ ప్రశ్న అడుగుతుండగా జూడా కళ్ళు వజ్రాల్లా మిలమిలా మెరుస్తున్నాయి.

"హోప్ డైమండ్!" చెప్పింది పింకీ.

జూడా ప్రోత్సాహ పూర్వకంగా తలూపేడు.

పింకీ చెప్పడం ప్రారంభించింది.

"హోప్ డైమండ్ ఓ నీలంరంగు వజ్రం. చరిత్రలో ఇంతకంటే చెడ్డపేరు తెచ్చుకున్న వజ్రం మరొకటిలేదు. ఈ వజ్రానికి జన్మభూమి భారతదేశం. పూర్వం ఈ వజ్రం ఒక దేవాలయంలో సీతాదేవికి ఒక కన్నుగా అమర్చబడివుండేదట. ఎవడో దొంగ ఈ వజ్రం కాస్తా కాజెయ్యగలిగాడు. వెంటనే ఈ వజ్రం నీలం రంగులోకి మారిపోయిందట. అంతే కాదు. ఆ వజ్రాన్ని సంపాయించిన వాళ్ళకి సీతాదేవి శాపం కూడా వుందట. ఎవరిదగ్గరైతే ఆ వజ్రం వుంటుందో ఆ వ్యక్తి సర్వనాశనమైపోతాడన్నది ఆ శాపం. ఈ గాథ సంగతెలా వున్నా ఆ వజ్రాన్ని పొందగలిగిన వ్యక్తులు నిజంగానే సర్వనాశనమైపోవడం చరిత్ర గుర్తించిన సత్యం. బహుశా దాని వెనక అలాంటి చరిత్ర వుండడం వల్లనేమో ఆ వజ్రం శాపగ్రస్తమైందనే నమ్మకం అందరికీ ఏర్పడిపోయింది. ఏది ఏమైనా నీలివజ్రాలు చాలా అరుదుగా దొరుకుతాయి.

"1668 సంవత్సరంలో టావెర్నియర్ అనే యాత్రికుడు ఈ వజ్రాన్ని ఫ్రాన్స్ తీసుకెళ్ళాడు. అప్పట్లో అది 112 కారెట్లుండేది. ప్రఖ్యాతి చెందిన నవరత్నాల చరిత్రల్ని రికార్డు చేసిన మొట్టమొదటి చరిత్రకారుల్లో టావెర్నియర్ అగ్రగణ్యుడు. టావెర్నియర్ ఈ వజ్రాన్ని ఫ్రాన్స్‌లో పధ్నాలుగో లూయిస్ రాజుకు అమ్మేశాడు. ఆ తర్వాత టావెర్నియర్ రెండోసారి భారతదేశం సందర్శించినప్పుడు పిచ్చికుక్కలు అతన్ని చంపేశాయి.

"పధ్నాలుగో లూయిస్ 112 కారెట్ల ఆ వజ్రాన్ని 67 కారెట్ల వజ్రంగా కట్ చేయించి సానబెట్టించాడు. అప్పట్నుంచి దానికి ఫ్రెంచిబ్లూ అనే పేరొచ్చింది. 1789వ సంవత్సరంలో ఫ్రెంచివిప్లవం సంభవించింది. 1792లో ఫ్రాన్స్ రాజకుటుంబం మొత్తం విప్లవకారుల చేతుల్లో గిలోటిన్ కింద సంహరించబడ్డారు. అదే సమయంలో ఫ్రెంచిబ్లూ ఖజానా నుంచి దొంగిలించబడింది. ఆ తర్వాత 1830 వరకూ అది అజ్ఞాతంగానే వుండిపోయింది. అయితే, 1800వ సంవత్సరంలో అది స్పెయిన్ మహారాణి మేరియా లూయిసా దగ్గరుండేదని పరిశోధనలు తెలియజేస్తున్నాయి. విల్ హెల్మ్‌ఫాల్స్ అనే డచ్చి డైమండ్ కట్టర్ దాన్ని 44.5 కారెట్ల వజ్రంగా కోసి రూపురేఖలు మార్చేశాడనడానికి దాఖలాలున్నాయి. ఫాల్స్ కొడుకు హెండ్రిక్ అనేవాడు ఈ వజ్రాన్ని దొంగిలించాడు. వజ్రం పోయిందన్న దిగులుతోనే ఫాల్స్ కుంగి కృశించి, మంచం పట్టి చనిపోయాడు. ఆ తర్వాత హెండ్రిక్ ఆత్మహత్య చేసుకున్నాడు.

"1830లో హఠాత్తుగా లండన్లో 244.5 కారెట్ల నీలివజ్రం బయటపడింది. ఫ్రెంచి విప్లవకాలం నాడు అదృశ్యమైపోయిన 67 కారెట్ల ఫ్రెంచిబ్లూ అదేనని, అయితే ఎవరో దాని రూపురేఖలు తెలీకుండా వుండేందుకు 44.5 కారెట్లకు కోసేశారని నిపుణులు గుర్తించారు.

"ఆ తర్వాత హెన్రీహోప్ అనే వ్యక్తి దాన్ని కొనుగోలు చేశాడు. అప్పట్నుంచి దానికి హోప్‌డైమండ్ అని పేరొచ్చింది."

"ఆ తర్వాత హోప్ డైమండ్ చాలా చేతులు మారింది. ఓ యూరోపియన్ యువరాజు ఆ వజ్రాన్ని ఓ నటికి ప్రెజెంట్ చేశాడు. తర్వాత అదే యువరాజు ఆ నటిని షూట్ చేసి చంపేశాడు. మళ్ళీ ఆ వజ్రం ఓ గ్రీకు ఓనర్ చేతికెళ్ళింది. ఆ గ్రీకు ఓనర్ కుటుంబసమేతంగా ఓ ఆటోమొబైల్ యాక్సిడెంట్లో ప్రాణాలు పోగొట్టుకున్నాడు. టర్కీ సుల్తాన్ రెండో అబ్దుల్‌హమీద్ ఆ వజ్రాన్ని సంపాయించిన కొద్ది నెలల్లోనే 1909లో జరిగిన సైనిక తిరుగుబాటులో సింహాసనం పోగొట్టుకున్నాడు. ఈ విలిన్ వాల్ష్ మెక్లిన్ అనే అమెరికన్ మిలియనీర్ 1911లో ఈ వజ్రాన్ని కొనుగోలు చేసింది. ఆమె కొడుకు ఓ ఆటోమొబైల్ యాక్సిడెంట్లో ప్రాణాలు పోగొట్టుకున్నాడు. ఆమె భర్త పిచ్చాసుపత్రిలో చనిపోయాడు. ఆమె కూతురు 1946లో అతిగా నిద్రమాత్రలు మింగి ప్రాణాలు తీసుకుంది. ఆ మరుసటి సంవత్సరమే ఈవిలిన్ కూడా చనిపోయింది. ఆ తర్వాత ఓ న్యూయార్కు జ్యూయెలర్ హారీ విన్‌స్టన్ అనే ఆయన దాన్ని కొనుగోలు చేసి ఓ స్వచ్ఛంద సంస్థకు ఇచ్చేశాడు. అప్పట్నుంచి ఆ వజ్రంతో సంబంధంవున్న వాళ్ళెవరూ

**ఇంతవరకూ సాగినకథ:- 23** విశ్వధరవర్మకు తండ్రి అనంతరం మిగిలిన బీడు భూమిలో బావి త్రవ్వుతుండగా దొరికిన అపురూపవజ్రాన్ని అతని దాయాది అయిన వజ్రపాణి చేజిక్కించుకుంటాడు. వజ్రపు ఉంగరం తాకట్టు పెట్టేందుకు వచ్చిన ప్రభు అరెస్టయి తర్వాత విడుదలవుతాడు. వజ్రాల వ్యాపారి సుందరదాసుపై పరువునష్టం దావా వేస్తానని బెదిరించి ప్రభు అతని దగ్గర డబ్బు గుంజుతాడు. పింకీ, ప్రభు వ్యవహారాలను కనిపెడుతున్న జూడా, డేవిడ్‌లు తమతో చేతులు కలపమని కోరతారు.

# రవి కిరణ్ ఆర్ట్

## చిత్రంలో శారద

"విధి నిర్వహణలో చిత్తశుద్ధితో తన కర్తవ్యాన్ని నిర్వహించే ఒక డాక్టరమ్మ సంఘం నుంచి, కుటుంబం నుంచి ఎదుర్కొనే సమస్యలు, వాటి పర్యవసానాలతో అల్లబడిన కథ" అన్నారు వై. నాగేశ్వర రావు. ఈయన దర్శకత్వంలో జగదీశ్ రెడ్డి నిర్మించే రవి కిరణ్ ఆర్ట్ మూవీస్ తృతీయ చిత్రంలో ఊర్వశి శారద; భానుచందర్, సత్యనారాయణ ప్రధాన పాత్రధారులు. అంజనేయ పుష్పానంద్ కథ, చక్రవర్తి సంగీతం, రామారావు ఛాయ, రఘురాం నృత్యాలు, నరసింహారావు కూర్పుతో ద్వారంపూడి నరసారెడ్డి నిర్మాణ సారథి. ఎం. కొండలరావు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్‌గా ఎస్. గణేష్ సమర్పణ.



"ఖైదీదాదా"లో సుమన్, రాధ

## జయప్రదసమర్పించే "చిన్న"

"సమాజంలో జరుగుతున్న అన్యాయాలకు సామాన్య ప్రజలు ఎలా బలవుతున్నారో, వారు తిరగబడితే ఏమవుతుందో తెలిపే ఇతివృత్తం. గూండాయిజాన్ని అరికట్టే ఎస్.పి. తేజగా జయప్రద నటిస్తున్నారు" అన్నారు శ్రీ చక్రవర్తి. ఈయన దర్శకత్వంలో ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ శ్రీ రాంకుమార్ ప్రధాన పాత్ర నిర్వహించే శ్రీరాంకుమార్ ఫిలిమ్స్ "చిన్న" సినిమాస్కోప్ - స్టీరియోఫోనిక్ సౌండ్ చిత్రంలో వాణీ విశ్వనాథ్, రామిరెడ్డి, వేలు, జనకరాజ్, చంటి, చక్రవర్తి, మనోరమ, డాక్టర్ మురళీకృష్ణ పాత్రధారులు. సత్యమూర్తి రచన, బప్పీలహరి సంగీతం, ఎన్.ఎస్.రాజు ఛాయతో ఈ చిత్రాన్ని నిర్మించే రాజబాబు "రాజమండ్రి, విజయవాడ ప్రాంతాలలో నెలకు పదిరోజులు చొప్పున షూటింగ్ ముగించి, ఏప్రిల్ 3న మా అక్క జయప్రద పుట్టినరోజున విడుదల చేయాలనుకుంటున్నాం." అన్నారు.

## "అగ్నిసాక్షి"

"మహాభారత్ - టి.వి. సీరియల్‌లో అర్జున పాత్రధారి అర్జున్ హీరో. అమెరికాలోని డాక్టర్ ఎ.వి. కృష్ణారెడ్డి కథను సమకూర్చారు. కె. రాధాకృష్ణ సహకారంతో స్వీయ దర్శకత్వంలో నిర్మిస్తున్నాను" అన్నారు ఎం.ఎ. అజీజ్. అమెరికాలోని యూనివర్సల్ స్టూడియోలో చలనచిత్ర నిర్మాణ మెళకువలు తెలుసుకున్న ఈయన గతంలో కొన్ని సంస్థలలో ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్‌గా పని చేయడమే కాక "చెప్పింది చేస్తా, కిలాడి కృష్ణుడు" చిత్రాలు నిర్మించారు కూడా. శ్రీ సరోజా చిత్రాలయ పతాకంలో ఈయన రూపొందించే "అగ్నిసాక్షి" చిత్రం షూటింగ్ మార్చిలో ప్రారంభమై, జూన్‌లో విడుదలవుతుంది. ఓంకార్ మాటలు, రాజ్-కోటి సంగీతం, మహీధర్ ఛాయ, శివ-సుబ్రహ్మణ్యం నృత్యాలు, త్యాగరాజన్ సాహసాలు, వెంకటేశ్వరరావు కూర్పు నిర్వహిస్తున్నారు.

-జి.వి.జి.



"అంకితం"లోనూతననటిదిజయ రేఖ

# మూత్రపిండాల మార్పిడి


డా. కె. ప్రశాంత్ కుమార్
ఎమ్.ఎస్.,
(యూరాలజిస్టు)


**ప్ర: మనదేహంలో మూత్రపిండాల యొక్క ప్రాధాన్యత ఏమిటో వివరిస్తారా డాక్టర్?**

జ: మన దేహంలో మూత్ర పిండాల యొక్క పాత్ర చాలా విలువైనది. మన శరీరానికి కావల్సిన ద్రవపదార్థాలను తగిన పాళ్ళలో అందిస్తూ, ఎక్కువ తక్కువలను క్రమబద్ధం చేయడం, అలాగే రక్తంలోని మలినాలను ఫిల్టర్ చేయడం, మనం తీసుకున్న నీరు అవవసరమైన మేరకు బయటకు పంపించడం మూత్ర పిండాల ద్వారానే జరుగుతుంది. అనేక రకాలైన ఫ్లూయిడ్స్, సోడియం క్లోరైడ్ లాంటి పదార్థాలను శరీరానికి అందించడం ఎక్కువైన వాటిని యూరిన్ ద్వారా బయటకు పంపించి వేయడం జరుగుతుంది. అలాగే శరీరానికి అవసరానికి మించి ఉన్న 'బి' కాంప్లెక్స్, విటమిన్ 'సి' లాంటి వాటిని బయటకు పంపించి వేయడం జరుగుతుంది. అలాగే రక్త ప్రసరణపై కూడా ప్రభావాన్ని చూపుతాయి. 'రెనిన్' అనే హార్మోన్ కిడ్నీలలో ఉంటుంది. ఇది ఎక్కువగా ఉంటే రక్తప్రసరణ అధికం అవుతుంది. అలాగే రక్తంలో ఉండే ఎర్రరక్త కణాలు ఉత్పత్తి కావటానికి అవసరమయ్యే ఎరిత్రోపాయిటిన్ అనే హార్మోన్ కూడా కిడ్నిలో ఉంటుంది.

**ప్ర: మూత్ర పిండాలలో రాళ్ళు ఎందుకు ఏర్పడతాయి? మనం తీసుకునే ఆహారంలో ఉన్న రాళ్ళు ఏమైనా అడ్డుపడతాయా?**

జ: మనం తీసుకునే ఆహారంలో ఉండే రాళ్ళు మూత్రపిండాలలో ప్రవేశించి అడ్డుపడతాయని చాలా మంది అపోహపడుతుంటారు. కాని నిజానికి అలా రాళ్ళు అడ్డుపడవు. ఆహారంలో రాళ్ళు వుంటే అవి విరేచనంలో బయటకు వచ్చేస్తాయి కాని మూత్రపిండాలలోకి ప్రవేశించటానికి ఎట్టి పరిస్థితిలోనూ అవకాశం లేదు. మూత్రపిండాలలో ముఖ్యంగా మూడు రకాలైన రాళ్ళు ఏర్పడతాయి. కాల్షియం ఆక్సోలైట్, ట్రిపిల్ ఫాస్పేట్, యూరిక్ యాసిడ్, ఇవి రెండు నుంచి మూడు సెంటీమీటర్లు లావు ఉంటాయి. రేర్‌గా 10 సెం.మీ. రాయి. అయితే ఖచ్చితంగా రాళ్ళు ఎందుకు ఏర్పడతాయనేది ఇంకా పరిశోధనలలోనే ఉంది. అయితే కొన్ని ఇతర కారణాల వలన కూడా ఏర్పడేందుకు అవకాశం ఉంది. పేరా థైరాయిడ్ గ్లాండ్ అధికంగా పని చేయడం వలన బ్లడ్ కాల్షియం పెరుగుతుంది. అప్పుడు యూరిన్‌లో ఫిల్టర్ అవుతుంది. ఆ సందర్భములో కూడా రాళ్ళుగా మారవచ్చు. అలాగే యూరిక్ యాసిడ్ బ్లడ్‌లో ఎక్కువగా ఉండటం వలన కూడా రాళ్ళు ఏర్పడవచ్చు. అలాగే పదే పదే యూరిన్ ఇన్ ఫెక్షన్ రావడం వల్ల కూడా రాళ్ళు ఏర్పడవచ్చు. 24 గంటలలో 12 నుంచి 1500 ఎం.ఎల్. వరకు యూరిన్ బయటకు పోవాలి. అలా పోని పక్షంలో కూడా రాళ్ళు ఏర్పడవచ్చు.

**ప్ర: అయితే డాక్టరు గారూ! ఈ రాళ్ళను మందుల ద్వారా కరిగించవచ్చా?**

జ: మందుల ద్వారా రాళ్ళు కరగడమనేది చాలా అరుదైన సందర్భాలలోనే వీలుపడుతుంది. ముఖ్యంగా యూరిక్ యాసిడ్ వలన ఏర్పడే రాళ్ళను అది కూడా చాలా చిన్న సైజులో ఉన్న రాళ్ళను ప్రారంభ దశలో మందులు వాడటం వలన కరిగించవచ్చు. ఒకసారి రాళ్ళు ఏర్పడినటువంటి వారు జాగ్రత్తగా దీర్ఘకాలం మందులు వాడవలసి ఉంటుంది. అలాగే కొన్ని ఆహార నియమాలు కూడా పాటించాల్సి ఉంటుంది. బచ్చలి కూర, టమోటో తినకూడదు. కాఫీలు, టీలు లివర్ మాంసం, చేపలు తగ్గించాలి.

## కిడ్నీస్టోన్స్ గురించి

**ప్ర: కిడ్నీలో రాళ్ళు ఉంటే ముందుగా సూచనలు తెలుస్తాయా? లేదా ఎలాంటి పరీక్షలు చేయాలి?**

జ: ముఖ్యంగా వెన్ను ప్రాంతంలో ఒక ప్రక్కగా బాగా నొప్పి వస్తుంటుంది. ప్రారంభ దశలో ఉన్నప్పుడే ఈ నొప్పి బాగా వస్తుంటుంది. ముఖ్యంగా చిన్న సైజు రాళ్ళ వలనే నొప్పి అధికంగా వస్తుంటుంది. అలాగే యూరిన్ ఇన్‌ఫెక్షన్ కూడా వస్తుంది. యూరిన్ ద్వారా రక్తస్రావం జరుగుతుంటుంది. ఈ సందర్భములో నొప్పి కూడా ఉండదు. జ్వరం కూడా వస్తుంటుంది. ఇలాంటి సందర్భములో మంచి వైద్యునికి వెంటనే చూపించుకోవాలి. స్కానింగ్ ద్వారానూ, 'ఐ.వి.పి. ఎక్స్-రే' ద్వారాను మూత్ర పిండాలల్లో రాళ్ళు ఉన్నదీ లేనిదీ తెలుసుకోవచ్చు. ఈ రాళ్ళు మూత్ర పిండాలలోనే కాక మూత్రకోశంలోను, యూరెటెర్స్‌లోనూ ఏర్పడవచ్చు.

**ప్ర: మూత్ర పిండాలలో ఒకమూత్ర పిండం దెబ్బతింటే మనిషికి ప్రమాదమా?**

జ: ఒక మూత్రపిండం పని చేయనంత మాత్రాన ప్రమాదమేమీ ఉండదు. రెండవ మూత్రపిండంలో ఏవిధమైన అవాంతరం లేకపోతే మామూలుగానే యథాతథంగా జరిగిపోతుంది. అయితే ఏ పరిస్థితిలోనైనా రెండవదానికి కూడా ప్రమాదం జరిగితే మనిషి ప్రాణానికే ముప్పు రావచ్చు.









## మూత్రపిండాల రోగాలు-వాటివైనం

# గురించి మీకు తెలుసా?

ప్ర: 'డయాల్సిస్' అంటే ఏమిటి డాక్టర్?

జ: మూత్రపిండాలు పూర్తిగా పాడయిపోయి తాత్కాలికంగా కాని, దీర్ఘకాలికంగా కాని వాటిపాత్రను నిర్వహించలేనప్పుడు కృత్రిమంగా మూత్ర పిండాల విధిని బయట నుంచే నిర్వహించే పద్ధతిని 'డయాల్సిస్' అంటారు. ఒక్కొక్కసారి యాక్సిడెంట్స్‌లో అధికంగా రక్తంపోయి బి.పి. తగ్గిపోతుంది. అలాంటి సందర్భాలలో మూత్రపిండాలు దెబ్బతినవచ్చు. అలాగే కొన్ని రకాలైన మందులు విపరీతంగా వాడటం వలన కూడా తాత్కాలికంగా మూత్రపిండాలు దెబ్బతినవచ్చు. అలాంటి సందర్భాలలో డయాల్సిస్ అవసరమేర్పడుతుంది. అలాగే మూత్ర పిండాలు ఎందుకూ పనికిరాకుండా పాడయి పోయినప్పుడు తిరిగి వేరొకరి మూత్ర పిండాలు మార్పిడి చేసేంత వరకు డయాల్సిస్ చేయవలసి వుంటుంది.




## మార్పిడి

ప్ర: మూత్రపిండాల మార్పిడి గూర్చి వివరిస్తారా డాక్టర్?

జ: రెండు మూత్రపిండాలు పాడయి పోయినప్పుడు ఇతరుల నుంచి ఒక మూత్ర పిండాన్ని తీసి అమరుస్తారు. ఇందులో మూడు విధాలైన మార్పిడి ఉంటుంది. బ్రతికి వున్న వారి బ్లడ్ రిలేషన్స్, బ్రతికి ఉన్న ఇతరులు, చనిపోయిన వారిది. అయితే మన దేశంలో చనిపోయిన వారి మూత్రపిండాలు తీయడం నిషిద్ధం. అయితే మూత్రపిండాలు ఎవరివి పడితే వారివి సరిపడవు. అమర్చే ముందు అవి సరిపడతాయా లేదా అనేది పరీక్షలు చేసి చూసి ఆ తరువాతనే అమరుస్తారు. బ్లడ్ రిలేషన్స్ ఉన్న వారి మూత్ర పిండాలు అయితే సాధారణంగా సరిపడతాయి. లేక యూనీ ఓవిలర్ ట్విన్స్‌లో 100% సక్సెస్ అవుతుంది.

ప్ర: యూరినరీ సిస్టమ్‌లో వచ్చే కేన్సర్ గురించి వివరిస్తారా?

జ: కిడ్నీ భాగంలోనూ, యూరినరి బ్లాడర్‌లోనూ కేన్సర్ రావచ్చు. ముఖ్యంగా 40-50 సంవత్సరాలు పైబడ్డవారిలో అందులోనూ ఎక్కువ శాతం మగవారిలోనే కేన్సర్ వస్తుంటుంది. యూరిన్‌లో నొప్పిలేకుండా రక్తం పడుతుంటుంది. బ్లాడర్ కేన్సర్‌ను 'టి.వి.ఆర్.' అనే పరికరం ద్వారా ప్రారంభ దశలో నున్న కేన్సర్‌ను తొలగించవచ్చు. అంటే ఆపరేషన్ లేకుండా చేయవచ్చు. మూత్ర నాళం నుండి లోపలికి సన్నని పరికరాన్ని పంపించి కరెంటుతోటి కేన్సర్ భాగాన్ని తొలగించవచ్చు. ఈ ఆపరేషన్ ఒక గంటలో పూర్తి అవుతుంది. రెండు మూడురోజుల్లో పేషెంటు ఇంటికి వెళ్ళిపోవచ్చు.

కిడ్నీ కేన్సర్ అయితే మందులు పని చేయవు. వాటిని ఆపరేషన్ చేసి తొలగించివేయాలి. చాలా మందిలో యూరిన్‌లో రక్తం పడుతుంటుంది. అటువంటి వారు అశ్రద్ధ చేయకుండా వెంటనే యూరాలజిస్టుకు చూపించుకోవాలి. కొన్ని కేసులలో కేన్సర్ ముదిరితే రేడియం థెరఫీ కూడా ఇవ్వవలసి ఉంటుంది.

ప్ర: యూరాలజీకి సంబంధించిన వ్యాధులు గూర్చి వివరిస్తారా?

జ: మూత్ర విసర్జన చాలా కష్టంగా ఉండటం, యూరిన్ మంటగా అనిపించడం, యూరిన్ ఎక్కువగా రావడం, యూరిన్‌కు వెళ్ళే సందర్భాలు ఎక్కువ అవడం, నడుం ప్రక్క భాగంలో నొప్పిరావడం, గడ్డ ఏర్పడటం, బి.పి. అధికంగా ఉండటం, యూరిన్‌లో రక్తం పడటం ఇలాంటి వన్నీ యూరాలజీకి సంబంధించిన వ్యాధుల క్రింద వస్తాయి. ఇలాంటి సందర్భాలలో యూరాలజిస్టుకు చూపించుకోవాలి.

ప్ర: ఆపరేషన్ లేకుండా కిడ్నీలోని రాళ్ళను తొలగిస్తారంటారు. దాని గూర్చి వివరించండి డాక్టర్?

జ: 1980 సంవత్సరము వరకు కిడ్నీలోని రాళ్లను ఆపరేషన్ ద్వారానే తొలగించే



వారు. ఐ.ఎస్.డబ్ల్యు.ఎల్ (ఎక్స్‌ట్రా-కార్పోరియల్ షాక్ వేవ్ లితోట్రిప్సీ) అనే పద్ధతి ద్వారా మూత్ర పిండాలలో ఉన్న రాళ్ళను తీసి వేయవచ్చు. అంటే వ్యక్తి శరీరంపై భాగాన్నుంచే డైరెక్ట్‌గా కిడ్నీ భాగంలోకి షాక్ వైబ్రేషన్స్ పంపుతారు. దీనికోసం అధునాతనమైన కంప్యూటర్లతో కూడిన ఒక ప్రత్యేక గదిలో పేషెంటును ఉంచుతారు. పేషెంటు శరీరానికి వెన్ను భాగం దగ్గర షాక్ పెడ్ పరికరాన్ని ఉంచి కిడ్నీ భాగానికి షాక్ వేవ్స్ పంపుతారు. ఈ సందర్భంలో పేషెంటుకు ఎలాంటి బాధకాని, ఇబ్బంది కాని ఉండదు. ఎనస్థీషియా కూడా అవసరం లేదు. కిడ్నీలోని రాయి ఈ షాక్ వేవ్స్ వలన పౌడరుగా మారిపోతుంది. పౌడరు అయిన రాయి యూరిన్ ద్వారా బయటకు వచ్చేస్తుంది. ఒక గంట సమయంలో ఈ కార్యక్రమం అంతా పూర్తి అయిపోతుంది. అయితే దీనికి దాదాపు పదిహేను వేల రూపాయలు ఖర్చు అవుతుంది. హైదరాబాద్, బొంబాయి, ఢిల్లీ, లక్నో, అహ్మదాబాద్, మద్రాసు లాంటి పట్టణాలలో ఈ చికిత్స అందుబాటులో ఉంది.

ఇంటర్వ్యూ:
హిప్నాటిస్ట్ టి.ఎస్. రావ్




ఈ సంవత్సరం 300వ పుట్టిన రోజు పండుగను జరుపుకోబోతున్న కలకత్తా నగరానికి బర్త్‌డే గిఫ్ట్‌గా భారత ప్రభుత్వం అందించిన 21వ భారత అంతర్జాతీయ చలన చిత్రోత్సవాన్ని బెంగాలీ ప్రజలతోబాటు, చలనచిత్ర పరిశ్రమ వారు, దేశవ్యాప్తంగా వచ్చిన చలన చిత్రాభిమానులు, విదేశీ ప్రతినిధులు, జర్నలిస్టులు' మొత్తం మూడు లక్షల మందిదాకా తనివితీరా ఆనందించారు.

జనవరి 10వ తేదిన రవీంద్ర సరోవర్ 'ముక్తిమంచ్' ఓపెన్ ఎయిర్ ఆడిటోరియంలో ( పేరుకి ఓపెనెయిర్ ఆడిటోరియమ్ గానీ ఫంక్షన్ జరిపింది సర్కస్ టెంట్‌తో వేసిన పెద్ద డేరా కిందేలెండి) అతి నిరాడంబరంగా జరిగిన ప్రారంభోత్సవ కార్యక్రమంలో, జ్యోతిబసు, పి. ఉపేంద్రల సమక్షాన, బెంగాలీ నటి దేబశ్రీరాయ్, శ్రీమతి అమలాశంకర్‌లు సహకరించగా మన దేశపు లివింగ్ మాస్టర్ సత్యజిత్ రే జ్యోతిని వెలిగించి ఫిలింఫెస్టివల్‌కి శ్రీకారం చుట్టారు. ప్రారంభ చిత్రంగా గ్రీకు చిత్రం, ప్రముఖ దర్శకుడు ఏంజిలోపౌలస్ రూపొందించిన 'దిలాండ్ స్కేప్ ఇన్ ది మిస్ట్'ని ప్రదర్శించారు.

## 10రోజులబాటు ఐ.ఎఫ్.ఎఫ్.ఐ. 90లో ప్రదర్శింపబడిన 230 చిత్రాల వివరాలు-విభాగాలు

**విదేశీ చిత్రాలు**

| | | | |
|---|---|---|---|
| 1. | సినిమాఆఫ్‌దివరల్డ్ | - | 101 |
| 2. | హోమేజ్ టుఛాప్లిన్ | - | 24 |
| 3. | హోమేజ్‌టులారెన్స్ ఒలీవియర్ | - | 6 |
| 4. | హోమేజ్‌టుకిష్లొవిస్కీ | - | 4 |
| 5. | ట్రిబ్యూట్‌టు ఒసెలియాని | - | 3 |
| 6. | ట్రిబ్యూట్‌టు టవియానిబ్రదర్స్ | - | 5 |
| 7. | కినోషిటారెట్రాస్పెక్టివ్ | - | 11 |
| 8. | ఫోకస్ ఆన్ అర్జెంటినా | - | 19 |
| | | - | 173 |

**భారతీయ చిత్రాలు**

| | | | |
|---|---|---|---|
| 9. | ఇండియన్ పనోరమ | | |
| | ఫీచర్ చిత్రాలు | - | 21 |
| | డాక్యుమెంటరీలు | - | 11 |
| 10. | ట్రిబ్యూట్‌టు అశోక్‌కుమార్ | - | 13 |
| 11. | మెయిన్‌స్ట్రీమ్ ఇండియన్ సినిమా | - | 12 |
| | | - | 57 |

అలా మొదలైన ఫెస్టివల్ ఆ మర్నాటి నుంచి కలకత్తా ప్రజ గర్వించతగ్గ రీతిలో నిర్మించామని రాష్ట్ర ప్రభుత్వంచాటుకున్న అత్యాధునిక నందన్ సినీకాంప్లెక్స్‌కి కదిలి వెళ్ళింది. ఐదు థియేటర్ల అపూర్వసంగమంలాంటి నందన్ కాంప్లెక్స్‌లో ఫిలిం ఫెస్టివల్‌కి కావలసిన సౌకర్యాలు, అసౌకర్యాలు సమపాళ్లలో వున్న విషయం చిత్రాల ప్రదర్శన మొదలైన కొద్ది గంటలకే బయట పడ్డంతో వాతావరణం వేడెక్కడం, ఆవేశాలు పొంగడం మొదలైంది. థియేటర్ల కెపాసి

ట్రాజెడీలకి గురైన దాఖలాలేం లేవు. హోప్ డైమండ్ వెనక ఇంత విషాదకరమైన చరిత్ర వుంది గనకనే దానికి శాపగ్రస్తమైన వజ్రంగా చెడ్డ పేరొచ్చింది."

పింకీ చెప్పడం పూర్తి చేయగానే అక్కడ మరోసారి నిశ్శబ్దం ఆవరించింది.

ప్రభు ఆశ్చర్యం పట్టలేకుండా వున్నాడు. వజ్రాల గురించి తేదీల్తో సహా గడగడా అప్ప జెప్పేస్తున్న పింకీ అతన్ని తలమునకలయ్యే ఆశ్చర్యంలో పడేసింది.

ఈ అమ్మాయి జ్ఞాపకశక్తికీ తెలివి తేటలకూ హద్దులేవైనా వున్నాయా!

జూడా కళ్ళల్లో పింకీ విశ్వాసం క్షణక్షణానికీ పెరుగుతోంది. తాను సాధించదల్చుకున్న పని పింకీ సునాయాసంగా సాధించిపెడుతుందన్న నమ్మకం అతన్లో బలపడుతోంది.

కొద్ది క్షణాల తర్వాత అక్కడ ఏర్పడిన నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ అన్నాడతను "ఎక్సలెంట్! మీరు చెప్పిన విషయాల్లో నిజానికి నాక్కూడా తెలియని విశేషాలు చాలా వున్నాయి మిస్ పింకీ. నిజంగా మీ జ్ఞాపకశక్తి అమోఘం. బైదిబై, హోప్ డైమండ్ కున్నట్టుగా చెడ్డపేరు లేకపోయినా, శాపగ్రస్తమైన వజ్రంగా పేరు సంపాయించుకోకపోయినా మరో చిత్రమైన గుణం గలిగిన వజ్రం వుంది కదూ- ఆడవాళ్ళు తప్ప మగాళ్ళు ఆ వజ్రం ధరించకూడదనీ, ధరిస్తే ఆపదలు రాక తప్పదనీ...."

పింకీ అతన్ని వాక్యం పూర్తి చేయనివ్వలేదు.

"కోహినూర్," చెప్పిందామె. "కోహినూర్ ది గ్రేట్. కోహినూర్ విషయంలోనే ఆ వజ్రాన్ని మగాళ్ళు ధరిస్తే ప్రమాదమన్న నమ్మకం ఒకటి ఏర్పడిపోయింది. అయితే అది కేవలం ఓ మూఢ నమ్మకం తప్ప మరేమీ కాదని నా అభిప్రాయం. ఆ మాటకొస్తే నవరత్నాల విషయంలో ప్రజలకున్న మూఢ నమ్మకాలు అన్నీ ఇన్నీకావు. వాటిలో కొన్ని నమ్మకాలు చారిత్రక ఆధారాలతో ఏర్పడినవైతే కొన్ని నమ్మకాలు ఎలాంటి ఆధారాలూ లేకుండానే ఏర్పడ్డాయి. మరికొన్ని నమ్మకాలు కొంతమంది పనిగట్టుకుని ప్రచారం చేశారు."

"కోహినూర్ వజ్రం పేరు వినని వాళ్ళు మనదేశంలో బహుశా ఎవరూ వుండరు. ఈ వజ్రం మాది అని భారతీయులు సగర్వంగా చెప్పుకునేదీ, తెల్లదొరల పాలైపోయిందని మనం బాధపడేదీ ఒక్క కోహినూర్ వజ్రం గురించే. అయితే నిజానికి కోహినూర్ వజ్రం ఒక్కటే



కాదు, ఈ రోజు ప్రపంచ వ్యాప్తంగా గొప్ప విగా పేరు తెచ్చుకున్న నవరత్నాల్లో కనీసం డెబ్భైశాతం భారతదేశంలోనే దొరికాయంటే అతిశయోక్తి కాదు. ఇందాక నేను చెప్పిన హోప్ డైమండ్, కోహినూర్, దర్యాయి నూర్, బ్రయోలెట్ ఆఫ్ ఇండియా, డ్రెస్డెన్ గ్రీన్, షాజహాన్, నిజామ్, గ్రేట్ మొగల్, నూరుల్ఐన్, ఆర్లాఫ్, రీజెంట్, షా, తైమూర్ రూబీ, ఇంకా ఎన్నో ఎన్నెన్నో రత్నాలు భారతదేశానికి చెందినవే. అందుకే భారత దేశానికి రత్నగర్భ అని పేరొచ్చింది. ఈ రత్నాల్లో ఏవీ ఈరోజు భారతదేశంలో లేవు. దుండగులూ, దురాక్రమణదారులూ, సామ్రాజ్యవాదులూ, వ్యాపారస్తులూ, యాత్రికులూ వీటిని ఇతరదేశాలకు తరలించారు.

"కోహినూర్ వజ్రానికి నాలుగువేల సంవత్సరాల చరిత్ర వుంది. 108.93 కారెట్ల ఈ అమూల్య వజ్రం మధ్యభారతదేశంలో గోదావరినదిలో దొరికింది. దీన్ని ఎవరైతే పొందగలుతారో వాళ్ళు ప్రపంచాన్ని పాలిస్తారనీ, అయితే దీన్ని ఆడవాళ్ళు తప్ప మగవాళ్ళు ధరించడం ప్రమాదకరమనీ ఓ నమ్మకం ప్రచారంలో కొచ్చింది. ఈ ప్రచారం విక్టోరియా మహారాణిని మెప్పించడానికి ఆవిడ అంతరంగికులెవరో పనిగట్టుకుని చేసిన ప్రచారం తప్ప మరేం కాదనిపిస్తుంది. అయితే చరిత్రను బట్టి చూస్తే అందులోకొంత నిజం కూడా లేకపోలేదని కూడా అనిపిస్తుంది.

"కోహినూర్ గురించి రికార్డయిన చరిత్ర పద్నాలుగో శతాబ్దంలో ప్రారంభమౌతుంది. మొదట్లో ఇది మాళ్వారాజుల దగ్గరుండేది. తర్వాత అది మొగలాయి సామ్రాజ్యాన్ని స్థాపించిన బాబర్ అధీనంలో కొచ్చింది. సామ్రాజ్యం స్థాపించిన నాలుగేళ్ళకే బాబర్ వ్యాధిగ్రస్తుడై చనిపోయాడు. అతని కొడుకు హుమాయూన్ షేర్షా చేతుల్లో పరాజయం పాలై కొన్నేళ్ళపాటు దేశదిమ్మరిగా తిరిగాడు. తన రాజ్యాన్ని అతడు తిరిగి సంపాయించుకున్న కొద్దికాలానికే మెట్లమీద నుంచి పడి ప్రాణాలు పోగొట్టుకున్నాడు. అయితే అతని తర్వాత మొగలాయి మహాచక్రవర్తులు దేశాన్ని దిగ్విజయంగా పాలించారు. మొగల్ సామ్రాజ్య వైభవాన్ని కోహినూర్ రెండువందల సంవత్సరాలపాటు కళ్ళారా చూసింది. తర్వాత క్రమంగా బ్రిటిష్ వాళ్ళ చేతుల్లో ఆ సామ్రాజ్యం అంతరించిపోయింది. కడపటి మొగల్ చక్రవర్తి-చక్రవర్తి అన్న బిరుదు నామకార్థమే సుమా- కడపటి మొగల్ చక్రవర్తి బహదూర్‌షాజఫర్ ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొని బ్రిటిష్ వాళ్ళ చేతుల్లో చిక్కి రంగూన్ జైల్లో అతిదయనీయమైన పరిస్థితుల్లో ప్రాణాలు వదిలాడు.

## వజ్రసంకల్పం

"అయితే నిజానికి కోహినూర్ అంతవరకూ మొగల్ చక్రవర్తుల అధీనంలో లేదు. అంతకుముందే 1739లో పర్షియా నుంచి నాదిర్షా భారతదేశం మీదికి దురాక్రమణ చేశాడు. ఆ దాడిలో ఢిల్లీనగరంలో రక్తపుటేరులు ప్రవహించాయి. చివరికి నాదిర్షా గెలిచాడు. అతడు పర్షియాకు తిరిగిపోతూ పోతూ భారతదేశం నుంచి అనేక అమూల్య వజ్రాలు దోచుకుపోయాడు. వాటిలో కోహినూర్ ఒకటి, అయితే ఢిల్లీని జయించిన వెంటనే నాదిర్షాకు కోహినూర్ దొరకలేదు. ఓడిపోయిన చక్రవర్తి దాన్ని తలపాగాలోదాచుకున్నాడని అంతఃపుర స్త్రీ ఎవరో నాదిర్షాతో చెప్పింది. వెంటనే నాదిర్షా విందొకటి ఏర్పాటు చేసి ఓడిపోయిన చక్రవర్తిని ఆహ్వానించాడు. విందులో, "మనిద్దరి స్నేహానికి గుర్తుగా తలపాగాలు మార్చుకుందామా?" అని నాదిర్షా అడిగాడు. ఓడిపోయిన చక్ర




వర్తిగారికి నాదిర్షా పథకం అర్థమైపోయింది. అయితే ఏం చెయ్యగలడు. నోరెత్తకుండా తలపాగా తీసిచ్చేశాడు. నాదిర్షా ఆనక తన విడిదిలో తలపాగా విదిలిస్తే అందులోంచి కళ్ళు మిరుమిట్లు గొలిపే కాంతితో ఆ మహావజ్రం రాలిపడింది. దాన్ని చూడగానే నాదిర్షా ఆనందం పట్టలేక, "ఆహా, కాంతిపర్వతం" అని కేకేశాట్ట. పర్షియా భాషలో కాంతిపర్వతాన్నే "కోహినూర్" అంటారు. అప్పట్నుంచే ఆ మహావజ్రానికి కోహినూర్ అన్న పేరు స్థిరపడిపోయింది.

"ఆ తర్వాత చాలాకాలంపాటు కోహినూర్ పర్షియా రాజవంశం వారిదగ్గరే వుండిపోయింది. దాన్ని హరించడానికి ఇతరులు చేసిన ప్రయత్నాలు అన్నీ ఇన్నీకావు. పర్షియారాజు హత్యచేయబడ్డాడు. అతని కొడుకు షారుఖ్ బందీ చేయబడ్డాడు.

దుండగులు షారుఖ్ కళ్ళు పీకేశారు. తలమీద నుంచి సలసలా మరుగుతున్న నూనె పోశారు. అయినా ఆ వజ్రం ఎక్కడుందో షారుఖ్ వాళ్ళకు చెప్పలేదు. తర్వాత కొన్నేళ్ళకు ఓ పర్షియా రాజు దేశం విడిచిపెట్టి భారతదేశానికి పారిపోయి వచ్చి సిక్కురాజు పంజాబు సింహం మహారాజా రంజిత్‌సింగ్ ఆస్థానంలో ఆశ్రయం పొందాడు. తనకు ఆశ్రయమిచ్చినందుకు కృతజ్ఞతగా అతను కోహినూర్ని రంజిత్ సింగ్‌కు సమర్పించుకున్నాడు. ఆ విధంగా అనేక తరాల తర్వాత కోహినూర్ తిరిగి భారత దేశం వచ్చేసింది. రంజిత్ సింగ్ కోహినూర్ని అలంకారంగా ధరించేవాడు. సిక్కు యుద్ధం తర్వాత కోహినూర్ ఈస్టిండియా కంపెనీవాళ్ల చేతుల్లో 1849లో పడింది. ఈస్టిండియా కంపెనీ 250వ వార్షికోత్సవ చిహ్నంగా కోహినూర్ని విక్టోరియా మహారాణికి సమర్పించుకున్నారు. ఆనాటి నుంచీ ఈ నాటివరకూ అది ఇంగ్లండ్‌లోనే వుండిపోయింది. 1851లో కోహినూర్ని గ్రేట్ ఎగ్జిబిషన్లో ప్రదర్శించడం జరిగింది. అక్కడ చేరిన కొంతమంది ప్రబుద్ధులు కోహినూర్ తగినంతగా మెరవడం లేదని అనుమానాలు వ్యక్తం చేశారు. ఫలితంగా ఆ మహావజ్రాన్ని మరింతగా సానబెట్టాలని నిర్ణయించడం జరిగింది. ఆమ్‌స్టర్‌డామ్ నుంచి నిపుణుల్ని పిలిపించారు. కోహినూర్ని కోయడానికి ఓ ఆవిరి యంత్రాన్ని తెప్పించారు. ఆల్బర్ట్ యువరాజు దాన్ని కోత చక్రం కిందపెట్టాడు. డ్యూక్ఆఫ్ వెల్లింగ్టన్ యంత్రాన్ని ఆన్ చేశాడు. ముప్పై ఎనిమిది రోజుల కోత కార్యక్రమం తర్వాత కూడా వాళ్ళు కోహినూర్‌కి మరింత మెరుగు తెచ్చి పెట్టలేకపోయారు. చరిత్రాత్మకమైన ఆ మహావజ్రం

మాత్రం అన్యాయంగా అరిగిపోయింది.

"విక్టోరియా మహారాణి కోహినూర్ని అలంకారంగా ధరించేది. ఆవిడ తర్వాత అది అలెగ్జాండ్రా మహారాణికి సంక్రమించింది. 1911లో మేరీ మహారాణికిరీటంలో పొదిగారు దాన్ని. 1937లో అది ఎలిజిబెత్ మహారాణి కిరీటంలో పొదగబడింది. ఇప్పటికీ అది బ్రిటన్ రాణి కిరీటంలోనే వుంది. టవరాఫ్ లండన్లో కోహినూర్ని చూడొచ్చు," మరో సుదీర్ఘోపన్యాసం ముగించింది పింకీ.

"అబ్బ!" గుండెమీద చెయ్యి వేసుకుంటూ అప్రయత్నంగా అన్నాడు ప్రభు.

జూడా పరమానందంతో లేచినిలబడ్డాడు.

"హేట్సాఫ్ టు యూ యంగ్ లేడీ, హేట్సాఫ్! మీకివే నా జోహార్లు. ముందుగా మీకు షేక్ హేండివ్వనీయండి" అన్నాడు చెయ్యి ముందుకు చాస్తూ.

పింకీ హుందాగా అతని చెయ్యందుకుని షేక్ హేండిచ్చింది.

"ఇప్పుడైనా మీరొచ్చిన పని చెబుతారా?" అంది.

జూడా మళ్ళీ సోఫాలో చతికిలబడ్డాడు.

"చెబుతాను. తప్పకుండా చెబుతాను. ఇంత ఉపోద్ఘాతం తర్వాత ఇంకా చెప్పకుండా వుంటానా?" అంటూ ఒక్క క్షణం మౌనం వహించి నాటకీయంగా చూసి గొంతు సవరించుకున్నాడు.

"మిస్ పింకీ! ఇప్పటిదాకా మీరు ప్రపంచంలో అన్నింటికంటే పెద్ద వజ్రం గురించి చెప్పారు. శాపగ్రస్తమైన ఓ గొప్ప వజ్రం చెప్పారు. ఎన్నో హత్యలకూ దుర్మార్గాలకూ మూలమైన మరో మహావజ్రం గురించి చెప్పారు. ఇప్పుడు నా వంతు. గుండె చిక్కబట్టుకోండి. నేను మరో మహావజ్రం గురించి చెప్పబోతున్నాను. ప్రపంచం ఎన్నడూ కనీవినీ ఎరుగని చిత్రాతిచిత్రమైన వజ్రం గురించి!" అతను మరోసారి మౌనం వహించాడు.

పింకీ ఆసక్తిగా చూసింది.

జూడా మరోసారి గొంతు సవరించుకుంటున్నట్టు చిన్నగా దగ్గాడు.

"మీరు ప్రపంచంలో అన్నింటికంటే పెద్ద వజ్రం కల్లినాన్ అన్నారు కదా! ఇప్పటివరకూ మీరు చెప్పిన మాట నిజమే. కానీ, ఇక మీదట కాదు," అన్నాడు మెల్లగా.

"అంటే?"

"అంటే కల్లినాన్ని మించిన మరో వజ్రం ఈ భూమ్మీద వుంది. అదీ ఎక్కడో కాదు. ఇక్కడే మన ఆంధ్రదేశంలోనే వుంది."

ఆ మాట వింటూనే పింకీ వులిక్కిపడింది.

"వాట్???" అంది నమ్మశక్యంగానట్టుగా.

జూడా తలూపేడు.

"అవును మిస్ పింకీ! కల్లినాన్ కంటే పెద్ద వజ్రం నిజంగా వుంది. ఎన్ని క్యారెట్లో తెలుసా? 764.4 క్యారెట్లు. అంటే కల్లినాన్ కంటే దాదాపు రెట్టింపు పెద్ద వజ్రం!"

పింకీ కళ్ళప్పగించి చూస్తోంది.

"అంతేకాదు మిస్ పింకీ! ఆ వజ్రానికున్న ఒక మహాద్భుతమైన, అతి విచిత్రమైన గుణం.. .. తన చుట్టుపక్కలున్న వస్తువుల్ని భస్మం చెయ్యడం!"

"మైగాడ్! నేను నమ్మను! ఇంపాజిబుల్!"

"కాదు మిస్ పింకీ! ఇది వాస్తవం!"

"కానీ....., కానీ.... అదెలా సాధ్యం?"

"ఎలా సాధ్యమో నాకింతవరకూ అంతు పట్టలేదు. బహుశా ఎవరైనా సైంటిస్టులు ఆ వజ్రాన్ని పరీక్ష చేస్తే ఎలా సాధ్యమో చెప్పగలరనుకుంటాను. మామూలు మనుషులకు కూడా దానికి దగ్గరగా ఒక అరగంట సేపు నిలబడడం మహాకష్టం. ఒళ్ళంతా భగభగా మండిపోతున్నట్టుగా అయిపోతుంది. ఇందాక మీరు శాపగ్రస్తమైన హోప్ డైమండ్ గురించి చెప్పారు. ఈ వజ్రం కూడా అంతటిదే. ఇప్పటికే ఆ వజ్రానికి సంబంధించి అనేక మంది ప్రాణాలు పోగొట్టుకున్నారు. ఓ పెద్ద కుటుంబం సర్వనాశనమైపోయింది. భస్మాసురుడిలాంటి ఆ వజ్రం పేరు సూర్యనేత్రం."

"సూ....ర్య,....నే.....త్రం.....!"

"అవును, సూర్యనేత్రం! ఆ వజ్రానికేదో భయంకరమైన శాపం వుండడం మూలానే అదలా తన చుట్టుపక్కలున్న వస్తువుల్ని భస్మం చేస్తుందని ఒక నమ్మకం కొందరిలో ఇప్పటికే ఏర్పడిపోయింది. అత్యంత శక్తివంతమైన ఆ వజ్రాన్ని శాంతింపజేయడానికి ఒకే ఒక్క మార్గం ఒక నగ్నదేవత సూచించింది."

"ఏమిటది?"

"బలి-నరబలి!"

"ఓ మైగాడ్!"

"అవును మిస్ పింకీ! ఆ వజ్రాన్ని మనం సంపాయించాలి, మనం కాదు- మీరు సంపాయించాలి. ఆ వజ్రాన్ని సంపాయించి మాకిస్తే మీ పారితోషికం పదికోట్లరూపాయలు!"

"ప....ది....కో.......ట్లు......!"

జూడా తలూపేడు.

"అవును-అక్షరాలా పదికోట్లు!"

పింకీ కొద్ది క్షణాలు సుదీర్ఘంగా ఆలోచిస్తుండిపోయింది.

తర్వాత నెమ్మదిగా తలపైకెత్తి అతని వైపు చూసింది.

"ఆల్ రైట్! ఇప్పుడా వజ్రం ఎక్కడుంది?"

జూడా కళ్ళు ఒక్క క్షణం సీరియస్గా అయిపోయాయి.

"ఒక అతి ప్రమాదకరమైన వ్యక్తి దగ్గర."

"ఎవరా అతి ప్రమాదకరమైన వ్యక్తి?"

"అతని పేరు వజ్రపాణి!"

వ.....జ్ర......పా......ణి......!

అంతే!

ఆ పేరు వింటూనే పక్కలో బాంబు పడ్డట్టుగా అదిరిపడింది పింకీ!

(ఇంకా వుంది)

## గంతులేస్తున్న గోవింద!



స్ట్రీట్ డ్యాన్సర్ గోవింద తన హిట్ చిత్రాలను చూసి ఆనంద పారవశ్యం పొందుతున్నాడట. అనిల్కపూర్ చిత్రాల తర్వాత తనవే హిట్ చిత్రాలని గంతులేస్తున్నాడు. తను చేసే ఫైటింగ్లు, డ్యాన్సులే తన చిత్ర విజయానికి కారణమంటున్నాడు. ఈ విజయాలే తనను మరింత ప్రోత్సహిస్తున్నాయట. అదే నిజమైతే అనతి కాలంలోనే గోవింద తారాపథాన్ని అందుకో గలడంటున్నారు సినీరంగ ప్రముఖులు. సినిమాల్లోకి యిప్పుడొచ్చే కుర్రవారు గోవింద అడుగు జాడల్లో నడిస్తే మంచిదేమో!

హిందీ చలన చిత్ర రంగంలో యితర నటీనటుల మాదిరిగానే ఏదో సాధించాలనుకుని అది సాధించ లేక విఫల మైన వారిలో "ఖుష్‌బూ" ఒకరు. దక్షిణాది భాషా చిత్రాల్లో నటించటానికి ఆమె సిద్ధపడటమే హిందీ చిత్ర సీమలో ఆమె భవిష్యత్తు ఆకస్మిక ముగింపునకు దారి తీసింది. బాల నటిగా సినీ జీవితాన్ని ప్రారంభించిన ఖుష్బూ యిప్పుడు దక్షిణాదిలో పైకెదగటానికి పోటీ పడుతోంది.

దక్షిణాది హీరోయిన్లతో పోల్చి చూస్తే ఖుష్‌బూలో చాలా తేడా కనిపిస్తుంది. స్టూడియోకు, నిజజీవితానికి మధ్య తన



స్వభావంలో తేడా కనిపించ చేస్తూ దక్షిణాదిలో కాలు మోపినప్పటి నుంచి ఎటువంటి కృషి లేకుండానే తన నటనా నైపుణ్యంతో విజయాల్ని సాధిస్తూ వస్తోంది. కాని హిందీ చిత్ర రంగంలో స్థిరపడిపోదా మనుకున్న తన భవిష్యత్తును తన తండ్రే కాలరాచాడంటోంది ఖుష్‌బూ. హిందీ చిత్ర రంగానికి తానేవిధంగా దూరమై, దక్షిణాది చిత్రాల్లో పాప్యులర్ అయిందో కారణాలను వివరిస్తోంది–

ప్రశ్న : దక్షిణాది చిత్రాల్లోకి ఎలా ప్రవేశించారు?

ఖుష్‌బూ జవాబు : దర్శకుడు అశోక్ కుమార్ నాకు అవకాశం కల్పించారు.



ప్ర : ఈ చిత్రాల్లో నటించటం పై మీ అభిప్రాయం?

జ : ఈ చిత్రాల్లో నటించటం నాకు చాలా ఆనంద మనిపించింది.

ప్ర : భాషతో మీకు సమస్య రాలేదా?

జ : భాష, సంస్కృతులు వేరైనా కొత్త పరిసరాలకు అలవాటు పడ్డాను.

ప్ర : కన్నడ చిత్రాల్లో మీ ప్రవేశం?

జ : ఈ చిత్రాల్లో నటించటం యిష్టం లేక పోయినా ఒక స్నేహితుడి చొరవ వల్ల ఈ చిత్రాల్లో ప్రవేశించాను.

ప్ర : దక్షిణాది చిత్ర పరిశ్రమపై మీ అభిప్రాయం?

జ : అందరికీ ఈ పరిశ్రమలో అవకాశం లభిస్తుంది. నేనా పరిశ్రమలో ప్రవేశించినప్పుడు నాకు మంచి స్వాగతం లభించింది.

ప్ర : డబ్బింగ్ ఆర్టిస్టు సహాయం లేకుండా ఎలా నెగ్గుకొస్తున్నారు?

జ : కష్టపడి కృషి చేశాను. హిందీలో డైలాగులు వ్రాసుకొని అవే మననం చేస్తూవుండేదాన్ని. ఏమీ యిబ్బంది అనిపించలేదు.

ప్ర : మీకు పేరు తెచ్చిపెట్టిన చిత్రం?

జ : 'వరుషం 16'.

ప్ర : ఆ చిత్ర దర్శకుడ్ని ఎలా కలిసారు?

జ : అది అదృష్టంగానే భావిస్తున్నాను. ఆయన అసిస్టెంటు ద్వారా ఆ చిత్రంలో ప్రవేశం లభించింది.

ప్ర : ఏ యితర భాషల్లో మీకు ఆఫర్లు వచ్చాయి?

జ : బెంగాలీ, మళయాళం భాషా చిత్రాల్లో.

ప్ర : వాటిని అంగీకరించారా?

జ : ఇంకా వాటిని అంగీకరించ లేదు.

ప్ర : హీరోయిన్‌గా మీ మొదటి చిత్రం?

జ : సాథేలపతి.

ప్ర : హిందీ చిత్రాల్లో మీ వైఫల్యానికి కారణం?

ప్ర : నా తండ్రే దానికి కారణం. నా తండ్రే నా భవిష్యత్తును నాశనం చేశారు.

ప్ర : ఎందుకని?

జ: ఇతర భాషా చిత్రాల నిర్మాతలు డబ్బు లెక్కువిస్తారని నన్ను బలవంతం చేసి ఒప్పించారు.

ప్ర : అదే మీ పేరు ప్రతిష్టలను దెబ్బ తీసిందనుకుంటున్నారా?

జ : ముమ్మాటికి.

ప్ర : పూర్తి కాని చిత్రాలున్నాయా?

జ : చాలా చిత్రాలు యింకా పూర్తి కాలేదు.

ప్ర : జీవితంలో ఎప్పుడు స్థిరపడదామనుకుంటున్నారు?

జ : దాన్ని గురించ యిప్పుడు ఆలోచించటం తొందరపాటే అవుతుంది.

పదునాల్గు సంవత్సరాల చిరు ప్రాయంలో హిందీ చిత్ర రంగంలో వైఫల్యం చెందటం ఖుష్‌బూకు సహించరాని విషయంగా తోచటం సబబే. కాని తన భవిష్యత్తును చేజేతులా నాశనం చేసిన తన తండ్రితో విభేదించటం ఒక్కటే తన సమస్యకు పరిష్కార మనుకుంటోంది.... ఈ చిరునవ్వుల చిన్నారి! తండ్రితో విభేదించినంత మాత్రాన హిందీలో మళ్లీ ఆఫర్లు వస్తాయా? వచ్చిన ఆఫర్లనే సద్వినియోగం చేసుకుంటే (యిప్పటి పరిస్థితుల్లో) అంతకంటే సుగుణం మరొకటుండ దేమో! వేచి చూద్దాం ఏం చేస్తుందో!



యమ్.సత్యనారాయణ ప్రసాద్ సమర్పించు
శ్రీ లక్ష్మీదుర్గ మూవీస్

విజయ విహారం
చేస్తున్న....

# రంభ రాంబాబు



స్క్రీన్‌ప్లే-దర్శకత్వం:
రేలంగి నరసింహారావు

నిర్మాతలు:
జి.మట్టయ్య, యమ్.యస్.ఆర్.ప్రసాద్

నిర్వహణ: రజితమూర్తి, సుగుణారాజ్

సంగీతం: మాధవపెద్ది సురేష్

కెమెరా: కబీర్‌లాల్

కృష్ణా: బాబూ మూవీస్, గుంటూరు: శ్రీ ధనలక్ష్మి ఫిలింస్, ఈస్టు: శ్రీ శ్రీనివాస ఫిలింస్, వెస్ట్: శ్రీ అన్నపూర్ణ సినీ చిత్ర, నెల్లూరు: రాధికా ఫిలింస్, వైజాగ్ & శ్రీకాకుళం: శ్రీహరిప్రియ ఫిలింస్, సీడెడ్: శ్రీ సత్యనారాయణ కంబైన్స్ గుంతకల్లు, చిత్తూరు: భాస్కర పిక్చర్స్- తిరుపతి, నైజాం: శ్రీ లక్ష్మి నరసింహ పిక్చర్స్ (ప్రై) లిమిటెడ్, సికిందరాబాదు

కథల కాణాచి

# నాకీ జీవితం చాలు

"అమ్మా! నేనిది సహించలేనమ్మా!... నేనిపుడే వెళుతున్నాను... పెండ్లి ఎలా అవుతుందో చూస్తాను. ఈ వివాహం జరగటానికి వీల్లేదు!" రాజశేఖరం ఆవేశంగా అన్నాడు.

తల్లి దగ్గరకు వస్తూ అన్నది. "రాజా! పెద్దదాన్ని చెబుతున్నాను విను... ఎవరి పాపాన వాళ్ళే పోతారు.... మనం మధ్యలో కల్పించుకుని భారతి జీవితాన్ని ఎందుకు నాశనం చేయాలి?... వద్దు నాయనా! నేను చెబుతున్నాను విను!"

"భారతి జీవితం నాశనం అంటున్నావ్! ఒకవైపు శేషగిరి జీవితం అలా నాశనం అవుతుంటే నేనెలా చూస్తూ వూరుకోగలను?.... రేపు వివాహం అయిన తరువాతయినా తెలియకపోదు... మిత్రుడివి నీవే యిలా మోసం చేశావే తెలిసీ దాచిపెట్టావే అని మొఖాన పట్టుకు అడిగితే నేనేం చెప్పేది? అటు నా మిత్రుడిని మోసం చేస్తూ నా ఆత్మను నేను వంచించుకోలేను !..." ఒక్క క్షణం ఆగాడు. తల్లి మొఖంలోకి దీక్షగా చూస్తూ "లాభంలేదమ్మా! వాడి తెలివితేటలు వాడిని యూనివర్శిటీలో ఫస్టుగా నిలబెట్టినయి... వాడి అందం చుక్కల్లో చంద్రుణ్ణే గుర్తుకు తెస్తుందమ్మా... వాడు... త్వరలో అమెరికా వెళ్లబోతున్నాడు... వచ్చి ఎక్కడో ప్రొఫెసరు అవ్వగలడు... అటువంటివాడి జీవితం ఇలా నాశనం చేయుటం... వాడి ఆశలను మొగ్గలోనే త్రుంచివేయుటం... వాడి కోరికలన్నీ గగన కుసుమాలు చేయుటం నేను సహించలేను...నేను చూడలేను!" తల విదిలించాడు.

"రాజా!" గంభీరంగా అన్నది. "శేషగిరి నీ మిత్రుడవ్వచ్చు. భారతి నా అన్నయ్య కూతురని గుర్తుంచుకో... భారతి వివాహం నీవు ఆపటానికి వీల్లేదు. ఆపలేవు... అది జరిగితీరాలి!"

రాజశేఖరం ముందుకు వచ్చి, పిడికిలి బిగించి తల్లి మొఖంలోకి భయంకరంగా చూస్తూ, "ఆ నీ అన్నయ్య కూతురు భారతినే నీ కోడలిగా చేసుకోవటానికి ఎందుకు తిరస్కరించావో మరి ?... చెప్పు అమ్మా చెప్పు!... ఆనాడు నీ అన్నయ్య వచ్చి కాళ్లావేళ్లా పడుతూ బ్రతిమాలినపుడు కటిక గుండెతో 'వీల్లేదు' అనే మాటతప్ప ఆరో జిల్లా మరో మాట నీనోటినుండి రాలేదే... ఈనాడు నీ అన్నయ్యమీద, నీ అన్నయ్య కూతురు భారతిమీద అంత ప్రేమ, అంత జాలి ఎలా వచ్చింది?" అన్నాడు రాజశేఖరం.

ఆమె మొఖం తెల్లబడిపోయింది. రెండు చేతుల్లోనూ మొఖాన్ని దాచుకుని వలవల లాడింది... రాజశేఖరం ఒక్క క్షణం ఆగాడు, "అవునమ్మా భారతిని నీ కోడలిగా వూహించుకోలేకపోయావ్!... ఫిట్స్ వచ్చే భారతిని నీ రాజశేఖరం ప్రక్కన భార్యగా నిలబెట్టలేకపోయావ్!... అవునా?... కానీ, ఈనాడు ఆ భారతే... ఆ ఫిట్స్‌తో బాధపడే భారతే నా మిత్రుడు శేషగిరికి భార్యగా వెళుతున్నపుడు నీవు నిమ్మకు నీరెత్తినట్లెలా వుండగలుగుతున్నావ్?... వాడిని ఆ భయంకర నరక కూపంలో పడకుండా చూడబోతున్న నన్ను ఎందుకు వారిస్తావ్?... నీది గుండె కాదు... నీది...నీది...." ఆవేశం ఆపుకోలేకపోయాడు విసురుగా బల్లమీద పెట్టివున్న హ్యాండ్‌బ్యాగ్‌ను తీసుకున్నాడు. వడివడిగా రోడ్డుమీదకు నడిచాడు.

'రాజా!....'

'........'

"నాయనా!.... రాజా!...."

** ** ** ** ** **

"మావయ్యా!"

చేతిలోని సంచీని వాల్చివున్న మంచం మీద పడేసి హాల్లోకి నడిచాడు. ఇరవై నాలుగు గంటలలో జరగబోయే ఒక పవిత్ర కార్యం ఆగిపోయేందుకుగాను హవిస్సు వేయటానికి హాల్లో కాలుపెట్టాడు.

"మావయ్యా!"



# పి.ఎస్.నారాయణ

**28-5-1965 సంచిక నుండి**

అపుడే హాల్లోకి వచ్చిన అరవయ్యేళ్ల వృద్ధుని చూస్తూనే, "శుభలేఖ పంపకుండానే ఎలా వచ్చానా అని విభ్రాంతి చెందుతున్నావా మావయ్యా! నిజం చెప్పు!... భారతికి ఫిట్సు వస్తున్నాయని శేషగిరికి ముందుగా చెప్పావా? ... చెప్పు మావయ్యా.... అది కనుక్కునేందుకే వచ్చాను... చెప్పు!"

ఆ వృద్ధుని మొఖం రాజశేఖరం ఆకారం చూస్తూ నల్లబడిపోయింది. కళ్ళు గుంటలు పడిపోయినయి. మొఖంలో కాంతి క్షీణించిపోయింది. విగ్రహంలా నిలబడిపోయారు.

"లేదు...!" అంతకుమించి నోరు పెగల్లేదు.

"అయితే ఈ వివాహం జరగటానికి వీల్లేదు!... జరగటానికి వీల్లేదు మావయ్యా! ఫిట్స్ వచ్చే భారతిని అతడికి అంటగట్టి, అతడిని పరిస్థితుల అడకత్తెరలో యిరికించి, అత్యున్నత సోపానాల నెక్కవలసిన అతని జీవితాన్ని దిగులుతో వేదనతో క్షీణింపచేయవద్దు.... అతడిని నాశనం చేయవద్దు!"

"రాజా!... కూర్చో నాయినా!.. నేను చెప్పేది సావకాశంగా విను!"

"ఇందులో చెప్పించుకోవలసింది, వినవల్సింది ఏవీ లేదు మావయ్యా! శేషగిరి నాశనం అవ్వటం నేను చూడలేను... అందుకే నాయీ బాధంతా... ఈ వివాహం జరగటానికి వీల్లేదు... వాళ్ల వచ్చారా!... వచ్చి వుంటారనే అనుకుంటాను.. అందుకనే ఇక్కడికి ముందు వచ్చాను.. వాళ్ల వూరు దగ్గరయినట్లయితే ముందు అక్కడికే వెళ్లే వాడినే!"

రంగనాథం[illegible] రాజశేఖరం మీద చేయి వేశారు. రాజశేఖరం ఒక్కసారి నలువైపులా చూచి వులిక్కిపడ్డాడు. తెరిచివున్న తలుపులను కప్పేస్తూ వివాహానికి వచ్చిన బంధువులంతా నోళ్లు తెరుచుకొని లోపలికి చూస్తున్నారు వింతగా.

క్షణం రాజశేఖరం తనను తాను చూసుకొని సిగ్గుపడిపోయాడు. తరువాత కర్తవ్యం గుర్తుకువచ్చింది-

"ఈ వివాహం జరిగితీరటానికి వీల్లేదు!"

"నాయినా! రాజా! యిలారా! కూర్చో!"

ఆయన కంఠం గద్గదికమయింది.

"చూస్తూ చూస్తూ, అత్యున్నతస్థాయి నందుకోవాల్సిన అతడిని ఈ వుచ్చుతో ఎలా బంధించగలుగుతున్నావ్ మావయ్యా!... నేను భరించలేకుండా వున్నాను... నేను వూహించలేకపోతున్నాను!"

"నాన్నా! రాజశేఖరం....వృద్ధుడైన అరవయ్యేళ్ల నీ మావయ్య బ్రతిమలాడుతున్నాడురా!....కూర్చో చెప్పేది సావకాశంగా విను!"

రాజశేఖరం చటుక్కున కూర్చున్నాడు. బిగుసుకు కూర్చున్నాడు.

రంగనాథంగారు మూగినజనాన్ని చూస్తూ, "వెళ్ళండి....మీపన్లు మీరు చూసుకోండి!" అన్నారు విసురుగా, విసుగ్గా.

"నాయినా! రాజశేఖరం!.....ఈ ముసలివాడి వేదన నీవుకాస్త అర్థం చేసుకుంటావు కదూ?....నాకు అరవయ్యేళ్లు నిండాయి....నా కూతురు....నా కూతురు పెండ్లి కావాల్సిన భారతి కొద్దిరోజుల్లో ఇరవై అయిదో సంవత్సరంలో కాలుపెట్టబోతున్నదిరా.... దానిలోని లోపం నాకు తెలుసు, నీకు తెలుసు, మీ అమ్మకు తెలుసు, మన బంధువులకు తెలుసు....ఆ కారణంతోటే ఒకనాడు భారతిని మీ అమ్మ కోడలిగా స్వీకరించలేకపోయింది....ఇవన్నీ ఏదో ముసలివాడు మభ్యపెట్టటానికి చెబుతున్నాడనుకునేవ్!....సావకాశంగా విను నాయనా!.....నేను భారతిని చూపించని డాక్టర్లు లేరు....అంతేకాదు - కొందరు అదొక గోలన్నారు. కొందరు మరేదో



అన్నారు. కొందరు పూజలు చేయాలన్నారు, కొందరు మరేదో చేయాలన్నారు....నే నందరిమాటలకూ విలువయిచ్చి డబ్బుకుగూడా లెక్క చేయకుండా అన్నీ చేశాను - కాని ఫలితం లేకపోయింది!"

ఆయన ఒక్కక్షణం ఆగారు. ముడతలుపడ్డ నుదుటిమీదుగా జారుతున్న చమట బిందువులను తుడుచుకున్నారు.

"....నెల రోజు క్రితం ఒకరి సలహా మీద, మద్రాసులో - విదేశాల్లో చదివి వచ్చిన ఒక డాక్టరుకు భారతిని చూపటం తటస్థించింది....ఆయన పరీక్షించారు....

ఒకరోజు గాదు, పదిరోజులు....ఒకసారి గాదు పదిసార్లు....అందునా ఒకసారి అది సరిగ్గా ఫిట్ వచ్చిన సమయంలో....అంతా పరీక్షించి దానికి మరో పద్ధతి లేదన్నారు. వివాహం చేస్తేనేగాని తగ్గదన్నారు!

....ఆయన మాటలను నమ్మాను....ఆఖరి ఆశగా ఆయన మాటల్లో విలువవుంచి యిందుకు సిద్ధపడ్డాను....ఇక అప్పుడు నిన్నే అల్లుడుగా ఎందుకు నిర్ణయించుకోలేదని నీవడగవచ్చు!....ఒక డాక్టర్ సలహామీద నా చెల్లెలు దీనికి అంగీకరిస్తుందని నేనాశించలేదు....నా చెల్లెలు తత్త్వం నాకు తెలుసు....బురదలో అడుగు వేయమన్నా నిప్పులుంటాయేమోనని భయపడేరకం - అందుకే పరాయి సంబంధం వెతుక్కోవలసి వచ్చింది....ఇక నిన్ను పిలవకుండా, నీకు తెలియకుండా ఈ వివాహం జరుపుదామని నేను కల్లోగూడా అనుకోలేదు..... నేను నీకు శుభలేఖ పంపాను....అది ఎందుకు అందలేదో నాకూ అర్థం కావటంలేదు!"

ఆయన చెప్పటం పూర్తయినట్లుగా ఆగారు. రాజశేఖరం ఏదో అనబోయాడు గాని, ఆయన అతడిని వారిస్తూ, "ఈ ఒక్క మాట వినరా నాన్నా! నేను నిజం దాచ

## నాకీ జీవితంచాలు

కుండా చెప్పాను!....ఇక నీవు ఏం చేసినా ఆపేశక్తి నాలోలేదు....నీ యిష్టం....అరవయ్యేళ్ల వృద్ధుని జీవితం నీ చేతుల్లో వున్నది!" అన్నారు ఆవేశంగా.

ఆయన మాటలకు రాజశేఖరం హృదయం ద్రవించింది. తలెత్తి ఆయన కళ్లలోకి చూడలేక పోయాడు. ఆయన వేదన నుండి దూరంగా తప్పుకోలేకపోయాడు. ఆయన బాధ అతడిని నలిపేసింది....

"....కానీ....కాని శేషగిరి?"

"మావయ్యా!....." అదే అనబోయాడు.

"నాయనా రాజశేఖరం....నా పని అయిపోయింది....నా శక్తి క్షీణించిపోయింది....ఇక నీకు నేనే సమాధానమూ చెప్పలేను.... పక్క గదిలో భారతి వున్నది.... అదే నీకు చెప్పగలదు.... వెళ్లునాయినా!" అన్నారు. అంటూనే రెండు చేతుల్లోనూ మొఖం దాచుకున్నారు.

రాజశేఖరం హృదయం ఆ దృశ్యానికి కదలిపోయింది.

"ఛీ! నేను మానవత్వం కోల్పోతున్నాను!" అనుకున్నాడు, బాధగా మూలిగాడు.

అక్కడ వుండలేకపోయాడు. తప్పటడుగులతో గదిలో కాలు పెట్టాడు. ఇరవై నాలుగు సంవత్సరాలు తన సర్వస్వంలా మెలిగిన భారతి గదిలో తలవంచుకు కాలు పెట్టాడు. ఆమె హృదయంలో రేగుతున్న మంటలను చూచేందుకు అక్కడ కరుడుగట్టిన హృదయంతో కాలు పెట్టాడు. ఆమె కనులు వర్షిస్తుంటే తను నిలదొక్కుకు చూడాలి....పగిలిపోయే ఆమె హృదయాన్ని నిబ్బరంతో పరిశీలించాలి....కాని.....ఎందుకు?....తన శేషగిరికోసరం....అమెరికా వెళ్ళబోయే తన శేషగిరి కోసరం!.....ఆనంద దీపాల వెలుగుతో విరజిమ్మవలసిన అతడి జీవితం కోసరం!

ఒక మూలగా నిలబడి వున్నది భారతి!

సంవత్సరంక్రితం ఎలా వున్నదో గుర్తుకు తెచ్చుకోవల్సిన అవసరం కలిగేలా ఈనాడు లేదు. కాని ఆమె కను రెప్పలక్రింద ఆనాడు లేని నల్లటి చారలు ఈనాడు వున్నాయి.... ఆమె తల కట్టులో ఆనాడులేని పేలవత్వం ఈనాడు వున్నది....

"భారతీ!"

"బావా!" ఆనాటి గొంతులోని మృదుత్వంగూడా ఈనాడు లేదనిపించింది.

"నన్నర్థం చేసుకో భారతీ!....నేను తప్పు చేస్తున్నా నంటావా?....నా ప్రవర్తన ఏహ్యతరంగా వున్నదా?"

"ఎవరనగలరు బావా ఆమాట!.....మేం చేస్తున్నది తప్పే, కాదనను.....దాని కంతటికీ కారణం నేను.....నా జీవితం....నాలో ఇంకా జీవించాలనే వున్న బలీయమైన కోరిక.....నేనే నీ మిత్రుడి ఆనందాన్ని, ఆధిక్యాన్ని సమాధి చేసి, అసంతృప్తితో, వేదనతోకూడిన జీవితంలోకి త్రోసి వేయవచ్చు....నేను కాదనను..... నేనేకాదు ఎవరూ కాదనరు....నీవన్నది నిజం! నీమాట నిజం!" ఆమె బాధతో, కసితో పెదిమలు కొరుక్కుంది.

రాజశేఖరం అడుగు ముందుకు వేశాడు.

"మేము అత్యున్నత సోపానా లెక్కవలసిన ఒక వ్యక్తిమీదే ప్రయోగంలాంటిదే చేస్తున్నాం... అతడి జీవితంతో ఆటలాడుతున్నాం... అతడి ఆనందాన్ని, సుఖాన్ని లాటరీ పెట్టాం... నిజం బావా...! నిజం ! ఒప్పుకున్నాను... నేను కాదనను... ఎవరూ కాదనరు... ఇంకా ఇంకా..." ఆమె ఆవేశంతో తల విదిలించింది.

ఆమె ముఖాన ఉదయం పెట్టిన కళ్యాణం బొట్టు అతని గుండెలమీద కత్తిలా పొడుచుకుంది... అతడు చచ్చిపోయాడు !

చటుక్కున వెనక్కు తిరిగాడు !

భారతి అతడు ఉలిక్కిపడేలా అతడి చేయి పట్టుకొంది. ఆమె చేతిలో అతడిచేయి నలిగిపోయింది. విరిగిపోయింది.

"ఈ క్షణంలో - కళ్యాణపు బొట్టుతో, కాళ్లకు పారాణితో, నూతన వస్త్రాలతో నీకు వాగ్దానం చేస్తున్నాను బావా... ప్రతిజ్ఞ చేస్తున్నాను... మీ మిత్రుడి ఆనందాన్ని, భావి జీవితపు ఆధిక్యాన్ని నేను హరించటమే కనుక నిజమయితే - ఈ భారతి జీవించటం నిజం కాదు ! ఇది నా మాట !... నా హృదయం చెప్పిన మాట ! నా మనస్సంతా ఆవరించిన మాట !"



“భారతీ !” పిచ్చిగా అరిచాడు... ఆమె మాటలకు తల్లడిల్లిపోయి ఏడ్చాడు రాజశేఖరం !

వేయబోతున్న అడుగులను భారతి మాటలే తాళ్లయి బంధించినయ్.

“ఒక్క కోరిక ! చిన్న కోరిక ! కాదనకు బావా ! అది నాలో గూడుకట్టుకున్న కోరిక... పీటలమీద కూర్చున్న మమ్మల్ని దీవించి వెళ్లు బావా !”

“భారతీ !”

“[illegible]న కోరికలను విధి నలిపేసింది... మన [illegible]ంత సుఖస్వప్నాలను దేవుడు కాలితో నలిపివేశాడు... కాదనను... నీవు కాదనవు... ఎవరూ కాదనలేరు. కానీ నా కోరికను నీవు మాత్రం కాదనకు బావా ! అదే నాకు తృప్తి... అదే నా జీవన సౌభాగ్యం... అదే నా భావి జీవిత విజయానికి నాంది !”

ఆమె వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

క్షణం క్రితం మామయ్య మాటలకే ఈ పరిసరాల నుండి శేషగిరిని కూడా విధికి వదిలేసి పారిపోదామనుకున్న రాజశేఖరం ఆమె మాటలకు వివశుడైపోయాడు. ఓడిపోయాడు. అక్కడనుండి ఒక్క అడుగు ముందుకు వేయలేకపోయాడు - విధి బలీయమైనది !

* * * *

కడుపులో దాచుకున్న రహస్యంతో విడిదింటికి వెళ్లిన రాజశేఖరానికి పరిస్థితులే ఎదురుతిరగగా విషం తిన్నట్లు గిలగిలలాడిపోయాడు.

శేషగిరి తనలోని నిప్పునిగాని చూడలేదు కదా ?

పూర్తిగా తెలిసినా ఇంత బాధ ఉండేది కాదు... తెలిసీ తెలియని అయోమయంలోపడి కొట్టుకుపోసాగాడు !

రాజశేఖరం రాకకు శేషగిరి ఎంతగానో హర్షాన్ని వెలిబుచ్చేడు. తండ్రికి పరిచయం చేశాడు. “ఇదుగో వీడే నా రాజశేఖరం !” అంటూ తల్లికి చూపించాడు. అతడి ఆనందం వర్ణనాతీతం !

కాని శేషగిరి ఆనందం రాజశేఖరాన్ని బల్లెమైపొడుస్తోంది !

“ఏవిటి ? పెట్టె, బెడ్డింగ్ లేక ఇట్లా వచ్చావ్...? వెంటనే వెళ్లిపోవాలనుకోవటంలేదు గదా...?”

“శేషగిరీ !” రాజశేఖరం గొంతు తడబడింది.

“ఈనాటివరకూ మనం ఆత్మీయులమైన మిత్రులం... ఈనాటినుండి... ఈనాటినుండీ మనం బంధువులం కూడా శేషగిరీ !”

శేషగిరికి తను ద్రోహం చేస్తున్నాడు.

“రాజా !...” చటుక్కున భుజాలమీద చేతులు వేశాడు శేషగిరి.

“ఏమన్నావ్ ? మనం బంధువులం అవుతున్నామా ? భారతి నీకేమౌతుంది ?”

“భారతి !...” మొహం పక్కకు తిప్పుకున్నాడు.

“భారతి మా మామయ్య కూతురు శేషగిరీ !”

“ఓ ! నిజంగానా ?” శేషగిరి గొంతు నీరసించిపోయింది.

రాజశేఖరం చటుక్కున తలెత్తాడు.

కన్నీటి భారతి కళ్లముందు మెదిలింది. పెదాలకు చిరునవ్వు పూసుకున్నాడు. తలవంచుకున్న శేషగిరి భుజం తడుతూ, “నీకు ఆనందంగా లేదూ శేషగిరీ... నిజం ! ఈనాటినుండి మనం బంధువులం !” అన్నాడు.

“అంతకంటే కావలసిందేమున్నది భాయ్ !” వెనక్కు తిరిగాడు శేషగిరి.

రాజశేఖరానికి అతని వింత ప్రవర్తన అర్థంకాలేదు. భారతి తన మామయ్య కూతురు అని చెప్పగానే అతడిలో ఎందుకు అంత మార్పు వచ్చిందో ఊహకు అతీతమే అయింది !

* * * *

మంగళసూత్ర ధారణ జరిగిన తర్వాత హృదయపూర్వకంగా దీవిస్తూ అక్షింతలు చల్లాడు దంపతులమీద రాజశేఖరం. మద్రాసులో డాక్టరు చెప్పినట్లుగా ఈ దినమే ఆమె సుఖమయ జీవితానికి మొదటిరోజు అవ్వాలని పదే పదే భగవంతుని ప్రార్థించాడు.

ఈ వివాహం జరుగకుండా చూడాలని వచ్చిన రాజశేఖరం హృదయపూర్వకంగా వధూవరులను దీవించి మరీ బయల్దేరాడు- తను అన్న మాటలు, తను చేసిన పని గుర్తుకొస్తుంటే అతడికే విచిత్రమేస్తోంది!

కాని అతడికి అర్థం కానిదల్లా శేషగిరి తనయందు చూపిస్తున్న ముభావమే! తన నుండి తప్పుకు తప్పుకు తిరగాలనుకొనే అతడి తాపత్రయమే!

అతడికి అర్థం కాలేదు.

-దానికి తోడు ఆనాడు సాయంత్రం శేషగిరి మాటలు అతడిలో విచిత్ర ప్రభావాలను రేకెత్తించినయ్. ఆలోచనా వెల్లువలో గడ్డిపోచలా కొట్టుకుపోసాగాడు. మనిషిని అనుమానపు భావనలు ఆవరించగా- జీవితమే దుర్భరమనిపించింది.. భరించలేక బాధపడ్డాడు...ఫలితమే మావయ్య ఎంతగా బ్రతిమలాడినా మరొక్కనాడు వుండకుండా పెండ్లి పందిటిలో నుండి నడిచి బయటకు వచ్చేశాడు.

-ఆ సాయంత్రం- పెండ్లి పందిట్లో ముత్తయిదువులు ఆనందంగా తిరుగుతుండగా- పిల్లలు కేరింతలు కొడుతూ ఎగురుతుండగా-

ముభావంగా, భారంగా కూర్చున్నది ఇద్దరే ఇద్దరూ. మొట్టమొదటి వాడు రాజశేఖరం- తరువాత ఎదురుగా శేషగిరి!

ఉన్నట్లుండి శేషగిరి ముందుకు వంగి అడిగాడు, “రాజా. భారతిని నీవెందుకు చేసుకోలేదు !”

రాజశేఖరం ఉలిక్కి పడ్డాడు. ముఖాన ఎవరో చాచి బలంగా కొట్టినట్లయింది. శేషగిరి ఇ ట్లా అడుగుతాడని అతడు కలలో కూడా అనుకోలేదు. ...తనలో చిన్న-చిన్నగా మొలకెత్తుతున్న అనుమానాలు బలమైన వేళ్లను నాటుకుంటున్నాయి....అతడికి నోటి వెంట మాట పెగల్లేదు...తను ఏం చెప్పాలి ?... ఎలా చెప్పగలడు?

ఫిట్స్ వచ్చే భారతిని మా అమ్మ కోడలిగాఅంగీకరించలేక పోయిందని చెబుతాడా?

శేషగిరికి చూచాయగా ఆ విషయం తెలిసీ ఏమైనాఅడుగుతున్నాడేమో ?

## చైర్మన్ షబ్నా

భారత బాలల చిత్ర సంస్థ (సి. ఎఫ్. ఎస్. ఐ.) చైర్ పర్సన్‌గా ప్రముఖ హిందీ నటి షబ్నా అజ్మీని కేంద్ర ప్రభుత్వం నియమించింది.

ప్రముఖ నటుడు, మాజీ పార్లమెంటు సభ్యుడు అమితాబ్ బచ్చన్ భార్య. ప్రముఖ నటి అయిన జయబాధురి యిన్నాళ్ళూ ఆ పదవిని నిర్వహించారు. కేంద్రంలో ప్రభుత్వం మారటంతో ఆమె ఆ పదవికి రాజీనామా యివ్వటంతో షబ్నాకు ఆ పదవి లభించింది.

అతనికి అర్థం కాలేదు...తల తిరగ సాగింది.

"కొన్ని కారణాలవల్ల ..." అన్నాడు తలెత్తకుండానే.

"అంత బలవత్తరమైన కారణాలా ?" సూదుల్లా మాటలను శరీరంలోకి పొడిచాడు.

"శేషూ !..." నిగ్రహించుకోలేక పోయాడు. కళ్లు తిరిగినయి.

తన హృదయానికి హృదయమైన శేషగిరిలో అనుమానపు బీజాలు అంకురించినయి. తను అతడిలో నీచుడయి పోతున్నాడు. తన చుట్టూ నీచత్వాన్ని అల్లుతున్నాడు. తనమీద హీనభావాలు కేంద్రీకరిస్తున్నాడు.

తన స్నేహానికిది పతనం. తమ నడుమ సన్నిహితత్వానికి యీ లక్షణాలు కత్తెర్లు !

కాని , తనేం చేయగలడు ? తనెలా చెప్పగలడు? ...తన మనస్సును ఎలా అదుపులో పెట్టుకోగలడు ?

-ఆలోచనొకటి తళుక్కున మెరిసింది.

"శేషూ !... అసలు భారతిమీద నాకలాంటి భావనే లేకపోయింది... మేమెవ్వరం అలా వూహించుకోలేదు. ...మా కుటుంబాల్లో ఎందుకనో అయిన సంబంధాలు కలిసిరాలేదు...అలా చేసిన వొకళ్లిద్దరు సుఖపడకపోగా ఎవరో ఒకరు చచ్చిపోవడం తటస్థించింది..." అబద్ధాల భవంతుల నడుమ నిట్టూర్పులు విడి

## నాకీ జీవితం చాలు

చాడు. గుండె నిబ్బరం చేసుకున్నాడు.

ఇదంతా తను శేషగిరికి చేస్తున్న ద్రోహం...ఎవరూ ఏ మిత్రుడూ, హృదయానికి హృదయమిచ్చిన ఏ మిత్రుడూ- వూహించనంత ద్రోహం !

కానీ.. దీనికంతటికీ కారణం... తను పరిస్థితుల చేతిలో కీలుబొమ్మవటమే!

శేషగిరి ప్రశ్నే తను అక్కడనుండి పరారవ్వటానికి కారణం ! పారిపోవటానికి కారణం.

రైలు ఎక్కి కూర్చుని ఎదురుగా ప్లాట్ ఫారం మీద నిలబడి వున్న శేషగిరిని చూస్తూ, గుండె పగిలిపోతుండగా , "శేషగిరీ ! భారతికి ఫిట్స్ వస్తుండటమే నేను ఆమెను భార్యగా స్వీకరించకపోవడానికి కారణం !" అని పెద్దగా అరుద్దామన్నంత ఆవేశం వచ్చింది. కానీ, సిగ్గు, భయం, అతడి నోటిని బంధించివేసినయి.

రైలు కూత కూసి పోతూవుంటే శిలా విగ్రహంలా కూర్చుని శేషగిరి ముఖంలోకి చూస్తూ ఉండిపోయాడు- అతడి మిత్రుడు రాజశేఖరం !

★ ★ ★

"శేషూ !

మిత్రమా ! ఏమని రాసేది ? ఏమని వ్రాయగలను? నాలో పెరుగుతున్న యీ లావా లాంటి భయంకర మోసం- మిత్ర ద్రోహం- నన్ను నిలువునా కూర్చి వేస్తోంది. నన్ను మ్రింగివేస్తోంది. నేను ఈ దుర్భర క్షణాలను ఈ ఉత్తరం ద్వారా వదిలించుకుంటున్నాను.. నాకిక తప్పదు... భారతి జీవితపు ఆనందపు విలువమీదనైనా సరే.. నేనీ బాధ భరించలేను..నాకదే దారి.. నా కంతకంటే దారి లేదు శేషగిరీ!...

భారతి నా భార్య కాకపోవటానికి కొన్ని సంవత్సరాలబట్టీ ఆమెను పట్టి పీడిస్తున్నఫిట్స్ కారణం... నీవు పెళ్లిలో నన్ను అడిగినా కావాలనే ఆమెను వంచించుకొని మభ్యపెట్టాను!

క్షమించగలిగే శక్తి నీలో వుంటే నన్ను క్షమించు.

ఇట్లు,
రాజా.

ఉత్తరం రాసిన అతడిని తెలియని తృప్తి ఆవరించింది. గుండెలమీద నుండి ఏదో బరువు తొలగించిపోయినట్లుగా ఫీలవ్వసాగాడు.

లేచి చొక్కా తొడుక్కుని బయటకు నడిచాడు. ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా తన చేతిలోని ఆ మోయలేని బరువును వదిలించుకోవాలి! నడుస్తుంటే భారతి కన్నీటితో కాళ్లకు బంధాలు వేసింది. నీ చేతు

...మ్‌దుగా ఆనాడు నా వివాహం జరిపి ఆ చేతులతోటే ఈ రోజు నా జీవితాన్ని త్రుంచి వేస్తావా! అంటూ నిలేసి ప్రశ్నించింది.

తనేం చెప్పగలడు? తనేం సమాధానం చెప్పగలడు?

ఆత్మన్యూనతను అనే కత్తెర్లతో ఆ బంధాలను త్రెంచివేసుకుని, కన్నీటి భారతిని కాళ్లకు దూరంగా లాగివేశాడు.

తన కంతకంటె మరోదారి లేదు!

భారతికి డాక్టరు చెప్పినట్లుగా తగ్గిపోతే ఏ భయమూలేదు. తగ్గకపోతే ఈ పాటికి ఆ విషయం శేషగిరికి తెలిసే వుంటుంది.

ఇప్పుడు తను ఈ ఉత్తరం వ్రాయడం వలన ఎవరికీ హానిచేసిన వాడవ్వడం లేదు. కాకపోగా తనలోని పాపాన్ని కడిగి వేసుకుంటున్నాడు.

వివాహమయిన తరువాత తిరిగి వచ్చిన రాజశేఖరం మూడు నెలలు వేదనను, బాధను, భయాన్ని హృదయంలో పెంచుకుని ధైర్యం చేసి వదిలించుకున్నాడు ఆరోజు.

*   *   *   *

రాజశేఖరం ఆశలు అడియాశలయినయి. శేషగిరి తనను తిట్టి పోస్తూ ఉత్తరం వ్రాస్తాడనుకున్నాడు. అలా వ్రాసి వున్నా ఎంతో తృప్తి పొందిఉండేవాడు. కాని ఎందుకో వ్రాయలేదు. ఎందుకు వ్రాయలేదు? అసలు జాబే లేదు.

వివాహమయి అపుడే అయిదు నెలలు గడిచిపోయింది. తను ధైర్యం చేసి వ్రాసిన ఉత్తరం కూడా అతడికి జేరి రెండునెలలయి ఉంటుంది.

తను క్షమింపబడలేని ఒక పని చేసి, తమ నడుమ సాన్నిహిత్యాన్ని తిరిగి కలపలేని విధంగా త్రుంచి వేశాడు.

ఆనాడు మావయ్యా, భారతీ కన్నీటితో తనని మోసం చేశారు. తనని బలహీనుణ్ణి చేశారు. తమ నడుమ స్నేహాన్ని సర్వనాశనం చేశారు.

శేషగిరికి దూరమయి, శేషగిరికి శత్రువుగా తనెలా బ్రతగ్గలడు? తనెలా జీవించగలడు?

అసలు శేషగిరి ఇన్నిరోజుల బట్టి తనకెందుకు జాబు వ్రాయలేదు. వారం రోజులు తన నుండి జాబు రాకపోతే గిజగిజ లాడేవాడు. నానా హంగామా చేసేవాడు. అటువంటివాడు తను ఇన్నాళ్లు మౌనంగా వున్నా, తనసంగతి పట్టించుకోనట్లే వూరుకున్నాడేం? జాబైనా రాయలేదే?

అవును...ఎలా వ్రాస్తాడు?

అంత హృదయపూర్వకంగా ప్రేమించే రాజశేఖరమే నిలువునా మోసం చేస్తే శేషగిరి ఇకేం చేయగలడు? దుర్భర జీవితం గడపటం కన్నా అతడికి మిగిలిందేమిటి? ఒక వేళ భారతికి ఫిట్స్ తగ్గినయ్యేమో?

ఏమో?

అలా తగ్గితే శేషగిరికి తనమీద ఎందుకు కోపం? ఎందుకు ఉత్తరం వ్రాయటంలేదు?

ఏమో...ఏమో...

ప్రపంచమే గిర్రున తిరుగుతున్నట్లనిపించింది. బలంగా కళ్లు మూసుకున్నాడు రాజశేఖరం!

*   *   *   *

ఆనాడు ఆఫీసుకు వెళ్లేటప్పటికల్లా హైద్రాబాదులో వున్న హెడ్డాఫీసుకు అర్జెంటు పనిమీద పోయిరమ్మంటూ ఆర్డర్లు చేతికిచ్చారు రాజశేఖరానికి.

వారంరోజులు పని!

తప్పేదేమున్నది-పెట్టె, బెడ్డింగుతో బయల్దేరాడు.

ఒకవిధంగా హైదరాబాదు వెళ్లటం సంతోషంగా వున్నది. అటుబాధ గాను, భయంగాను వున్నది.

అంతదూరం వెళ్లి శేషగిరిని కలవకుండా తనెలా రాగలడు?

శేషగిరిని తను చూస్తాడు-ఇన్నాళ్లా తనకెందుకు వుత్తరం వ్రాయలేదూ అని నిలదీసి ప్రశ్నిస్తాడు! తను శేషగిరిని చూడకుండా వుండలేడు...తను వెంటనే వెళ్లి కలవాలి. ఒక విధంగా ఇదే క్రమ్ముకున్న మబ్బులను విడదీసి ఆహ్లాదాన్ని చేకూర్చే అవకాశం!-సదవకాశం!

హైదరాబాదు వచ్చిడన్న మాటేకాని శేషగిరిని చూడాలంటే భయంవేసింది. ఎక్కడ కనబడతాడో అని దొంగలాగా తప్పుకొని తిరిగాడు. మనిషిని మానసిక బలహీనత ఆవరించగా శరీరాన్ని నీరసం ఆవరించింది.

ఒక్కొక్క క్షణంలో అనిపిస్తుంది-శేషగిరి కోసరం కాకపోయినా భారతి కోసరమైనా ఒకసారి వాళ్లింటికి వెళ్లి రావాలని... ఒక్కసారి భారతిని చూచిరావాలని... కాని భారతి తనని గురించి ఏమనుకుంటుంది?

తను ఆమె జీవితంలో నిప్పులు పోయ ప్రయత్నించాడు. ఆమె జీవితపు మలుపులో ఆనాడు చేయూత నిచ్చి ఈనాడు నట్టనడి సముద్రాన నీటిలోకి అసహాయంగా త్రోసివేశాడు. అతడి తల తిరిగిపోసాగింది. తనకు ఇద్దరూ ముఖ్యులే-తను ఇద్దరికీ అన్యాయంచేశాడు. అసమర్థుడి జీవితానికి తను నిదర్శనం! తను అసమర్థుడు-తను ఎందుకూ పనికిరాని పిరికిపంద.

*   *   *   *

శేషగిరిని చూస్తూనే రాజశేఖరం కొయ్యలా బిగుసుకుపోయాడు.

వాడు తన శేషగిరేనా? అందానికి ప్రతిబింబమైన వాడు అలా నీరసించి, కృశించి ఎముకల గూడులా వున్నాడేం? జబ్బుగాని పడలేదు గదా? రెండు నిముషాల వరకు మాట్లాడలేకపోయాడు. విచిత్రంగా, కన్నార్పకుండా వున్న అతడిని వింతగా చూస్తూ, "నేనురా! రాజశేఖరాన్ని!" అన్నాడు.

"కూర్చో!"

కూర్చున్నాడు. చచ్చిపోయికూర్చున్నాడు రాజశేఖరం.

తను శేషగిరితో ఏం మాట్లాడగలడు? ఏమని మాట్లాడగలడు?

క్షణక్షణం తను చేసిన మోసం, అన్యాయం, అసహ్యపు చూపులతో మీదిమీది కొస్తోంది.

"శేషగిరి నేనిలా బ్రతకలేను" పెద్దగా

## "కిరణ్‌బేడీ"గా విజయశాంతి



హిందీ చిత్రరంగంలో జయప్రద, శ్రీదేవి మాదిరి ఒక వెలుగు వెలుగుదామని వెళ్లిన విజయశాంతి 'ఈశ్వర్' చిత్రం తర్వాత ఛాన్సులు రాక ఖాళీగా వుండిపోయి మళ్లీ యిప్పుడు సూర్యా మూవీస్ పుణ్యమా అని వార్తల్లో కెక్కింది.

ఆ మూవీస్ వారు కిరణ్‌బేడీ జీవితం ఆధారంగా తీస్తున్న 'కర్తవ్యం' చిత్రంలో విజయశాంతికి టైటిల్ రోల్ యిచ్చారట. దానితో బొంబాయికి గుడ్‌బై కొట్టి మద్రాసు చేరింది. ఈ చిత్ర ముహూర్తానికి కిరణ్‌బేడీ స్వయంగా హాజరయ్యారట. పోలీసు అధికారిగా ఆమె నిర్మాతలకు కొన్ని సలహాలు కూడా యిచ్చారు. బేడీ వ్యక్తిత్వానికి ఎటువంటి యిబ్బంది కలగకుండా విజయశాంతి ఈ పాత్రలో ఏమేరకు న్యాయం చేస్తుందో వేచి చూడాలి!

# "గాన కోకిల" అవ్వాలని వచ్చాను...



హిందీలో హాస్య నటిగా ప్రసిద్ధి చెందిన "టున్ టున్" అసలు పేరు ఉమా దేవి. ఆమె సినిమాల్లో నటించాలని ఎప్పుడూ అనుకోలేదు. చిన్నవయసు నుంచీ సినిమాల్లో పాటలు పాడి, గాన కోకిల కావాలని కలలు కన్నది.

ప్రస్తుతం చిత్రాలలో టున్ టున్ ఎక్కువగా కనిపించటం లేదు. అలా అని పూర్తిగా మరుగున పడిందని అర్థంకాదు. ఇంకా అడపాదడపా తెరనిండా వస్తూనే ఉంది. నవ్వులు కురిపిస్తూనే వుంది.

ఎస్. వి. రోడ్, బాంద్రా కోర్ట్ ఎదుట 12, సుజాతా బిల్డింగ్ (బొంబాయి- 50)లో ఉంటున్న టున్ టున్‌ని హిందీ ఫిలిమ్ ప్రియులంతా ఎరుగుదురు.

"మొదట మీరు గాయికగా సినిమాల్లో పరిచయమైనారు కదా? ఏక్టింగ్ వైపు మీ మనసెందుకు మళ్ళింది? గాయికగా మీకు అవకాశాలు దొరకలేదా?... అని అడిగితే టున్‌టున్ గలగలా నవ్వింది. అది టున్‌టున్ టైపు నవ్వు. ప్రక్క లెగరేస్తూ చేసే అట్టహాసం అది.

"చూడండి. నటన వైపు నా మనసులో ఎన్నడూ ఆశలు లేవు. అయితే, గాన కోకిల నవ్వాలన్న సరదా నాకు బాల్యం నుంచీ ఉండేది. గాన కోకిలవి కావాలని వచ్చాను. హాస్య నటివి చేసారు నన్ను... 1955 నాటి సంగతి. దిలీప్‌కుమార్, నర్గీస్‌తో 'బాబుల్' చిత్రం తీస్తున్నారు నౌషాద్. నాకు సన్నిహితులు. ఆయన నాకు ఒకరోల్ ఇస్తానన్నారు. ఆయన మాట కాదనలేక సరేనన్నాను. నాకోసం ఆ రోల్ ప్రత్యేకంగా రాయించారు ఆయన. 'బాబుల్' హిట్ కావటంతో నేను క్రమ క్రమంగా సినిమాల్లో బిజీ కాసాగాను" అంది టున్‌టున్ నవ్వుతూ.

"బాబుల్ చిత్రం వచ్చే ముందు- గాయిక ఉమాదేవిగా మీరు 'పేరు' తెచ్చుకున్నారు కదా? ఈ 'పేరు' ఎందుకు వదులుకున్నారు?"

"ఆ సమయంలో నేను ఇంత లావుగా ఉండేదాన్ని కాదు. నేను ఉమాదేవి పేరుతో ప్రసిద్ధి గావటం సందిగ్ధమని భావించి దిలీప్‌కుమార్, నౌషాద్‌లు నా పేరు మార్చారు. గంట గణ గణ మోగినంతగా మారు మోగాలన్నారు దిలీప్‌కుమార్. ఆ తర్వాత ఆయన, నౌషాద్ కలిసి నాకీ పేరు బాగుంటుందన్నారు. దిలీప్‌గారు అన్నట్లే హాస్య నటిగా నేను చాలాకాలం గణగణ మోగిన నవ్వుల గంటనయ్యాను కదా?" నవ్వుతూ అడిగింది టున్‌టున్.

"ఘంటారావం టున్‌టున్‌జీ, మీ సినిమా ప్రవేశానికి ముందు మీరు ఏవైనా ఇబ్బందులు ఎదుర్కొన్నారా?"

"ప్రతి కళాకారుడుకీ, కళాకారిణికీ జీవితంలో ఇబ్బందులే ఎక్కువగా ఉంటాయి. సంఘర్షణ లేకుండా నట జీవితంలో ఎవరూ ఉన్నత స్థానం చేరుకోలేరు. ఇండస్ట్రీలో మిగతా రంగాలలో కూడా ఈ విషయం అబద్ధం కాబోదు. నేను 15 ఏళ్ళ వయసులో గాయికని కావాలని బొంబాయి వచ్చాను. నాకు 17 ఏళ్ళు వచ్చేసరికి పాడే అవకాశం దొరికింది. అంటే- రెండు సంవత్సరాలు నేను ఇబ్బందులు ఎదుర్కొన్నట్టే కదా?"

---

అరుద్దామనుకున్నాడు. నేనీ బాధ భరించలేను!

కొన్ని నిమిషాలు వాళ్లకు భయంకర భూతాలే అయినయి.

శేషగిరి ఆకారం చూస్తుంటే భారతికి ఫిట్స్ తగ్గలేదనే అనిపించింది.

ఆ కళ్లలో వేదన, ఆమె ముఖంలో దిగులు, అతడిలో నిర్లిప్తత, స్పష్టంగా అతడిలోని బాధను తెలియజేస్తున్నాయి!

భారతికి ఫిట్స్ తగ్గలేదు!

తన చేతులతో శేషగిరి జీవితాన్ని సర్వనాశనం చేశాడు. అతడు ఈనాడు ఇలా కృంగికృశించిపోవటానికి కారణం తను!

శేషగిరి లేచాడు.

"లోపల చెప్పి వస్తాను... అలా వెళ్దాం!"

అతడి మాటలకు దొంగలా వణికిపోయాడు రాజశేఖరం!... ఇక్కడయితే భారతి వింటుందని బయటకు తీసుకువెళ్లి నాలుగు మాటలు అడిగేందుకు? కోపంతో తిట్టిపోసేందుకు?

తడబడ్డాడు రాజశేఖరం.

లేదు శేషగిరి! నేను వెంటనే వెళ్ళిపోవాలి. ఆఫీసు పనిమీద వచ్చాను.. ఇక్కడ వుండటానికి వీల్లేదు!"

శేషగిరి శుష్కహాసం చేశాడు.

తరువాత ఒక్కక్షణానికి వున్నట్లుండి తల ఎగరవేశాడు. కళ్లను ఎర్రటిజీరలు అలుముకున్నాయి. మనిషి బిగుసుకుపోయాడు. ముందుకు అడుగులు వేస్తూ, "అయితే ఎందుకు వచ్చావ్?... ఎందుకువచ్చావు రాజశేఖరం మా యింటికి... నీ శేషగిరి సౌభాగ్యాన్ని, నీ శేషగిరి సౌఖ్యాన్ని, నీ శేషగిరి అందాన్ని, నీ శేషగిరి ఆనందాన్ని చూద్దామని వచ్చావా?... ఇక చూచావుగా వెళ్ళు... ఊ... వెళ్లు రాజశేఖరం.... వెళ్ళిపో... నీ మొఖం నేను చూడలేను. వెళ్లిపో, యుఫెలో.... ఫస్టగెటౌట్....!" పెద్దగా పిచ్చిగా అరిచాడు.

అతడి ఆకారానికి, మాటలకు, నిర్జీవుడయ్యాడు రాజశేఖరం. శరీరం వణికింది. గొంతుతడబడింది. నంగివంగిగా, "నన్ను క్షమించలేవా?" గొణిగాడు.

"యూ రాస్కెల్.... గెటౌట్!"

చటుక్కున వెనక్కి తిరిగాడు రాజశేఖరం. పరుగెడుతున్నట్లుగా గేటు దాటాడు. అడుగులు అతి వేగంగా పడుతున్నాయి.

రాజశేఖరం తేలిపోతున్నాడు. తనకు తగిన శాస్తి జరిగింది. తన హృదయం ఇప్పుడెంతో తేలిగ్గా వుంది. హాయిగా వుంది. ఆనందంగా వుంది. తనలో ఇప్పుడు ఎలాంటి బరు

## క్రీడారంగం క్విజ్ జవాబులు

జవాబులు : (1) సచిన్‌టెండూల్కర్ (2) సునీల్‌గవాస్కర్ (ఆంధ్ర యూనివర్సిటీ) (3) ఎం. డి. వలసమ్మ, మిల్కాసింగ్ (4) కమల్‌జిత్‌సాంధు (5) లిండర్‌పేస్ (6) ప్రేమ్‌చంద్‌డోగ్రా (7) అర్చనా భరత్‌కుమార్ రోపర్‌విల్ నుండి జ్యూరిచ్ వరకు గల 26 కి. మీ. దూరాన్ని 9 గం. 51 ని. 20 సె. పూర్తిచేసి బంగారు పతకం సాధించింది. ఈమె వయస్సు 13 సంవత్సరాలు. (8) అనితాసూద్ (8 గంటల 15 నిమిషాలు) (9) భాగ్యశ్రీసాథే (10) ఎమీల్‌జెటోపాక్.

# కాని "టున్ టున్" ఐ పోయాను

## చాలా కష్టాలు

"ఎలాంటి ఇబ్బందులు పడ్డారో వివరంగా చెప్తారా?"

ఈ ప్రశ్న వినగానే ఆమె గతంలోకి వెళ్ళిపోయింది. అప్పటి రోజులు గుర్తుకి రాగానే, టున్ టున్ గొంతు జీరబోయింది.

"రోజూ ఇంట్లో పనులు చేసి బయట పడగానే, ఒక స్టూడియో నుంచి మరో స్టూడియోకి పరుగులు పెట్టేదాన్ని. ఆ రోజుల్లో పరేల్ (బొంబాయి)లో "కార్‌దార్ స్టూడియో" ఉండేది. రోజూ అక్కడికెళ్ళి, గంటల తరబడీ అక్కడ కూర్చుండేదాన్ని. నేను నౌషాద్‌గారి అభిమానిని. ఒక రోజు ఆయన దగ్గరకెళ్ళి, నా మనసులోని కోరిక బయట పెట్టాను. నా పాట వినాలన్నారు ఆయన. 'నూర్జహాన్' పాడిన ఒక పాట పాడి వినిపించాను. నా స్వరం ఆయన్ని ఆకట్టుకోగలిగింది. నన్ను 'కార్‌దార్,' ప్రొడక్షన్స్‌లో చేరమన్నారు. ఆ సలహా పాటించాను. నా మొదటి పాట 'దర్ద్' సినిమాకు రికార్డయింది- 'అఫసానా లిఖ్ రహీహూం దిలే బేకరార్‌కా...' ఈ పాట తర్వాత ఉమాదేవి పేరు ప్రసిద్ధి చెందింది."

"సినిమాల్లో చేరటానికి మీ ఇంట్లో మిమ్మల్ని అభ్యంతర పెట్టలేదా?"

"నా చిన్నతనంలోనే నేను తల్లి- తండ్రిని పోగొట్టుకున్నాను. వాళ్ళు స్వర్గస్థులు కావటంతో నేను మామయ్యగారింట్లో పెరిగాను. మా నాన్న హత్య చేయబడ్డారట. ఆ దుఃఖంతో మా అమ్మ మంచంపట్టి, ప్రాణాలు వదిలిందట. అప్పుడు నేను చాలా చిన్నదాన్ని. మామయ్యకి సినిమాల గురించి బొత్తిగా తెలీదు. నేనేం చేస్తున్నదీ కూడా ఆయన విచారించే వారు కాదు. నాకు అలాంటి స్వాతంత్ర్యం ఇచ్చాడు మామయ్య.

"ఇంతవరకు మీరు ఎన్ని సినిమాల్లో నటించారు.?"

## మేరీ జరూరత్ అబ్ నహీ

"లెక్క చెప్పటం కష్టమే... ఓ పని చేయండి, ఇన్‌కంటాక్స్ వాళ్ళని అడిగితే, మీకు సరియైన లెక్క దొరకొచ్చు..." అని స్త్రోత్కాయం కుదుపుకుంటూ నవ్వింది టున్ టున్.

"ఈ మధ్య మీరు తెరమీద ఎక్కువగా కనిపించటంలేదు. కారణం చెప్తారా?"

"చెప్పేందుకేముంది? రానురాను సినిమాల్లో కామెడీ తగ్గిపోతోంది. నా అవసరం తీరిపోయిందా సినిమా పరిశ్రమకి? అనిపిస్తుంది ఒక్కోసారి. కాని, ఏమైనప్పటికీ- నేను హాయిగా ఉన్నాను. 'భీమ్ భవానీ' టి. వి. సీరియల్‌లో పని చేసాను. నా రాబోయే సినిమా 'మా కసమ్'... ఇప్పటికీ నిర్మాతలూ- దర్శకులూ నన్ను గుర్తు పెట్టుకుని, అవసరం కనిపించగానే వెంటనే పిలుస్తున్నారు. ఎందుకో తెలుసా?"



నర్మగర్భంగా అడిగింది టున్ టున్.

"చెప్పండి......."

"ఈ మాత్రం తెలుసుకోలేక పోయారా? టున్‌టున్ స్థానాన్ని మరెవ్వరూ ఆక్రమించలేరు సార్.... టున్‌టున్ మాత్రమే ఆ పాత్రల్ని పోషించాలి... ఏమంటారు?"

మీరేమంటారు?

సేకరణ :
సుంకర భాస్కరరావు

---

వూలేదు. వేదనలేదు. బాధలేదు. భయం లేదు.

తను చేసిన తప్పుకు- తాను ఫలితం అనుభవించాడు! అదిచాలు!

రైలెక్కాడు. తన వూళ్లో దిగాడు.

*** ***

సరిగ్గా మూడు రోజుల తర్వాత ఒకనాడు మధ్యాహ్నం ఆఫీసులో కాగితాలనన్నిటినీ ఎక్కడివక్కడ వదిలేసి, గుడ్లనీరు కుక్కుకుంటూ ఇంటికి పరుగెత్తుకుంటూ వచ్చాడు రాజశేఖరం. అతడి చేతిలో ఆ రోజు టపాలో వచ్చిన ఉత్తరం నలిగిపోయి వున్నది. అతడి హృదయం కరిగిపోయింది. అతడు నలిగిపోయి వున్నాడు. ఇంటిముందు వరండాలో నిలబడి "అమ్మా" పెద్దగా ఏడ్చాడు.

ముందు వచ్చి నిలబడ్డ ఆమె ముందు చేతిలోని వుత్తరాన్ని విసిరివేశాడు రాజశేఖరం.

అందులో ఇలా వుంది.

"బావా!

నాకు అనిపిస్తుంటుంది ఒక్కొక్క క్షణంలో- ఈ ప్రపంచమంతా ఇంద్రజాలం లాంటిదని! కోరికలు గుర్రాలై స్వారిచేస్తుంటే

## నాకీ జీవితం చాలు

మనిషి మానవత్వమే కోల్పోతున్నాడు- రేపటి మీద ఆశ మనిషిని అధఃపాతాళానికి తీసుకు వెళ్తోందని!

అది నిజం బావా!

మొన్నటి దినాన నీవు మా గడపలో కాలుపెట్టి, వారిచేత వెళ్లగొట్టించుకోబడిన నాడు, నీవు వెనుదిరుగుతున్న సమయంలో నీ మొఖంలో నేనేదో తృప్తి చూశాను. అలాగే నిన్ను నానా దుర్భాషలాడి లోపలికి వచ్చిన ఆయన మొఖంలో అలాంటి తృప్తే చూశాను!

మీ ఇద్దరిలోనూ ఆ తృప్తిని చూసిన ఈ భారతికి ఈ జీవితం మీదే తృప్తి తీరిపోయింది. అది నీకర్థం గాదు-

నీ ఉద్దేశ్యంలో- నేను నీ మిత్రుణ్ణి సర్వనాశనం చేశాను- నీ మాటల్లోలాగా అత్యున్నత సోపానాల నెక్కవలసిన నీ మిత్రుణ్ణి అధఃపాతాళానికి త్రోసి వేశాను. అతని ఆనందాన్ని, సౌఖ్యాన్ని, సౌభాగ్యాన్ని అతడికి మిగలకుండా రంగరించి త్రాగివేశాను- నేను- ఫిట్స్‌తో బాధపడే భారతిని!

ఇది నీకు తెలిసిన సత్యం- నీ మిత్రుడి మొఖంలో నీవు చూసిన సత్యం!

కాని- జరుగుతున్న చరిత్ర వేరు- రోజురోజుకు 'ముందడుగు' వేస్తున్న మానవుల్లో ఇంకా 'శిలాకాలం' నాటి వ్యక్తులు వున్నారని నీకు తెలిసివుంటే- నీకు ఆనాడు మా నాన్న ముందు- అంత ఆవేశాన్ని చూపించి వుండేవాడివేగాదు- పోనీయ్ గతాన్ని తవ్వుకుని నేను పొందుకునేదేమిటి? మూఢనమ్మకాలు జలగల్లా పట్టిపీడిస్తూంటే హితాహితా జ్ఞానాన్నే కోల్పోతున్నాడు మానవుడు- అందునా పూర్వకాలపు నేటి మానవుడు- ఈనాటి ప్రబుద్ధుడు, పెద్దైన తలనెరిసిన పెద్ద మానవుడు!

చాలా ఆశ్చర్యంగానూ, అసహజంగానూ, నమ్మలేనిదిగానూ వుండే ఈ విషయాన్ని నీకు వ్రాయకుండా వుండలేను బావా!- నీకు తప్ప మరెవరికీ వ్రాయలేను గూడా?

నీ మిత్రులయిన, పూజనీయులయిన నా భర్తగారికి- మానవుడు గీసిన జాతకాల్లో రెండవపెళ్లి వ్రాసిపెట్టారట- అందునా మొదటి వివాహమయిన మొదటి సంవత్సరం తిరక్కముందే మొదటి భార్య వియోగం సంభ

# క్రీడా తారల పెళ్ళిళ్ళు



## శ్రీమతి కానున్న పి. టి. ఉష

మనము బంగారు లేడి, కేరళవారు 'పయోలీ ఎక్స్‌ప్రెస్'గా అభిమానంగా పిలిచే ఉష పరుగు పోటీల నుండి విరమించుకోకలదని పయోలీలో పత్రికా విలేఖరుల సమావేశం (జనవరి 21)న ఉష తండ్రి ఇ. ఎం. పైతల్ తెల్పారు. త్వరలో ఉష పెళ్ళికూతురు కానున్నదని అన్నారు. వరుడు ఎవరో తెల్పలేదు. ఉష మాత్రం ఖచ్చితంగా తన నిర్ణయం ఏమిటో చెప్పలేదు.

## గ్లామర్ బాయ్ రవిశాస్త్రి

క్రికెట్ ఆటలో ప్రతిభ తగ్గినది ఇంతవరకు అనేక కన్యల కలల వరుడు అయిన రవిశాస్త్రికి. అమృతాసింగ్, స్టెఫీగ్రాఫ్‌లతో ఎవరో ఒకరిని పెళ్ళి చేసుకుంటాడు అనుకున్నారు. రవి యిక ఆలస్యము చేయకూడదనుకున్నాడు. త్వరలో ఢిల్లీ కళాశాల విద్యార్థినిని వివాహమాడతాడని వార్త.

రవి ఆమెతో ఉన్న ప్రేమ వ్యవహారము పెళ్ళితో ముగిస్తాడు అని ఆశిద్దాము.





## ఆనంద్ అమృతరాజ్

ఆనంద్ అమృతరాజ్- అందాల నటి శ్రీదేవి పెళ్ళి చేసుకుంటారని పుకారు. ఆనంద్ అమృతరాజ్ క్రైస్తవ మతస్తుడు. అంతేకాకదిటీ టెన్నీసు ఆటగాడు- సినీ ప్రొడ్యూసర్.

శ్రీదేవి యీ విషయంలో ఏ ప్రకటనా చేయలేదు.

-ముకరమ్

వించటమూ ఖాయమేనట!

- అందుకనే అసలు భార్యగా కావాల్సిన కళ్యాణీ, అనే ఒక అందమైన మేనగోడలును జీవితాంతం భార్యగా అట్టిపెట్టుకునేందుకు గాను ఈ భారతిని బలియివ్వదలుచుకున్నారు!

హు.... ఆలోచించు బావా.... మానవుడు ఎంతగా పురోగమిస్తున్నాడో ఆలోచించు!

నేను ఇదంతా మీ మిత్రులనెత్తిన రుద్దటంలేదు. ఒక విధంగా జాలిచెందుతున్నాను గూడ. ఎందుకంటే ఆయనకు 'అంతగా' ఇలా చేయటం ఇష్టంలేకపోయినా ఆయనను 'ఒప్పుకునేటంతగా' మార్చి ఈ వివాహం చేశారు- నాచే పాదపూజ చేయించుకోదగ్గ ఘనులు- పెద్దలు- ఆయన తల్లిదండ్రులు!

కాని అనుకోకుండా- త్వరలో అమెరికా వెళ్లబోయే ఆయన జీవితంలో పిడుగుపడింది- ఆయన మొదటి భార్యగా- నేనైన భారతి ఆయన ఆప్తమిత్రుడైన నీ మేనగోడల్నవ్వటం తటస్థించింది.

## నాకీజీవితం చాలు

ఆయన ఈ నిజాన్ని భరించలేకపోయారు. విలవిలలాడిపోయారు. గిజగిజలాడిపోయారు. బాధ, భయం, సిగ్గు, ఆవేదన, దిగులు భరించలేక చచ్చిపోయారు! ఒక్కొక్కళ్లు తను చేసిన తప్పుకు భయపడి దొంగలాగా ప్రవర్తిస్తుంటారు- ఆయనా అలాగే ప్రవర్తించారు- నీయందూ అలాగే ప్రవర్తించారు- ఆనాడు నీవు మా గృహంలో కాలుపెట్టిన నాడు ఆయనలో వెలువడిన ఆవేశానికి హేతువు ఆయనలోని పిరికితనమే- ఆయన నుండి కోపంగా వెలువడిన మాటలు దానికి ప్రతిబింబమే!

నీకు చాలా పెద్ద ఉత్తరం వ్రాశాను గదూ బావా! ప్చ్... ఎందుకిదంతా!....

అందుకే... ఆనాడు నీకు మాట ఇచ్చాను చూడు కల్యాణపుబొట్టుతో, కాళ్లకు పారాణితో, నూతన వస్త్రాలతో.... నీకు వాగ్దానం చేశాను.... మీ మిత్రుడి ఆనందాన్ని, భావిజీవితపు ఆధిక్యాన్ని నేను హరించటమే నిజమయితే.. అవును... నిజం.... నేను ఈనాడు హరించటమే నిజమయింది బావా!.... మద్రాసులో డాక్టరు చెప్పింది అక్షరాలా నిజమే అయినా... మరో విధంగా ఆయన్ను హింసిస్తున్నాను. అందుకే ఈ ఉత్తరం నీకు అందేనాటికి ఈ భారతి జీవితం- మానవుడి పిచ్చిగీతలకు ఒక రూపాన్నిస్తూ (తప్పక!)- ఈ భూమ్మీద 'నిజం' గాకుండా- అనంత వ్యాప్తమయిన ఏవో- (అక్కడే) ఉంటుందో నాకు తెలియదు!) కలిసిపోయి వుంటుంది.

నాకీ, జీవితం చాలు బావా!... నా ఈ కాస్త జీవితంలోనే ఈ ప్రపంచంలో ఎన్నో నేర్చుకున్నాను- ఎన్నో నేర్పించుకున్నాను- అందుకే ఈ సమయంలో ఒక్క బొట్టు కన్నీరు కార్చటం గూడా వృధా అనిపిస్తోంది....

- "భారతి"

# ఈవారంలో మీ యోగం

**23-2-1990 శుక్రవారం మొదలు 1-3-1990 గురువారం వరకు**

**మేషం :** వస్తు వాహన సేకరణలో అభివృద్ధి కరమైన మార్పులు రానున్నవి. ఉద్యోగమందు 'ప్రమోషన్' కొందరకు చెప్పవచ్చు. ముద్రణా యంత్రాంగాన శ్రమించువారికి అనుకూలం, లాభప్రదం. స్త్రీలకు : వృత్తి పెంపు, ఆరోగ్యరీత్యా అనుకూలత.

**వృషభం :** 'గురుడు' ఎంతగా మేలు చేసినా మీ మనోభీష్టం నెరవేరదు. ఆదాయంలో పాత పాటే! ఇదిగాక 'రోడ్డు' ప్రమాదం, దెబ్బ తగలటం, కట్టు కట్టించుకోటం జరుగవచ్చు. స్త్రీలకు : మిక్కిలి జాగ్రత్తగా ఉండాలని చెప్పక తప్పదు. ఉద్యోగస్తులతో కూడా అంతే, గ్రహించండి.

**మిధునం :** ఎంత గొప్పవారికైనా, ఎంత చాకచక్యంతో మెలగినా యిబ్బంది రాక పోదు. ముఖ్యంగా ఈ వారం చెప్పదగిన, ముఖ్యాంశం ఆదాయం లేకపోలేదు. సంబంధం నిశ్చయింప బడుట గమనింపదగిన అంశం. స్త్రీలకు: ఆరోగ్యవృద్ధి, సుఖ శాంతులు, నూతన మిత్ర సమాగమం.

**కర్కాటకం :** చాల దూర ప్రాంతాలనుండి బంధువుల రాక, పాత్రికేయులకు అభివృద్ధి, పంపిణీదారులకు మేలే. ఏమైతేనేం, రాశియందు 'కేతు'గ్రహం ఉండనే ఉన్నాడు. ఇంటి దొంగతనం జరుగవచ్చు. స్త్రీలకు : అయినవారి సంబంధం నిశ్చయింపబడుచున్నది. కల్యాణ గడియలు రానున్నవి.

**సింహం :** ఏ ప్రయత్నం చేసినా అనుకూలమే. బంధు మిత్రులను ఆదరించవలసిన సమయం. ఆరోగ్యమందు ఎంత జాగ్రత్తగా వ్యవహరిస్తే అంత మేలు. ప్రయాణమందు జాగ్రత్త పడాలి. స్త్రీలకు : రచయితలకు, గాయకులకు, నిర్మాత వర్గానికి మేలే. స్త్రీలకు : శుభ సమయం. ఆదాయలోపం రాదు.

**కన్య :** అపూర్వ వస్తు సేకరణకు ఆస్కారం. కళా సాహితీ రంగాన శుభ సమయం. అనుకూలత యున్నది. బంధు మిత్రులను ఆదరించవలసిన వారం. స్త్రీలకు : ఆదాయవృద్ధి, సభా మర్యాద, యత్న కార్యానుకూలం.

**తుల :** ఈ వారమంతా యోగదాయకమే. ముఖ్య గ్రహానుకూలత గలదు. రాహు కేతువులు మాత్రం సహకరింపరు. ఇంట దొంగతనం జరుగవచ్చు. 'రోడ్డు' ప్రమాదం చెప్పవచ్చు, జాగ్రత్త. స్త్రీలకు : యోగదాయక దినం.

**వృశ్చికం :** క్రమంగా 'శని' మీ రాశిని ఆశీర్వదించనున్నాడు. అంతేగాక శుక్ర, రవి గ్రహాలు కూడా మీకు యోగ ప్రతులు. ఇష్ట బంధు సమాగమం. ఆరోగ్యమందు పెంపు. దారి ప్రయాణం ఏదైనా జాగ్రత్త అవసరం. స్త్రీలకు : వృత్తి పెంపు, ధనలబ్ధి, సుఖ శాంతులు.

**ధనుస్సు :** చాల దూర ప్రాంతాలకు వెళ్లవలసిన అగత్య మున్నది. మిత్ర స్నేహ మున్నది. శుభదాయకం. కళా సాహితీ రంగాన అనుకూలత యున్నది. అప్రయత్న ధన లబ్ధి, స్త్రీలకు : నూతనోద్యోగావకాశం కొందరకు, 'సినీ' రంగాను కూలత కొందరకు.

**మకరం :** 'శని', 'గురు' గ్రహాలు ఏవిధంగా మేలు చేయజాలరు. రాహు, కేతువులు అంతే. శుభ ప్రస్తావన లుంటాయి. పదిమందిలో పేరు తెచ్చుకొంటారు. స్త్రీలకు : అంతే. ఉద్యోగ వృత్తులందు మేలున్నది, గ్రహించాలి.

**కుంభం :** 'శని' ఒక విధంగా మిమ్ము పక్షి చూస్తాడు. గురు, శుక్రులున్నారుగా! ఇకనేం? సకలమూ ఆనందదాయకం, అనుకూలదాయకం. ఆట పాటలలో ప్రావీణ్యత గల వారికి చక్కని అవకాశాలు. బహుమతులు రాగలవని గ్రహించాలి. స్త్రీలకు : ఉద్యోగమందు మేలున్నది. లాభ మున్నది.

**మీనం :** ఆదేమి, ఇదేమని ఆతురతతో ఏదో పని చేయబోతారు. ఇబ్బందికి దారి తీసే వారమే. 'గురు' గ్రహానుకూలత వలన సర్వం అనుకూలం. వ్యాపార లాభం. వ్యవహార విజయం. స్త్రీలకు : బంధు సమాగమం, ధనలబ్ధి.

—విద్వాన్ కోట సత్య రంగయ్యశాస్త్రి

## హబ్బీతో జయ హ్యాపీ!

దక్షిణాది అందాల రాణి జయప్రద యిటీవల తనపై వస్తున్న తప్పుడు ప్రచారానికి ఫుల్‌స్టాప్ పెట్టి అలా ప్రచారం చేసే వాళ్ల నోళ్లు మూయించాలని తీవ్ర ప్రయత్నాలు చేస్తోందట.

తన భర్త శ్రీకాంత్‌నహతాను ఒక యింటర్వ్యూలో వేనోళ్ల కొని యాడిందట. భర్తను భార్య పొగడ టంలో వింతేముంది. కాని జయప్రద విషయంలో ఏమన్నా ప్రాముఖ్యత సంతరించు కున్నదేమో! మా మా వ్యక్తిగత విషయాల్లో రాజీకి వచ్చి మేము ఆనందంగా పెళ్లి చేసుకున్నాం, మా వ్యక్తిత్వాలను నిలుపు కుంటున్నాం. అదే నన్ను చిత్ర నిర్మాణానికి ప్రోత్సహించింది. నా భర్త నన్ను అర్థం చేసుకున్నారు. అంతకంటే మగడు నుంచి మగువ ఏం కోరుకుంటుంది చెప్పండి అందట. భర్తతో హ్యాపీగా వుంటే ఎవరు మాత్రం యింకేం కోరుకుంటారు? వ్యవహారం ముదిరితేనే యిబ్బంది!





సీరియల్

# సూపర్ హీరో

**మన్నెం శారద**



(గత సంచిక తరువాయి)

**10**

రాజ్యలక్ష్మి స్టూడియోలో షూటింగ్ మొదలైంది. అది గణేశన్‌గారి చిత్రం. జయలత హీరోయిన్‌గా దమయంతి విజయేంద్ర అక్కగారిగా నటిస్తున్నారు. దమయంతి పూలలో దారంలా ఆ సిని మాలో కీలకమైన పాత్ర నటిస్తోంది. లైట్స్ ఆన్ చేసి ఫాన్స్ ఆఫ్ చెప్పి క్లాప్ కొట్టగానే దమయంతి పూర్తిగా తన పాత్రలో ఒదిగిపోయి నటించడం విజయేంద్రని అచ్చెరువుకు గురి చేసింది. కనురెప్ప లెత్తడానిక్కూడ టేకులు కేకుల్లా తినేసే చాలమంది అతనికి తెలుసు.

దమయంతి ప్రతి టేక్‌ని మొదటిసారే ఓ.కె. చేయించడంతో తను గణేశన్ గారికి క్షమాపణ చెప్పడంలో ఏ మాత్రం తప్పులేదనిపించింది. ఇంత మంచి నటిని గ్లామర్‌లేదని పరిశ్రమ పక్కకి నెట్టడం ఎంత అన్యాయమో అతనికి తెలిసింది. సీన్స్ వెంట వెంటనే ఓ.కె. అయిపోవడంతో గణేశన్ గారి ఆనందానికి అంతులేకుండా పోయింది.

"బొమ్మ ఏమిదా వస్తుండాది! నిండా సేటిస్‌ఫేక్షన్ అయిపోతున్నాది చూస్తదా వుంటే!" అన్నాడు ఆనందంగా.

"మరయితే మాకేమిస్తారు?" అంది ఉత్సాహంగా జయలత.

"నీకుదా మరో బొమ్మ ఇచ్చి పూడుస్తును. మా హీరోకి ఏమిచ్చినా రుణం తీరదే!" అన్నాడు గణేశన్.

విజయేంద్ర చిన్నగా నవ్వి "అంత పెద్ద మాటలు దేనికి సర్! ఈ పిక్చర్ మేం ఊరికినే చేయడం లేదుగా!" అన్నాడు.

"అదిదా నీలో పెరియ (పెద్ద) గుణం. అందుకే నీవుదా నిండా నూరేళ్లు వుండాలి!" గణేశన్‌గారి మాట పూర్తి కాకుండానే రివ్వున అక్కడికి పరిగెత్తుకొచ్చింది దమయంతి

"ఏమని దీవిస్తున్నారు మా తమ్ముణ్ణి!" అంటూ. " ఈ సినిమాలో తమ్ముడు, మరో సినిమాలో హీరో, ఇంక నాలుగేళ్ళుపోతే కొడుకు...." అంటూ కాస్త వ్యంగ్యంగా అనబోయేడు పి.ఏ.

దమయంతి ఆ మాటల్ని లెక్కపెట్ట లేదు.

" కూటికోసమే కోటి విద్యలూ ప్రసాద్‌గారు. ఈ లైట్లలో మొహాలకి రంగేసుకొని ఏదో వరుసతో నటించకపోతే సాయింత్రానికి థియేటర్ల దగ్గర క్యూలు కట్టే జనాన్ని ఎవరు సంతోష పెడతారు! ఈ బ్రతుకుతెరువులో తృప్తి, ఆనందం రెండూ వున్నాయి. మొహానికి రంగు లేకుండానే ఆత్మల్ని స్లీపింగ్ టాబ్లెట్స్ వేసి నిద్రపుచ్చి నాలుక చివర అబద్ధాల్ని సృష్టించి బ్రతికే వారి సంగతే సరిగ్గా ఎవరికీ తెలియదు!" అంది.

" అబ్బ! అబ్బ! ఈ పిల్ల స్టుడియోలో వాయి (నోరు) తగ్గించమంటే వినదుగదప్పా!. మనమో మాట అంటే గోడక్కొట్టిన రబ్బరు బంతి మాదిరి తిప్పి కొట్టందే తూకం (నిద్ర) రాదు" అన్నాడు. గణేశన్ నవ్వుతూ.

"పోనీలెండి. మనసులో ఒకటి బయటకి మరొకటి మాట్లాడకుండా నిష్కల్మషంగా బతికేస్తుంది!" అన్నాడు విజయేంద్ర ఆమెకి వత్తాసు పలుకుతున్నట్లుగా.

"మీరుదా సపోర్టు చేస్తే మరి ధనాధన్

**ఇంతవరకూ సాగినకథ:- 5** అనతికాలంలోనే బిజీ హీరో అయిన విజయేంద్ర కాల్‌షీట్లకోసం నిర్మాతలు పడిగాపులు కాస్తుంటారు. ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు అయిన తల్లి నిఖిలేశ్వరి తన కొడుకు విజయాలు చూసి మురిసి పోతుంటుంది. పోలీసు కమీషనర్ కూతురు పీయూషను ప్రేమిస్తున్నట్లు విజయేంద్ర తల్లికి చెప్తాడు. కాని తన కూతుర్ని మర్చిపొమ్మని ఆయన హెచ్చరిస్తాడు. కాంట్రాక్టరు గోపాలరావుతో వివాహమైన నిఖిల మనస్పర్ధలు వచ్చి భర్తతో విడిపోతుంది. తనతో హీరోయిన్ వేషం వేయాలనుకున్న దమయంతి విషయాన్ని గణేశన్‌తో చర్చిస్తానంటాడు విజయేంద్ర.

మనిపిస్తుంది. వాయితో వేషాలు పోగొట్టు కొంటోంది పొన్ను (పిల్ల)" అన్నాడు గణేశన్ తిరిగి.

"మీరు చెప్పండి. నేనేమన్నా తప్పు మాట్లాడేనా? నేను కానిమాటన్నట్లు దమయంతి నోరు చెడ్డది అనేస్తారు!" అంది దమయంతి బుంగమూతిపెట్టి.

జయలత వాళ్ళ మాటల్ని మౌనంగా నవ్వుతూ వింటోంది.

"ఆ పిల్లదా చూడు! ఎలా కూర్చుందో! అలా అరగంటదా కూర్చో. ఈ పిక్చర్‌మీద వచ్చే లాభమంతా ఇచ్చేస్తాను!" అన్నాడు గణేశన్ పందెం కాసినట్లుగా.

"నిజంగానా సర్!"

"రొంబ నిజం!"

"అయితే యిప్పుడే కూర్చుంటాను" అంటూ గబుక్కున కుర్చీలో కూర్చుంది దమయంతి.

"ఇప్పుడుదా కూర్చొని అసలు బొమ్మ పూడ్చునివ్వకపోతే లాభందా ఎట్లొస్తుంది. నీవుదా కూర్చుంటే కూర్చున్నావు విజయేంద్ర కాల్‌షీట్లు నాకు పూడ్చుకు!" అన్నాడు గణేశన్ కళ్లు గుండ్రంగా తిప్పుతూ.

అతని శరీర నిర్మాణం గమ్మత్తుగా వుంటుంది. పైనుండి నడుం వరకు లావుగా పొడవుగా వుండి, కాళ్ళూ చేతులు పొట్టిగా సన్నగావుంటాయి. దానికితోడు అతను లుంగీ మడచి కట్టి కాళ్ళూ చేతుల్ని వేగంగా కదుపుతూ నడుస్తూ వుంటే విచిత్రంగా ఒక తాబేలు లేచి నిలబడి వస్తున్నట్లనిపించి నవ్వు పుట్టుకువస్తుంది.

అతను అభినయం చేసినట్లు మాట్లాడుతుంటే కళ్ళు బొంగరాల్లా తిరుగుతాయి. మొహంలో సగ భాగం నొసలే వుంటుంది. దాన్ని విబూది రేఖలతో నింపుతాడాయన.

గణేశన్ మాటలకి క్లాప్‌బోయ్ దగ్గర్నుండీ అందరూ పడీపడీ నవ్వేరు.

ఇంతలో డైరెక్టర్ టేక్‌కి పిలవగానే అందరూ సీన్‌మీద దృష్టి కేంద్రీకరించేరు.

షూటింగ్ ముగియగానే మేకప్ తీసేస్తున్నాడు విజయేంద్ర.

"మే ఐ కమిన్?" అంది దమయంతి గుమ్మందగ్గరగా నిలబడి.

"బై ఆల్ మీన్స్!" అన్నాడు విజయేంద్ర అద్దంలోనుండే చూస్తూ.

దమయంతి గబగబా లోనికొచ్చి సోఫాలో కూర్చుంటూ "మీరు మేకప్ తుడిచేసుకొని వెళ్ళినా మిమ్మల్ని హీరో కాదని ఎవరూ అనరు. అదే నేను గనుక వెళ్తే సినిమా నటినని బడాయిలు చెబుతుంది. ఎక్కడికో వెళ్ళి



సాయంత్రానికొస్తుందని ఎగతాళి చేస్తారు." అంది.

"అదొకటా?" ఆశ్చర్యంగా అడిగేడు విజయేంద్ర.

"ఒకటేమిటి వంద! నాకు ఈ చెవి నుండి ఆ చెవికి డైరక్ట్ కనెక్షన్ వుందిలెండి! లేకపోతే వాళ్ళ మాటలు బ్రెయిన్‌కెక్కించు కుంటే బుర్ర చెడిపోయి వుండేది! మీరు మా యింటికి వచ్చి వెళ్ళేక ఆ జోరు తగ్గింది. అది సరే! తమరొకసారి మీ కుడి చెయ్యి యిటు పడేస్తే నేను ఇంటికి పోవాలి! బయట గణేశన్‌గారి కారు సిద్ధంగా వుంది!"

"సొంత కారు కొనలేదా అక్కయ్య గారూ!" అన్నాడు విజయేంద్ర సినిమా ఫక్కీలో నవ్వుతూ.

ఆ మాటకి ఆశ్చర్యపోతూ చూసింది దమయంతి.

ఆమె ఆశ్చర్యాన్ని ఇంకాస్త ఆశ్చర్యంగా చూస్తూ "ఏంటలా నోరు వెళ్ళబెట్టేసేరు? నేనేం కానిమాటన్నానా?" అన్నాడు.

"కాని మాట కాదు నా మనసులో ఉన్నమాట! ఈ రోజులో ఒక విశేషముంది. చెప్పకోండి చూద్దాం!" అంది.

"నాకు తెలియడంలేదు!" అన్నాడు విజయేంద్ర ఆలోచించకుండానే ఠక్కున.

"ఏమి, నువ్విదా ఇక్కడ మాట్లాడుతూ కూర్చున్నావు! హీరోయిన్ కారులో వుంది. రావా?" అంటూ వచ్చేరు గణేశన్.

"ఏం, లేదు. వచ్చేస్తున్నా!" అంటూ తన చేతిలో వున్న రాఖీని అతని చేతికి కడుతూ "ఈరోజు రాఖీ పౌర్ణమి " అంది. "ఈ చిత్రంలో మీకు అక్కగారిగా వేసేను. జీవితమంతా నాకు మీరు సోదర ప్రేమ పంచి ఇవ్వాలనే దురాశతో ఇంతకి తెగించేను. కాదనకండి! " అంది కొంచెం ఆవేశంగా దమయంతి.

## సూపర్ హీరో

"ఓహ్! పెరియ (పెద్ద) బహుమతి యివ్వాలి విజయేంద్రా నువ్వు!" అన్నాడు గణేశన్ నవ్వుతూ.

"అంటే?" అర్థం కానట్లు చూశాడు విజయేంద్ర.

"అంటే ఏముంది. చీర, జాకెట్ కొనుక్కోమని డబ్బులివ్వాలి! ఆడపడుచు కట్నందా చాల్లేదని ప్రతి సంవత్సరం అట్టముక్కొకటి చేతిక్కట్టి లంచాలుదా వసూలుచేస్తుండారీ పొన్నులు!" అన్నాడు చమత్కారంగా గణేశన్.

ఆ మాటకి దమయంతి కళ్ళలో నీళ్ళు చెమర్చేయి.

"మీరే విధంగా భావించినా ఫర్వాలేదు. నేను మాత్రం కానుకలకోసం కట్టలేదీ రాఖీని. మీలో నాన్నగారిని, విజయేంద్రలో సోదర వాత్సల్యాన్నీ చూసుకొంటున్నాను." అంది గద్గదంగా దమయంతి.

ఆమె మాటలకి చలించిపోయేడు విజయేంద్ర.

"అరె! మీరు గణేశన్‌గారి మాటల్ని సీరియస్‌గా తీసుకొన్నారా?" అన్నాడు విజయేంద్ర చేతికికట్టిన రాఖీని ప్రేమగా చూసుకొంటూ.

"అడడా అమ్మా దమయంతీ! నువ్విదా ధనాధన్ మనిపిస్తేనే బాగుంటుంది. ఏడిస్తివా చూడలేం. నువ్విదా అందర్నీ ఏడిపించాలి గాని, ఏడవకూడదు!" అన్నాడు గణేశన్.

"మీరు ప్రేమతో రాఖీ కట్టేరు. నేను కూడ ప్రేమగా ఇస్తున్నది తీసుకోవాలి!" అంటూ జేబులో చెయ్యి పెట్టి చేతికి వచ్చినంత తీసి ఇవ్వబోయేడు విజయేంద్ర.

"లెక్కచూశారా?"

"లేదు" అన్నాడు విజయేంద్ర.

"ఇవ్వడంలో మీకు లెక్కలేకపోవచ్చు. తీసుకోవడంలో నాకు లెక్కవుంది. ఒక రూపాయి యివ్వండి కట్నంగా చాలు!" అంది దమయంతి నిష్కర్షగా.

"ఈ పిల్లదా వైత్యకారి పొన్ను. సిరి వస్తుంటే మోకాలుదా అడ్డంపెడ్తారంటారు కాని ఈ పిల్ల వాయి అడ్డంపెట్టి పోగొట్టుకొంటుంది!" అన్నాడు నవ్వుతూ గణేశన్.

"నా దగ్గర రూపాయి లేదు" అన్నాడు విజయేంద్ర జేబు తడుంకొంటూ.

"నాదగ్గరదా వుంది" అంటూ గణేశన్ తీసి ఇచ్చేడు.

తన దగ్గర నూటపదిహేను తీసి ఆ రూపాయి కలిపి "శాస్త్ర ప్రకారం నూటపదహారు ఇస్తున్నాను అభిమానంగా. కాదనకండి" అన్నాడు విజయేంద్ర.

దమయంతి నవ్వుతూ పుచ్చుకొని "ఎప్పటికీ మీదగ్గర రూపాయి నోటు వుండకూడదని ఆశీర్వదిస్తున్నాను" అంది.

"అంటే? ఇది దీవెనా? శాపమా?" అన్నాడు గణేశన్ చమత్కారంగా.

"సెంట్‌పర్సెంట్ దీవెనే! అతని దగ్గర వేలు, వందలూ వుండాలి గాని రూపాయిలూ అర్ధరూపాయిలూ కాదని!" అంది దమయంతి.

ఆ మాటకి ఇద్దరూ నవ్వేరు.

విజయేంద్ర, దమయంతి, గణేశన్ నవ్వుకుంటూ రావడంచూసి కళ్ళలో కారం పడినట్లయింది పి.ఏ. ప్రసాద్‌కి.

* * *

ప్రొద్దుటే మేకప్ రూమ్‌లో మేకప్ చేయించుకొంటున్నాడు విజయేంద్ర.

బయట ఇంటి ఆవరణలో బస్సుల్లో వచ్చిన జనం యధావిధి అతన్ని చూడటానికి పడిగాపులు పడివున్నారు. రోజుకన్నా రెట్టింపువున్న ఆ జనాన్ని కంట్రోలు చెయ్యలేక అవస్థ పడుతున్నాడు గూర్ఖా.

"ఏం జనం! ఏం జనం! ఈ వారంలో రిలీజయిన పిక్చర్సన్నీ సక్సెస్ అవ్వడంతో మీ అభిమానులు రెట్టింపయిపోయేరు సర్!" అన్నాడు పి.ఏ. ప్రసాద్ హడావిడిగా లోనికొచ్చి.

"వాళ్ళనలా ఎండలో నిల్చోబెట్టకండి. అందులో ఆడవాళ్ళు, పిల్లలూ కూడ వున్నారు" అంది అప్పుడే పూజ ముగించి ప్రసాదం తీసుకొచ్చిన నిఖిలేశ్వరి.

"మీ మాట విని మొన్న అలానే రానిస్తే



# సూపర్ స్టార్



## అతి పేద కుటుంబం నుండి వచ్చి కోట్లకు పడగెత్తిన మైఖేల్ కేన్

ప్రపంచ ప్రఖ్యాత నటుడు మైఖేల్ కేన్ అతి పేద కుటుంబం నుంచి వచ్చినవాడు. సెట్లో ఎప్పుడూ సరదాగా వుంటాడని, పత్రికా విలేఖరులతో చక్కగా మాట్లాడతాడని ఎక్కువ తాగడని పేరు తెచ్చుకొన్నాడు. ప్రస్తుతం మైఖేల్ కేన్ వయస్సు 56 సంవత్సరాలు. ఆయనకున్న డిమాండ్ ఈనాటికీ తగ్గలేదు.

మైఖేల్ 1933లో జన్మించేడు. మైఖేల్ తండ్రి చేపలు పట్టే వారి వద్ద కూలీగా పనిచేసేవాడు. తల్లి నాలుగిళ్ళలో పనిచేసేది. కొడుకులో నటనపట్ల ఉన్న ఉత్సాహం గ్రహించి తల్లి తాను కూడబెట్టిన సొమ్ము కొడుకు కిచ్చి పంపించింది. అలా అతని నటనా జీవితం ప్రారంభమైంది. మారిస్ మైక్ తవైట్ గా వున్న తన పేరును వెండితెర కోసమై మైఖేల్ కేన్ గా మార్చుకున్నాడు. నాటి నుండి నేటి వరకు 62 చిత్రాల్లో నటించి ప్రపంచ ప్రఖ్యాత నటుల్లో ఒకడయ్యాడు.

మైఖేల్ కేన్ నటి పాట్రీసియా హైన్సను పెళ్లి చేసుకున్నప్పుడు కొత్త కళ్ళజోడు కొనుక్కోవడం కోసం డబ్బులేక చాల అవస్తపడ్డాడు. 1950-60 మధ్య కాలంలో కావలిసినన్ని అండర్ వేర్లు బనియన్లు కొనుక్కునే డబ్బు సంపాదించగలిగినందుకు కేన్ చాల ఆనందించేడు.

దమాన్ హూ వుడ్ బి కింగ్ చిత్రం కోసం 26 వారాలు ఫిలిప్పైన్ అడవుల్లో వున్న తర్వాత కేన్ ఆరోగ్యం దెబ్బ తింది. నిజంగా చచ్చిపోతానేమో అనుకొన్నాడు. ఆ చిత్రంఎందుకొప్పుకున్నానా అని బాధపడ్డకేన్ ఆ చిత్రం చూసిన తర్వాత 'నేను మరణించిన తర్వాత కూడ నిలిచి పోయే చిత్రం' అని అన్నాడు

అతి పేద కుటుంబం నుండి వచ్చిన మైఖేల్ కేన్ కోట్ల కొద్దీ డబ్బు సంపాదించేడు. ఒక స్టేజిలో ఆయన అమెరికాలో వున్నప్పుడు తన రాబడిలో 50 శాతం బేసిక్, 14 శాతం స్టేట్ 11 శాతం సిటీ (మొత్తం 75 శాతం) టాక్స్ చెల్లించేవాడు. టాక్స్ చెల్లించడానికి నాకెటువంటి బాధాలేదు. పైగా ఆనందంగా వుంది. ఎందుకంటే నేను చెల్లించిన పన్ను ఎంతో మంది పేదవారికి సహాయపడుతుంది. అయితే నేను సంపాదించిన దాన్లో ప్రభుత్వాని కన్నా నాకు ఎక్కువ చెందితే నాకు ఆనందంగా వుంటుంది. నేను సంపాదించిన 100 రూపాయల్లో 51 రూపాయలు నాకు 49 రూపాయలు ప్రభుత్వానికి చెందితే నేను సంతోషిస్తాను" అన్నాడు మైఖేల్ ఇటీవల ఒక ఇంటర్వ్యూలో.

ప్రపంచంలో కెల్లా ప్రతిష్టాత్మకమైన ఆస్కార్ ఎవార్డు కేన్ కి 'హెన్నా అండ్ హర్ సిస్టర్' చిత్రంలో లభించింది. ●

---

మొక్కల కుండీలన్నీ పగలగొట్టేసేరు. వరండా పేరాపెట్ వాల్ విరిగిపోయింది. ఆకులు, కొమ్మలు త్రుంచి పోసేరు. తిరిగి రిపేర్ కి పదివేలదాక అయ్యింది" అన్నాడు పి.ఏ.

"పోనివ్వండి. ఇదంతా వాళ్ల సొమ్మేగా!" అన్నాడు విజయేంద్ర.

"భలేవారు మీరు! ఆ మాట వాళ్లెదుట అంటే ఇప్పుడే పంపకాలు చెయ్యమనగలరు! మీరు ఎంత కష్టపడి నటిస్తున్నారు! మొన్న మీరు డూప్ లేకుండా ఫైట్ చేస్తుంటే తమ కాల్షీట్సు ఏమయిపోతాయో అని బెంగపడిపోయేరు మిగతా ప్రొడ్యూసర్లు." అన్నాడు ప్రసాద్ గొప్పగా.

"అవునవును. మనం వెళ్లేదార్లో ఒకడు కట్టెలు కొడ్తూ చాల కష్టపడుతుంటాడు. వాడికి పూటకి గడవదేం!" అన్నాడు విజయేంద్ర రెట్టిస్తూ.

సరిగ్గా అప్పుడే గూర్ఖా గుమ్మందగ్గరకివచ్చి "ఎవరో కరుణాకరట సాబ్! మిమ్మల్ని కలవాలని ఆగకుండా లోపలికి వచ్చేస్తున్నాడు" అన్నాడు.

"కరుణాకరా! ఆ! ఆ! రానివ్వకండి" అన్నాడు విజయేంద్ర ఉత్సాహంగా.

"కరుణాకర్ ఎవరు విజయ్!" అంది నిఖిలేశ్వరి.

"నీకు తెలియదమ్మా! అతను నా క్లాస్ మేట్! వాళ్లనాన్నగారు మంచి జ్యోతిష్యుడు. నేను పెద్ద స్థాయికి వెళ్తానని చెప్పేరొకసారి!" అన్నాడు విజయేంద్ర.

ఆ మాట పూర్తికాకుండానే కరుణాకర్ సుడిగాలిలా లొనికొచ్చేసి "హలో గుడ్ మార్నింగ్ బాస్! నువ్వింత హడావిడిగా అయిపోయేవనే నీ దగ్గరికి రాలేదు. నాన్నగారు బలవంతం చేసేక తప్పలేదు" అన్నాడు కళ్లెగరేసి నవ్వుతూ.

బేబిక్రాఫ్ లో చుట్టు అన్ని వేపులా కిందకు దువ్వుకొని గోల్డ్ రిమ్ కళ్లద్దాలు, పీచు మిఠాయిరంగు చొక్కా, నల్లప్యాంట్, మెడలో ఛెయిన్ - చూడగానే సదభిప్రాయంకల్గని తయారులో వున్నాడు కరుణాకర్.

నిఖిలేశ్వరి అతని వాటం నచ్చనట్లు లోనికి వెళ్లిపోబోతుంటే "నమస్కారం అమ్మగారూ! నా పేరు కరుణాకర్! వీడికి స్నేహితుణ్ణి. ఇద్దరం ఒక బెంచీలోనే కూర్చోక పోయినా ఒకే క్లాసులోనే తగలడ్డాం! కాలేజీ హీరోని నాటకాలాడ్డంలో. కాని వీడు - ఈ ఇడియట్ ఎప్పుడూ ఒక చిన్న గెస్ట్ రోల్ వేయని వెధవ పెద్ద హీరో అయిపోయేడు. అదే ఆశ్చర్యం!" అన్నాడు గబగబా.

అతని మాట తీరు ఏమాత్రం నచ్చకపోగా ఎంతో వెగటు కల్గించింది నిఖిలేశ్వరికి.

ఆమె అంటీముట్టనట్లు ప్రతి నమస్కారంచేసి లోనికి వెళ్లిపోయింది.

అతని మాటతీరు - తయారుకి అల వాటుపడిన విజయేంద్ర మాత్రం చిన్నగా నవ్వుతూ "నీలో ఏమాత్రం మార్పురాలేదు" అన్నాడు.

"అవును. అదే మా నాన్నగారి బాధ. ఆ విజయేంద్రకి ఎంత వినేయత! ఎంత వినయం! అంత పెద్ద హీరో అయినా పిస రంత గర్వంలేదని మా అమ్మగారితో చెప్పి ఒకటే పొగడ్తలు! వాళ్లకేం తెలుసు - అభి మానులకోసం మీరలా నటిస్తారని!"

"అయితే నాది నటనంటావ్!" అన్నాడు విజయేంద్ర.

"నటనకాకపోతే ఇప్పటివరకూ కూర్చో మన్నావా నన్ను!" భుజాలెగరేసి అడిగేడు కరుణాకర్.

"బెంచిమేట్‌వి కాకపోయినా క్లాస్ మేట్‌వి! అసలు నాటకాలాడ్డంరాని వాడు పెద్ద హీరో అవ్వడం ఏంటా అని వెధవ, ఇడియట్ అని చనువుగా తిట్టేవు! ఇంత చనువున్న నిన్ను కూర్చోమని వేరే చెప్పాలా!"

విజయేంద్ర జవాబు ఛెళ్లున తగినట్లు "అబ్బ! అబ్బ! నా మాటలతో నన్నే ఈడ్చి కొట్టేవు కదోయ్" అంటూ చటు క్కున కూర్చొని "ఇప్పుడు చెప్పు! నన్నొచ్చి అర్జెంటుగా కలవమన్నావట! నువ్వేరకమైన అభయమిచ్చినా పుచ్చుకునేందుకు మాత్రం సిద్ధంగా లేడీ కరుణాకర్" అన్నాడు గూళ్లె గరేసి నవ్వుతూ.

"సర్! టైమయింది!" అన్నాడు పి.ఏ. హెచ్చరిస్తున్నట్లుగా.

విజయేంద్ర వాచీవైపు చూసుకొని "నాతో స్టుడియోకి రా! అక్కడ మాట్లా డుకొందాం!" అన్నాడు.

"నీతో స్టుడియోకా! నా టైము వేస్ట

## సూపర్ హీరో

యిపోతుంది. ఆపైన ఆత్మహత్య చేసుకో వాలనిపిస్తుంది కూడ!"

విజయేంద్ర లేచి నిలబడి "ఎందుకని?" అన్నాడు.

"పద! స్టూడియోలోనే చెబుతాను. నీటైముకూడ ఎందుకు వేస్టు చెయ్యాలి!" అన్నాడు తనూ లేచి నిలబడుతూ.

ఇద్దరూ కారెక్కాగానే పి.ఏ ముందు సీట్లో కూర్చున్నాడు. కారు స్టార్ట్ కాగానే "ఈ రోజు సీనేమిటి పి.ఏ.గారూ!" అన్నాడు విజయేంద్ర.

"నీతాతో డాన్సు బిట్స్ కొన్ని మిగిలి పోయేయి. అవి తీస్తారట!"

"అబ్బా! ఈ రోజు నీతాని చూడొచ్చ న్నమాట! అదృష్టమంటే నీది గురూ! తంతే సినిమా స్టూడియోలో పడ్డావ్! మేం కలలు కనే అమ్మాయిలంతా నీ వళ్ళో వాలతారు!" అన్నాడు ఆనందంగా కరుణాకర్!

"మీరూహించుకొన్నంత అదృష్టమేమీ మాకు అనిపించదు. ఆ లైట్లలో ఉక్కలో టైట్ గార్‌మెంట్స్ వేసుకొని కట్ కట్‌కి మళ్ళీ రెడీ అవ్వడంలో బోల్డంత చిరాకుంది!" అన్నాడు విజయేంద్ర.

"దొరికిన అమృతం చేదేలే ఎవరికైనా!"

"అద్సరే ఏదో ఆత్మహత్యన్నావు, దేనికి?" అంటూ మాట మార్చేడు విజ యేంద్ర.

"ఏముంది అక్కడ నీకు జరిగే గౌరవం, హడావుడి చూస్తే నాకు చావబుద్ధికాదా? పైగా ఈలోపున నేనే ఉద్యోగం కోసమన్నా వెదుక్కోవడం వలన కాస్త టైమన్నా కలి

సొచ్చిన హేపీనెస్ వుంటుంది!" అన్నాడు కరుణాకర్.

బదులుగా విజయేంద్ర పెద్దగా నవ్వేసి "నీ మాటలు, చేష్టలూ ఏ మాత్రం మారలేదు. ఎవరు చేసే పని వారికి గౌరవమైంది. అంతగా ఆత్మన్యూనతా భావంతో కృంగిపోయి మనల్ని మనం కించపరచుకోకూడదు" అన్నాడు.

"అందలం మీద వున్న వాళ్ళు అలానే కబుర్లు చెబుతారు!" అన్నాడు కరుణాకర్.

సరిగ్గా అదే టైములో కారు స్టూడి యోలో ఆగింది.

విజయేంద్రతో పాటూ కరుణాకర్ కూడ లోనికి నడిచేడు.

అక్కడ క్లాప్‌బోయ్ నుండి నిర్మాత దాక విజయేంద్రకి నమస్కరించడం చూస్తుంటే కరుణాకర్‌కి అసంతృప్తి లాంటిది కల్గింది.

విజయేంద్ర సెట్‌లోకి నడవగానే తళుకు బెళుకు దుస్తులతో నీతా దేవకన్యలా మెరిసి పోతూ "నమస్కారమండీ!" అంది హొయ లుగా.

"నమస్తే. ఇతను నా స్నేహితుడు కరుణాకర్. మిమ్మల్ని చూడటమే అదృ ష్టంగా భావిస్తున్నాడు. కాస్త పలకరించండి!" అన్నాడు.

బదులుగా నీతా అందమైన పలువరుస కనిపించేలా నవ్వుతూ "అంత అదృష్టమేముం దండి! మేం మీలాంటి...." ఆమె మాట పూర్తికాకుండానే

"అలా కొట్టిపారెయ్యకండి. అదృష్టం కాకపోతే యావద్భారతీయ యువహృదయాల్లో నిద్రపోగలరా?" అన్నాడు కరుణాకర్ నాట కీయ ఫక్కీలో.

బదులుగా మళ్లీ పెద్దగా నవ్వింది నీతా.

"నవ్వకండి. షూటింగ్ ఆగిపోగలదు"

ఆమె ఠక్కున ఆపుజేసి "ఎందుకని?" అంది కాస్త జేవురించిన మొహంతో.

"అపార్థం చేసుకొన్నట్లున్నారు. మీరు నవ్వితే రాలిన పవరత్నాలు ఏరుకోవడం మొద లెడితే షూటింగ్ ఆగిపోకేం చేస్తుంది?" అన్నాడు కరుణాకర్.

"మీ స్నేహితుడు చాలా చమత్కారంగా మాట్లాడుతారు" అంది నీతా విజయేంద్ర కేసి చూస్తూ.

"అయితే షూటింగ్ మొదలయ్యే వరకు మీరు కాలక్షేపం చేయండి. నేను చంద్రకాంత్ గారితో మాట్లాడతాను" అంటూ అప్పుడే వచ్చిన చంద్రకాంత్ వైపుసాగిపోయేడు విజ యేంద్ర.

"నమస్కారం!" అన్నాడు చంద్రకాంత్.

"నమస్తే బాగున్నారా! రండి, కూర్చుందాం" అంటూ సెట్‌లో ఓ మూల వున్న కుర్చీలవైపు తీసుకెళ్ళేడు విజయేంద్ర.



ఇద్దరూ కూర్చున్నాక "నా సంగతేం చేసేరు?" అన్నాడు చంద్రకాంత్.

"నాతో మీరు ఆర్ట్‌ఫిల్మ్ తియ్యడానికి నాకేం అభ్యంతరం లేదు. డేట్స్ ఎడ్జస్టు చేస్తాను. కాని... ఓ చిన్న షరతు"

"చెప్పండి!"

"దమయంతికి ఒక కేరక్టర్ స్పేర్ చెయ్యండి. ఆమె మంచి నటి!"

"అంటే ధనాధన్ దమయంతేనా?" అడిగేడు చంద్రకాంత్.

"అవును. ఆమెతో గణేశన్‌గారి పిక్చర్లో నటించే అవకాశం వచ్చింది. సెకండ్సు మీద సోపళావార్ని మారుస్తూ ఒకేటేక్‌లో ఓ.కే చేయించే ఆమెని గ్లామర్ లేదని బుక్ చేయడం లేదు. ఇది అన్యాయమే కదా!"

"మీకు తెలుసుకదా, మాకు గ్లామర్‌తో పనిలేదని. ఆమెకి సరిపడే కేరక్టరు మా సినిమాలో వుంది. మీరు సమయానికి గుర్తు చేసేరు. ఎవర్ని ఎంపిక చేయాలా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు చంద్రకాంత్.

"థాంక్స్ ఏలాట్."

"దాన్దేముంది సర్! ఆ పాత్రకు ఎవర్నో ఒకర్ని బుక్‌చేయక తప్పదుగా. అదేదో మీరు చెప్పిన నటినే బుక్ చేస్తే ఫీజిబుల్‌గా కూడ వుంటుంది! మరి మాడేట్స్ సంగతి....! అంటూ సందేహంగా చూశాడు చంద్రకాంత్.

"నవంబర్‌లో ఎడ్జస్టు చేస్తాను. ష్యూర్!"

"అయితే ఎడ్వాన్సు...."

"ఇప్పుడేం వద్దులెండి. తర్వాత చూసు కొందాం"

"ఎడ్వాన్స్ తీసుకొంటే మాకు గ్యారంటీ వుంటుందని... ఎంతిమ్మంటారు?"

"మీరెంతిచ్చినా సరేనంటాను"

"అయితే ఈ పాతికవేలు..."

"ఎంతయినా ఫర్వాలేదన్నాను కద ండీ!" అన్నాడు విజయేంద్ర పి.ఏ.ని పిలుస్తూ.

పి. ఎ. దగ్గరగా వచ్చి "సర్ !" అన్నాడు.

"చంద్రకాంత్ గారు డబ్బు ఇస్తారు తీసు కుని నవంబర్‌లో డేట్స్ సర్దండి !" అన్నాడు విజయేంద్ర.

"కాని... సర్.. నవంబర్‌లో మూగాం బికా మూవీస్ వారి...."

"వారికి నేనింకా ప్రామిస్ చేయలేదు. నా టెర్మ్స్ అంగీకరించేకా ఆలోచిద్దాం !"

"తమరు టెర్మ్సు అంటే... వాళ్లసలు మీ రేటు ఎంత చెప్పినా..."

"పి. ఏ. గారూ ! టెర్మ్సు అంటే ఒక్క మనీయే కాదు."

పి. ఏ. వెంటనే చంద్రకాంత్ దగ్గర డబ్బు తీసుకున్నాడు.

"వస్తాను సర్! ఇంక మిగతా ఏర్పాట్లు చేసుకోవాలిగా !" అంటూ లేచి నిలబడ్డాడు చంద్రకాంత్.

"బెస్ట్ ఆఫ్ లక్ !"

"మీ రొప్పుకోవటమే పెద్ద లక్. నమస్తే !" అంటూ వెళ్లిపోయాడు చంద్రకాంత్

ఆ వెంటనే షూటింగ్ మొదలవటంతో సాయంత్రం వరకూ ఓపిగ్గా కూర్చున్నాడు కరుణాకర్.

విజయేంద్రతో భోజనం ముగించాడు.

సాయంత్రం తిరిగి ఇంటికి వస్తుంటే కార్లో అడిగేడు విజయేంద్ర.

"ఇంతకీ ఏంచేద్దామనుకొంటున్నావ్ ! నీకేదైనా ఉద్యోగం ఇప్పించమన్నారు మీ నాన్నగారు !" అని.

"నువ్వు ఏమిప్పించగలవ్ ! ఈ వెధవ శరీరం ఒకరిదగ్గర ఇమిడి పనిచెయ్యలేదు" అన్నాడు కరుణాకర్.

"మరి ?"

"నువ్వొప్పుకుంటే ప్రొడ్యూసర్‌ని అయి పోతాను."

"వ్వాట్ ?"

"కంగారు పడిపోకు, నాకో వీడియో స్టూడియో పెట్టుకోవాలనుంది. అంత సహాయం నువ్వు చెయ్యి అని అడగటానికి మనసొప్పటంలేదు."

"నీకందులో అనుభవం ఉందా ?"

"అనుభవానిదేముంది బాస్ ! ఆశ తీరే ఛాన్స్ వస్తే అనుభవం అదే పుట్టుకొస్తుంది."

"అయితే ఎంతవుతుంది ?"

"నువ్వొక లక్ష కొట్టిస్తానంటే మిగతాది అనెంప్లాయిడ్‌గా బ్యాంక్‌నుండి లోన్ తీసు కుంటాను."

"అమ్మకి చెప్పి..."

"ఆవిడ ఒప్పుకుంటారన్న ఆశలేదు" అంటూ పెదవి విరిచాడు కరుణాకర్.

"ఎందుకని ?" ఆశ్చర్యంగా అడిగేడు విజయేంద్ర.

"ఆవిడకి నా వాటం వచ్చినట్టుగా అని పించలేదు."

"అమ్మ తీరే అంత ! చాలా సీరియస్ !"

"అందుకే మరి అడిగితే పని కాదంటు న్నాను."

"అమ్మని అడగందే ఏదీ చెయ్యను."

"అయితే ఆశే నిరాశని పాడుకుం టాను."

నల్ల సూర్యుడు



అదిగో నల్ల సూర్యుడు
తెల్ల సముద్రంపైకి ప్రసరిస్తున్నాడు
ఆకలి కేకలతో పేరుకు పోయిన
శవాలపై వ్యాపారం చేసేవాళ్ళు
కళేబరాలు, కంకాళాలపై
రాజ్యం చేసే వాళ్ళతో పోరాడటానికి
నల్ల సూర్యుడు ఉదయిస్తున్నాడు
పిడికిలి బిగించి పోరాడుతుంటే
వేళ్ళు నరికి వేయబడ్డ
మండేలాలు, మొలాయిస్‌లు
ఇంకా గర్జిస్తూనే ఉన్నారు
తెల్ల చీకటిని ఛేదించడానికి
నల్ల సూర్యుడు ఉదయిస్తున్నాడు
కుచ్చితానికి కుతంత్రానికి ఒక సూర్యుడు బలైతే
వెయ్యి సూర్యులు ఉద్భవిస్తున్నారు
రేపటి తరానికి నలుపు ఆదర్శం
రేపటి చరిత్ర పుటల్లో
జయ చేతన సంకేతం
జన చేతన రణనినాదం
నల్ల సూర్యుడు సమరానికి పతాకం

—జాగృతీ కిరణ్

"మరీ అమ్మనలా తీసెయ్యకు. ఆమె అంత కఠినురాలు కాదు. రేపు ప్రొద్దుటే కనిపించు."

"ఎనిమిది గంటలకా !"

"ఆ సరిగ్గా !"

"సరే ఆశపడటానికి ఇంకా పద్నాలుగ్గం టలు టైమిచ్చేవన్నమాట ! ఇట్స్ గుడ్. వస్తాను. ఇక్కడ కారాపించు" అన్నాడు కరుణాకర్.

"బై !" అంటూ కారాగగానే దిగి చెయ్యి వూపేడు.

విజయేంద్ర కూడా చెయ్యి వూపేడు.

కారు కదిలిపోయింది ముందుకి వేగంగా.

(ఇంకా ఉంది)

# పరిశ్రమలకు వ్యవసాయం అన్న!

చదువుకునే రోజుల్లో ప్రతీ సంవత్సరం అత్యున్నత మార్కులతో ముందుండడమే కాకుండా విద్యార్థి సంఘాలలో కూడా ప్రముఖ పాత్ర వహిస్తుండేవారు శ్రీ ఎమ్. గోపాలకృష్ణ. ఎన్నో వ్యాసరచన పోటీల్లో, వక్తృత్వ పోటీల్లో బహుమతులు పొందిన ఈయన సైన్స్ కాలేజ్, యూనివర్సిటీ హాస్టల్స్ మాగజైన్స్‌కి కూడా ఎడిటర్‌గా వ్యవహరిస్తుండేవారు. మంచి స్పోర్ట్స్‌మనేకాదు గజ ఈతగాడు కూడా! అయ్యేయస్ ప్రొబేషనర్‌లకు జరిగిన 'లా' పరీక్షలో నూటికి నూరు మార్కులీ్న సంపాదించారు. 1962లో అయ్యేఎస్‌లో జాయిన్ అయ్యారు. ముందు అస్సాంలోను, ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ కేడర్‌లోను ఈయన రెండు రాష్ట్రాలలోనూ ఎన్నో ఉన్నత పదవుల బాధ్యతల్ని దిగ్విజయంగా నిర్వహించారు. ప్రస్తుతం గోదావరి ఫెర్టిలైజర్స్ అండ్ కెమికల్స్ లిమిటెడ్‌కి మే నేజింగ్ డైరెక్టర్‌గా వున్నారు. ఈ సంస్థ రూపుదిద్దుకోవడంలో కూడా ప్రముఖ పాత్ర వహించిన శ్రీ ఎమ్. గోపాలకృష్ణ ఇంతకు ముందు విశాఖ స్టీల్‌ప్లాంట్ కమీషనర్‌గాను, నాగార్జున ఫెర్టిలైజర్స్ అండ్ కెమికల్స్‌కి మే నేజింగ్ డైరెక్టర్‌గా పనిచేసి విశేషానుభవాన్ని గడించివున్నారు.



**మే నేజర్ ఆఫ్ ది ఇయర్**
**గోపాలకృష్ణగారితో యింటర్వ్యూ**

మనది ముఖ్యంగా వ్యవసాయ దేశం. పారిశ్రామిక ప్రగతితో పాటు వ్యవసాయ ప్రగతినీ సాధిస్తేనే మనదేశం సంపూర్ణ ప్రగతిని సాధించగలదు. ఈ రెంటినీ సాధించాలనే వుద్దేశంతో మన రాష్ట్రంలో వ్యవసాయదారులకు చేయూత నిచ్చే ఎరువుల కంపెనీని ప్రారంభించడానికి కావలసిన సాంకేతిక విజ్ఞానాన్ని ఆయన ఎన్నో దేశాలు తిరిగి సంపాదించారు. అందరి మన్ననలనూ పొందే రీతిలో గోదావరి ఫెర్టిలైజర్స్ బాధ్యతల్ని నిర్వహిస్తున్న శ్రీ ఎమ్. గోపాలకృష్ణకు 1988వ సంవత్సరానికి గాను హైదరాబాద్ మేనేజ్‌మెంట్ అసోసియేషన్ వారి ప్రతిష్ఠాకరమైన 'మేనేజర్ ఆఫ్ ది ఇయర్' అవార్డు లభించింది. గోదావరి ఫెర్టిలైజర్స్ మార్కెటింగ్‌లో సాధించిన విజయానికి 1989 మార్కెటింగ్ మాన్ ఆఫ్ ది ఇయర్ సిల్వర్ అవార్డుని పొందారు. ఈ సంవత్సరంలోనే ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎకనామిక్ స్టడీస్ వారి 'ఉద్యోగశ్రీ' అవార్డు వచ్చింది.

ఇన్ని పురస్కారాలని పొందుతున్న ఎమ్. గోపాలకృష్ణగార్ని ఇటీవల కలుసుకోవడం జరిగింది.

"గోపాలకృష్ణగారూ! మీరు ఈ ఎరువుల రంగంపైనే మీ దృష్టిని ఎక్కువగా కేంద్రీకరించడానికి కారణం ఏమిటి?"

"పారిశ్రామిక రంగంలో మనదేశం ముందడుగు వేస్తున్నట్టుగానే వ్యవసాయరంగంలో కూడా ముందడుగు వేయాలి. వ్యయం తగ్గించి ఫలసాయం పెంచాలి. సరయిన ఎరువులు, సరసమైన ధరల్లో అందరికీ అందేలా చేయాలనే వుద్దేశమే ఈ రంగంలో నేను విశేషకృషి సల్పేలా చేస్తోంది. మన రాష్ట్రానికి అవసరమయ్యే ఎరువులలో 30% మాత్రమే మన రాష్ట్రంలో తయారవుతున్నాయి. మిగతా 70% ఎరువుల్నీ ఇతర రాష్ట్రాల నుంచి, విదేశాలనుంచి దిగుమతి చేసుకుంటున్నాం. ఇలా కాకుండా మన రాష్ట్రానికి సరిపడా మొత్తం ఎరువులూ ఇక్కడే తయారయేలా చూడాలి. బాలన్స్‌డ్ ఫెర్టిలైజేషన్‌కి అవసరమయ్యే ఎరువుల్ని తయారు చేయాలి. ఈ వుద్దేశాలతో డై అమ్మోనియా పాస్ఫేట్ (డి. ఎ. పి.) ప్లాంట్ నిర్మాణానికి వుపక్రమించాను. అంటే... పైర్ల పెరుగుదలకు, పంట దిగుబడులకు నత్రజని, భాస్వరం చాలా అవసరం. నత్రజని పైర్లని ఏపుగా పెంచుతుంది. భాస్వరం వేళ్ళను వృద్ధి చేసి – గింజల తయారీకి తోడ్పడి అధిక దిగుబడులకు సహకరిస్తుంది. అందుకే గోదావరి ఎరువుల కర్మాగారం ద్వారా నత్రజని తక్కువ, భాస్వరం ఎక్కువ (18%, 46%) వున్న కాంప్లెక్స్ ఎరువుని తయారు చేస్తున్నాము" అన్నారు గోపాలకృష్ణ.

తర్వాత సంభాషణ ప్లాంట్ నిర్మాణం వైపు మళ్ళింది.

"మేము తక్కువ కాపిటల్‌తో ఎక్కువ టర్నోవర్ తీసుకు రావడానికి కృషి చేస్తున్నాము. 108 కోట్ల రూపాయల వ్యయంతో ప్రారంభమైన గోదావరి ఎరువుల కర్మాగారము 135 కోట్ల టర్నోవర్ ఎరువుల్ని వుత్పత్తి చేస్తోంది. ఇంటర్మీడియెట్ ప్రాడక్ట్స్‌ని అంటే అమ్మోనియా, పాస్ఫారిక్ యాసిడ్‌లను దిగుమతి చేసుకుని కాకినాడలోని పోర్ట్ దగ్గర వున్న మా ప్లాంట్‌లో డి. ఎ. పి. ఎరువుని తయారు చేస్తున్నాము. 300 యకరాలు ఇప్పుడున్న ప్లాంట్‌కి చాలు. కానీ 1000 యకరాల స్థలం తీసుకున్నాం. ముందు ముందు కర్మాగారాన్ని ఇంకా విస్తరింపజేయాలనే వుద్దేశంతోనే ఎక్కువ తీసుకున్నాము. మేము చేపట్టే కార్యక్రమాలన్నీ ముందు చూపుతోనే చేపడతాము. మేము

న్యూఢిల్లీలో జరిగిన "అఖిల భారత ధైర్య సాహసికుల" సదస్సు గోదావరి ఫెర్టిలైజర్స్ అండ్ కెమికల్ మేనేజింగ్ డైరెక్టరు శ్రీ ఎం. గోపాలకృష్ణ, ఐ.ఎ.ఎస్.కి "జెమ్ ఆఫ్ ఇండియా" అవార్డు బహూకరించింది. ఎరువుల పరిశ్రమలో ఆయన చేసిన కృషికి గుర్తింపుగా ఈ అవార్డు లభించింది. శ్రీ ఎం. అరుణాచలం బహుమతి ప్రదానం చేశారు.



రూపొందించిన పథకాల్ని ఆచరణలో సక్రమంగా పెట్టడంతో నే సంతృప్తి చెంది వూరుకోము. ఇంకా ఇంకా ప్లాన్స్ రూపొందిస్తూ, వాటిని క్షుణ్ణంగా పరిశీలిస్తూ వుంటాం. ప్లానింగ్, ఇంప్లిమెంటేషన్– ఎవరి పనుల్లో వాళ్ళు ఎప్పుడూ బిజీగా వుంటారు. ఒక పనయిపోగానే మరో పనిని చేపడుతూ వుంటాం. మనదేశంలో కన్నా విదేశాలలో పాస్ఫారిక్ యాసిడ్ తయారు చేసి, దిగుమతి చేసుకోవడం చౌక. అందుకని జోర్డాన్ లేక యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్‌లో పాస్ఫారిక్ యాసిడ్ ప్లాంట్‌ని పెట్టాలనుకుంటున్నాం. కేవలం మా ఫ్యాక్టరీ అవసరానికే గాక మిగతా వాళ్ళకి అమ్మోనియాను సరఫరా చేయగలిగేటట్లు అమ్మోనియా యూరియా ప్లాంట్‌ని ప్రారంభించాలనుకుంటున్నాం. ఎతిలిన్ దిగుమతి చేసుకుని అగ్రికల్చర్ పరికరాల్ని తయారు చేయాలనుకుంటున్నాం. పంటలకి పట్టే పురుగుల నివారణకి తోడ్పడే మందుల్నీ తయారు చేయాలనే ఆలోచన వుంది. మనరాష్ట్రంలో వ్యవసాయాభివృద్ధికి తోడ్పడే విధంగా సర్వతోముఖంగా గోదావరి ఎరువుల కర్మాగారాన్ని అభివృద్ధి పరచాలనుకుంటున్నాం. మేము వ్యవసాయదారుల దృష్టితో సంపూర్ణంగా పరిశీలించే ఏ పనినయినా చేపడతాం. వాళ్ళకి వుపయోగ పడతాయనుకున్న పనులన్నింటినీ మేము తప్పక చేపడతాం. రైతు శ్రేయస్సే మా ఏకైకాశయం.

## 'హెన్నా' వివాద మవుతుందా?

పాకిస్తానీ చిత్రం 'లాఖోం మే ఏక్' చిత్రాన్ని రాజ్‌కపూర్ సోదరులు ఆర్. కె. ఫిలిమ్స్ బ్యానర్ క్రింద 'హెన్నా' చిత్రంగా రీమేక్ చేశారు. అసలు కథలో హిందూ బాలిక ముస్లిం బాలుడ్ని ప్రేమించటం, ఆ బాలిక మరణంతో వారి ప్రేమ విఫలం కావటం. కాని 'హెన్నా'లో ముస్లిం బాలిక, హిందూ బాలుడ్ని ప్రేమించటం చివరికి విషాదంగా ముగియటమట. గతంలో 'సంగం' చిత్రం అసలు కథా రచయిత కోర్టుకు వెళితే రాజ్‌కపూర్ కోర్టు వెలుపలే ఆ వ్యవహారాన్ని పరిష్కరించుకున్నాడు. మరిప్పుడు ఈ చిత్రం ఏదైనా వివాదాన్ని తేస్తే కపూర్ సోదరులు ఎలా పరిష్కరిస్తారన్నదే సమస్యట.

అందుకని రైతు తనకు కావలసిన రకరకాల ఎరువుల కోసం వివిధ షాపుల చుట్టూ తిరగకుండా, అతనికి కావలసిన అన్ని ఎరువుల్నీ (మేము తయారు చేసేవే కావు అన్ని) గోదావరి ఎరువుల్ని అమ్మే డీలర్ షాప్‌లో దొరికేట్టు చూస్తున్నాము."

"పారిశ్రామిక ప్రగతిని సాధిస్తున్న అనేక ప్రాంతాలలో కాలుష్యం బెడద పెరిగిపోతోంది... కాకినాడలో మీ ప్లాంట్ కాలుష్య నివారణకి చేపడుతున్న కార్యక్రమాల్ని వివరిస్తారా?"

"మా కర్మాగారం నుంచి ద్రవ రూపంలో ఎటువంటి కాలుష్యం వెలువడదు. ఉపయోగించే పదార్థాల్ని "రీసైకిల్" చేసి సంపూర్ణంగా వాడతాం. అందుకని వేస్టేజ్ ప్రసక్తే వుండదు. వాయు రూపంలో బయటికొచ్చే అమ్మోనియాని ట్రీట్ చెయ్యడానికి 3.5 కోట్ల రూపాయల ఎఫ్లుమెంట్ ట్రీట్‌మెంట్ ప్లాంట్ వుంది. మిగిలిన వాయువుల్ని కూడా గొట్టాల ద్వారా చాలా ఎత్తుకు తీసుకు వెళ్ళి అక్కడ వాతావరణంలో కలుపుతాం. కాబట్టి గోదావరి కర్మాగారం ద్వారా ఎటువంటి కాలుష్యం కలుగదు. ప్రజల శ్రేయస్సుకి మేము ఈ కర్మాగారాన్ని చేపట్టాం. ప్రజల శ్రేయస్సు మాకు ముఖ్యం. కాబట్టి పొరబాటున కూడా కాలుష్య ఛాయలు పడకుండా ఎంతో జాగ్రత్త తీసుకుంటున్నాము. ఎన్నో మొక్కల్ని పెంచి 'గ్రీన్ బెల్ట్' ద్వారా ఫ్యాక్టరీ చుట్టూ ఆహ్లాదకరమైన వాతావరణాన్ని సృష్టించాము" అన్నారు శ్రీ గోపాలకృష్ణ.

–వేదగిరి రాంబాబు

# సీరియల్
# శత్రుసంహారం
## లల్లాదేవి

(గత సంచిక తరువాయి)

**ఇంతవరకూ సాగినకథ:- 24** వైమానిక దళపైలెట్ రాహుల్ తన తల్లి, భార్య కారు ప్రమాదంలో మరణించటానికి సంబంధించిన వివరాలు సేకరించే సందర్భంగా దుండగులను ఎదుర్కోవలసి వస్తుంది. దుండగుల చేతి నుంచి కూతురు సుషమ్మను కాపాడుకొని ఒక అనాథాశ్రమంలో చేరుస్తాడు రాహుల్. కారవెల్లి విమాన ప్రమాదానికి సంబంధించిన క్రూబాక్స్‌లోని ఇండికేటర్ కోసం అలయన్స్ సంస్థ అధినేత దేవిప్రసాద్ మనుషులు వెతుకుతుంటారు. ఇబ్రహీం ఉంపుడుకత్తె కనకదుర్గ సుషమ్మను పెంచుకుంటున్న వాళ్ళయింట్లో పనిమనిషిగా చేరి పాపను ఎత్తుకు వెళ్తుంది. దేవిప్రసాద్ ఆయుధ కర్మాగారాన్ని చెన్నుడు, పీయూష సాయంతో రాహుల్ ధ్వంసం చేస్తాడు.

తెలతెలవారుతూ ఉండగా కళ్ళు తెరిచింది పాప! గుండెల కానించి పెట్టుకున్న మిక్కీమౌస్‌ని ప్రక్క మీద ప్రక్కనే ఉంచుకుంది.

పైన తిరుగుతున్న సీలింగ్ ఫ్యాన్ కన్పించింది. ఆ పరిసరాలు క్రొత్తగా అనిపించాయి. ఒకసారి తలత్రిప్పి చుట్టూ చూచింది.

ప్రక్కనే అద మరిచి నిద్రపోతోంది దుర్గ!

ఆ రాత్రి తిరిగి యింటికి వెళ్ళి పోతానుకున్న పాపకి నిరాశ ఎదురు అయింది. తిరిగి వచ్చింది యింటికి కాదని అర్థం చేసుకుంది.

"ఆంటీ! ఆంటీ! నిద్రలేవండి త్వరగా! యింటికి వెళ్ళిపోదాం" అంది. కదిపి చూచింది. కాని రాత్రి మనస్సు నంచలింపచేసిన ఆలోచనల తాకిడికి తట్టుకోలేక పీకల దాకా తాగిపడుకుంది దుర్గ! పసిపాప పిలుపుని ఆమె అందుకోలేదు. ఆ లేత చేతుల పలకరింపుకి చైతన్యం కలగలేదు. మరో వైపుకి తిరిగి పడుకుంది.

పాపాయి మిక్కీమౌస్‌ని గట్టిగా గుండెల కానించుకుని మంచం దిగింది. వాకిలి వరకూ వచ్చింది. హేండిల్ పట్టుకుని గట్టిగా త్రిప్పింది. డోర్ తెరుచుకోలేదు. లాక్ చేసిఉంది.

పాపకి ఏడుపు వచ్చింది. ఏంచేయాలో తెలియలేదు. మళ్ళీ తిరిగి వచ్చి దుర్గని కదిపింది కాని ఆమెకు తెలివిరాలేదు.

పాపాయి దిక్కు ముఖం వేసుకుని కూర్చుంది.

"ట్రింగ్....ట్రింగ్...."మంటూ టెలిఫోన్ రింగ్ అవుతోంది. వెళ్ళి మోల్డా మీద నిలబడి టేబిల్ మీదినించి రిసీవర్ అందుకుంది.

"గుడ్ మార్నింగ్! రిసెప్షన్! ఆరున్నర గంటలకు రింగ్ యివ్వమన్నారు. థాంక్యూ" అని విన్పించింది రిసీవర్‌లో!

"అంకుల్ మీరెవరు?" అంది పాప!

"నేను రిసెప్షనిస్ట్‌ని పాపా! పెద్ద వాళ్ళని రమ్మను"

"ఆంటీ నిద్రపోతోందిగా!"

"ఆరున్నరకు నిద్రలేపమని చెప్పారు. నిద్రలేపమ్మా!"

"పిలిచాను అంకుల్. పలకలేదు"

"అయితే రిసీవర్ పెట్టెయ్యి. రింగ్ యిస్తాను. చాలసేపు రింగ్ యిస్తే వారే లేస్తారు" నవ్వుతూ సలహా అందించాడు రిసెప్షనిస్ట్.

"టెలిఫోన్ క్రింద పెట్టెయ్యమంటారా అంకుల్?"

"అవునమ్మా! క్రిందపెట్టండే రింగ్ మోగదు" ఆ ముద్దుమాటలకు ముచ్చట పడిపోతూ చెప్పాడు.

పాప రిసీవర్ క్రిందపెట్టింది. క్రెడిల్ మీద పెట్టలేదు. ప్రక్కనే టేబిల్ మీద ఉంచింది. అది మళ్ళీ ఎప్పుడు మోగుతుందా అని ఎదురుచూస్తూ దాని ఎదురుగా నిలబడింది.

కాని అది మోగలేదు. మళ్లీ రింగ్ యివ్వాలని ఆశించిన రిసెప్షనిస్ట్ ఎంతసేపటికీ రిసీవర్ క్రెడిల్ కాక పోవటంతో కలవరపడిపోయాడు. ఆ గదిలో జరిగిందేమిటో అతనికి అర్థం కాలేదు. అయోమయంగా బుర్రగోక్కోవటం ప్రారంభించాడు.

చాలా సేపు ఎదురు చూచినా రింగ్ రాకపోవటంతో అతను తన గురించి మర్చిపోయాడనుకుంది పాప!

"అంకుల్ రింగ్ యిస్తానన్నారు. కాని యివ్వలేదు. అంకుల్ మంచివాడు కాదు." అనుకుంటూ గది అంతా కలయ తిరిగింది. తిరిగి మంచం దగ్గరకు వచ్చింది. దుర్గని పిలిచింది.

కాని ఆమె ఈ లోకంలోకి రాలేదు నిద్రావస్థ వదిలి! గట్టిగా పిలవటంతో బద్ధకంగా మరో వైపుకి తిరిగిపడుకుంది.

అప్పుడు దిండు క్రింద ఉన్న వాకిలి తాళాలు సుషమ్మకి కన్పించాయి. అలాంటి తాళపు చెవిని తలుపుకి అమర్చిన తాళంలో దూర్చి త్రిప్పితే తలుపులు తెరుచుకుంటాయి. యింటి దగ్గర తన్వి ఆంటీ అలా చేయటం ఎన్నో సార్లు చూచింది సుషమ్మ.

వెంటనే తాళాన్ని అందుకుని తలుపుకున్న లాక్ తెరిచింది. క్లిక్‌మంటూ తలుపులు తెరుచుకున్నాయి. పట్టరాని సంతోషంతో విజయాన్ని సాధించినందుకు మిక్కీమౌస్‌ని ముద్దు పెట్టుకుని కారిడార్‌లో నడవటం ప్రారంభించింది సుషమ్మ!

అదొక స్టార్ హోటల్! భద్రతకోసం

అర్ధరాత్రి ఆ యింటి నించి బయటపడి రూంకి తీసుకువచ్చింది దుర్గ. మనస్సుని తినివేసే ఆలోచనలు భరించలేక తాగిపడుకుంది.

ముందుగా లేచిన పాప తండ్రిని చేరు కోలేకపోయానన్నా నిరాశతో తోచిన పనులు చేయటం ప్రారంభించింది.

కారిడార్‌లో కొద్ది దూరం నడిచి ఒక చోటన ఆగిపోయింది. అదంతా విచిత్రంగా కన్పిస్తోంది. చుట్టూ ఉన్న ప్రపంచమే కదా పసిపాపలకు పరమ అద్భుతయిన అనుభవం.

ఒక వాకిలి మీద అంకెలు వెలుగుతూ ఆరిపోతు ఉన్నాయి. లిఫ్ట్ వాకిలి ముందు అలాగే నిలబడి మారుతూ వెలుగుతున్న అంకెలని 'జి' అనే అక్షరాన్ని తమాషాగా చూస్తోంది.

కాస్సేపయాక ఆమె ముందున్న కటక టాల తలుపు దానంతట అదే తెరుచుకుంది.

ఆశ్చర్యంగా చూస్తుండగానే మరో తలుపు తెరుచుకుని లోపల నించి మనుషులు వచ్చే స్తున్నారు.

వాళ్ళు ఎక్కడనించి వచ్చారు? ఎలా వచ్చారు? పాప అద్భుతంగా చూస్తోంది. అందరూ దిగి ఎవరి గదుల్లోకి వారు వెళ్ళి పోయారు. ఒంటరిగా పాప, ఎదురుగా లిఫ్ట్ బాయ్ మిగిలిపోయారు.

పాప తాలూకు పెద్దవాళ్ళు ఎవరయినా వస్తారని కొద్ది క్షణాలు ఎదురు చూచాడు లిఫ్ట్‌బాయ్. ఎవరూ రాలేదు. పాప కదల లేదు.



"పాపా! గ్రౌండుకు వస్తావా?"

"అంకుల్! నన్ను మా డాడీ దగ్గరకు తీసుకుపోతారా?"

"మీ డాడీ ఏ ఫ్లోర్‌లో ఉన్నారు పాపా?" ముద్దుగా అడిగాడు.

"ఎక్కడున్నారో కన్పించలేదు. నన్ను తీసుకోపోతారా అంకుల్?" ముద్దు మాటలు విని లిఫ్ట్ బాయ్‌కి జాలివేసింది. ముద్దులు మూటగట్టే ఇలాంటి పాపల్ని కూడ వొదిలేసి భార్యలతో కులికే వాళ్ళని చితకదన్నాలి అను కుంటూ పాపని లిఫ్ట్‌లో ఎక్కించుకున్నాడు.

గ్రౌండ్‌కి వచ్చాక హాలులోకి చూచాడు. ఎవరూ లేరు.

"ఎక్కడున్నారమ్మా మీ డాడీ?" అని అడిగాడు.

"ఆ కారులో కూర్చున్నారేమో చూచి వస్తాను" అంటూ ముందుకు సాగింది. లిఫ్ట్ బాయ్‌కి కారులో ఉన్న వ్యక్తి ఆమె తండ్రి అయి వుంటాడని చూచి గుర్తించి వెళ్ళిపో తోందని అనిపించింది.

తిరిగి తన పనిలో నిమగ్నమయ్యాడు.




పాప వెళ్ళే సరికి కారు బయలుదేరి వెళ్ళి పోయింది. రోడ్డు మీద చాల మంది జనసం దోహం హడావుడిగా నడుస్తున్నారు. వారిలో పపా కన్పిస్తారనే ఆశతో ఆ వైపుకు సాగింది.

కన్పించిన ప్రతివారిని చేయి పుచ్చుకుని నిలబెట్టి బ్రతిమాలుతోంది.

"నన్నూ మా పపా దగ్గరకు తీసుకుపో తారా అంకుల్? ఆంటీ?"

బంధుత్వాల సంకుచిత పరిధుల చట్రాల్లో బంధించబడని పాపాయికి అందరూ అంకు ల్‌లాగా ఆంటీలాగ అన్పిస్తున్నారు.

కొందరు విదిలించి కొడుతున్నారు. మరి కొందరు చీదరించుకుంటున్నారు. ఇంకొం దరు జాలిచూపుతున్నారు. కాని పాపాయి మాటల్ని పట్టించుకునేందుకు ఎవరూ ముందు కురాలేదు. దుర్గ తనగదిలో ఇంకా నిద్ర పోతోంది. జీవితంలో వెలితిని విషాదాన్ని గుర్తుకు తెచ్చింది పాప! ఆదమర్చిపోయేం దుకు దుర్గ ఫూటుగా తాగి పడుకుంది. ఒంటిమీద తెలివిలేదు.

ఒక వంక టెలిఫోన్ పరిస్థితి ఏమిటో ఆ గదిలో జరుగుతున్నదేమిటో అర్థం కాక రిసెప్షనిస్ట్ గగ్గోలు పడిపోయాడు. ప్రక్కనుంచి రిసీవరు ఎంతకు క్రెడిల్ మీదికి రాదు. రింగ్ అవదు.

అంతకు ముందు మాట్లాడిన పాప అయినా తిరిగి అందుకోదు. ఆ గదిలో ఏదైనా గందరగోళం జరుగుతూ ఉండవ చ్చని ఊహించాడు. ఫ్లోర్ ఇన్‌ఛార్జికి రింగ్ యిచ్చి రూంనంబర్ చెప్పాడు.

పరిస్థితి అంతా వివరించి తెలుసుకోమని వార్త అందించాడు. అతను వచ్చి చూస్తే తలుపులు తెరచిఉన్నాయి. లోపల ఒక యువతి చాల ఘోరమయిన నిద్రావస్థలో మునిగిపో

## శత్రుసంహారం

యివుంది.

లోపల పాపాయి అంటూ ఎవరూ కన్పిం చలేదు. రిసీవర్ క్రెడిల్ మీదినించి దింపి ప్రక్కన పెట్టి ఉంది. ఏదో అవాంఛితం జరిగే ఉంటుందని అతనికి అన్పించింది.

రిసీవర్ అందుకుని హలో అన్నాడు. రిసె ప్షనిస్ట్‌తో మాట్లాడిన తరువాత పరిస్థితి అర్థ మయింది. రిసీవర్ క్రెడిల్ చేశాడు.

వరుసగా రింగ్ అవుతోంది. అతను నీళ్ళు తెచ్చి దుర్గ ముఖం మీద చిలకరించాడు. కదిలిందామె. కన్నులు విప్పి చూచింది. తలు పులు బిగించి ఉండాల్సిన ఆ గదిలో పాపలే కుండా ఓ అగంతకుడి ముఖం కన్పించేసరికి త్రుళ్ళి పడి లేచి కూర్చుంది దుర్గ!

"ఎవరునువ్వు?"

"ఫ్లోర్ యిన్‌ఛార్జిని మేడమ్"

"పాప ఎక్కడ?"

"తలుపులు తెరిచి అలా నిద్రపోతే దొంగ తనాలు జరుగుతాయి మేడమ్"

"నోర్ముయ్. పాప ఎక్కడుంది?"

"మాకేం తెలుసు మేడమ్! తలుపులు తెరిచి ఉన్నాయి. రింగ్ యిస్తే ఎవరూ పలకలేదు. అందుకే నేను వచ్చాను" ఈ సమాధానం విని కనకదుర్గ నవనాడులు కృంగి పోయాయి. భూమిలోకి దిగిపోతున్నట్లనిపిం చింది. ముందు బాత్‌రూంలో చూచివ చ్చింది.

ఆ తరువాత కారిడార్‌లోకి పరుగులు తీసింది. పిచ్చిపట్టిన దాన్లా కన్పించిన వారం దరిని అడుగుతోంది "పాప కన్పించిందా?"

అందరూ ఎగతాళిగా చూడటం మొద లెట్టారు.

"పాపకన్పించిందా?" లిఫ్ట్‌బాయ్ అగాడు.

"ఎవరు? ఎర్రగా బొద్దుగా ఉంది ఆ పాపే కదా?"

"అవును. నువ్వు చూచావా?"

"గ్రౌండ్‌లో పపా వున్నారని చెప్తుంది తీసుకుపోయాను"

"యూ ఫూల్! పద క్రిందికి" లిఫ్ట్‌లో క్రిందికి వచ్చారు. హోలులో పాప జాడ కన్పించలేదు. దుర్గ హతాశురాలయింది.

"పాపని చూచావా? నీకు కన్పిం చిందా?"

"ఇప్పుడే కద అమ్మగారూ రోడ్డు మీదికి వెళ్ళింది" అంటూ వార్త అందించాడు దరా వన్. దుర్గ రోడ్డు మీదికి పరుగుతీసింది. జనం! జనం!!

వాహనాలు వరుసలు తీరిపోతున్నాయి. ఈ వైపునించి ఆ వైపుకి వెళ్ళే అవకాశం లేదు. పిచ్చెక్కిన దాన్లా పరుగులు తీసింది. అరగంట వెతికిన తరువాత అదృష్టం పండి పాప కన్పించింది.

కాని అవతలవైపు పేవ్‌మెంట్ మీద క్రిక్కిరిసిన జనసందోహం మధ్య ఉంది. ఎలా అందుకోవాలి. రోడ్డు దాటటం అసాధ్యమే! మళ్ళీ సిగ్నల్ యిచ్చే సమయం కోసం ఎదు రుచూస్తోంది.

వాహనాలు నిలిచిపోతే వాటి మధ్యగా అయినా పరుగెత్తవచ్చు. పాప వంక రెప్ప వేయక చూస్తోంది.

ప్రతి ఒక్కరిని చేయిపట్టి ఆపాలని ప్రయ త్నిస్తోంది పాప! పపా దగ్గరకు తీసుకుపోరా అని అడుగుతోంది. ఎవరి హడావుడిలో వారు న్నారు. ఎవరు పట్టించుకుంటారు. విదిలించి కొడుతున్నారు.

పాప ఏడుపు ప్రారంభించింది.

దుర్గ ఇంక ఉండబట్టలేక గొంతు చిరి గిపోయేలా విహ్వలంగా అరిచింది.

"పాపా! అక్కడే ఉండమ్మా! నేను వొస్తున్నా!"

ఆ పిలుపుని అందుకున్న పాప అలాగే నిలిచిపోయింది. రెండు క్షణాల తరువాత దుర్గని గుర్తించింది. తిరిగి ఆ యింటికి తీసుకుపోతుందనే భయంతో పరుగు తీయటం ప్రారంభించింది పాప!

సిగ్నల్ ఎర్రలైటు పడింది. కార్లన్నీ నిలి చిపోయాయి. వాటి మధ్యగా రోడ్డుకి అడ్డం పడి పరుగు తీస్తోంది దుర్గ! ఆమె దగ్గర అవుతున్న కొద్దీ పాపలో భయం మరింత అయింది. జనం మధ్య ఏడుస్తూ పరుగు తీసింది.

అడుగడుగునా అడ్డు వస్తున్న మను

షల్నించి తప్పుకునేందుకు రోడ్డు మీదికి వచ్చింది. కార్లు మధ్యనించి తప్పుకుపోతోంది. గ్రీన్ లైట్స్ యిచ్చారు. కార్లు కదిలాయి. కాని ఈ ప్రపంచం తాలూకు నియమ నిబంధనలు నేర్చుకోని పాప రోడ్డు మీదే ఉంది.

ఒక కారు వేగంగా ఆమె వైపు వస్తోంది. ధీ౦లు! భయం! మమ్మీ, గ్రానీ కారు యాక్సి ౦ంట్‌లో రక్తపు మడుగులో పడిపోవటం, పిలిచినా పలకకుండా ఉండిపోవటం అంతా జ్ఞాపకం వచ్చింది.

"అంకుల్! కారు ఆపండి. నేను చచ్చిపోతాను. మమ్మీ నీలాగ నేను కూడ చచ్చిపోతాను. పపా దిగులు పడతారు! ఏడుస్తారు. కారు ఆపండి అంకుల్!" అంటూ మీదికి వచ్చే కారుకి రెండు చేతులు అడ్డుపెట్టింది. కాని అప్పటికే సమయం మించిపోయింది.

బ్రేకులు వేసినా ఆగకుండా వచ్చింది కారు. పాప లేత శరీరాన్ని విసురుగా తాకింది. దూరంగా ఎగిరి వెళ్ళి పడిపోయింది సుషమ్న!

"పపా! నేను చచ్చిపోతున్నాను. వచ్చి చూడరూ?" అని గొంతులోని లేతచర్మం చిట్లిపోయేలా అరిచింద.

అప్పటికి ఆ చోటుకి చేరుకున్న దుర్గ కొయ్యబొమ్మలా అయింది.

* * * *

"బాబూ! నా కర్తవ్యాన్ని నిర్వహించటంలో మొట్టమొదటి సారి విఫలమయ్యాను. అందుకే నా బాధ్యతల నించి తప్పుకుంటున్నాను. వయస్సుమీరిన తరువాత ఈ బాధ్యతలు చూడాలనుకోవటం దురాశ!

పోలీసు రిపోర్టు యివ్వటం తప్ప ఇప్పుడు నేను చేయగలిగింది ఏమీ లేదు" అంటూ తుదిసారిగా ప్రకటించింది యశోదమ్మ.

"పాప విషయం దారుణమే అయినా ఆ విషయం నేను చూచుకుంటాను. పోలీసు రిపోర్టు మాత్రం యివ్వకండి" అన్నాడు రాహుల్. వెంటనే అక్కడనించి తిరుగు ముఖం పట్టారు.

ఇక తుది పోరాటం ఆరంభించక తప్పదని భావించాడు. వెనక ముందు ఆలోచించకుండా 'ఇబ్రహీం సందు'కు వచ్చాడు. ఇబ్రహీం త్రాగిపడున్నాడని ఎవరికీ తెలియదు.

అతని గురించి కూపీ లాగాలంటే కనకదుర్గని ఆశ్రయించటమే దారి!

పీయూష, చెన్నుడు వీరిద్దరిని వీధిమలుపులో వొదిలేసి వంటరిగా ముందుకు సాగిపోయాడు.

మంచి స్వాగతమే లభించింది. 'కనకదుర్గ కావాలి' అన్నాడు.

"అది యీ యిల్లు వదిలి ఇరవైనాలుగు గంటలు దాటిపోయింది బాబూ! ఎప్పుడొస్తుందో తెలియదు. వేరే మనిషిని ఏర్పాటు చేస్తాను' అంది హౌస్ ఇన్‌ఛార్జి జర్దాకిల్లీ నములుతూ!

"ఎక్కడకు పోయిందో తెలుసా?"

"ఇబ్రహీం ఎక్కడికో పంపి ఉంటాడు. అతని అనుమతి లేకుండా ఎవరూ ఈ వీధి మలుపుదాటి పోలేరు" అందామె.

వెంటనే అతనికి స్ఫురించింది. తాను సాధించలేని పనికోస౼ కనకదుర్గని పంపి ఉంటాడు ఇబ్రహీం!

రాహుల్ వచ్చేంత వరకూ కాలక్షేపం కోసమని స్థానిక దినపత్రిక సాయంత్రం ఎడిషన్ ఒకటి తీసుకున్నాడు చెన్నుడు. పేపరు కుర్రాడు డబ్బులు అడుగుతున్నాడు.

అప్పుడు గుర్తొచ్చింది తన దగ్గర పైసా లేదని.

"రాహుల్! ఆ ఫొటోగ్రాఫ్ పాపాయిదే అనుకుంటాను" అంది పీయూష. రాహుల్ ముందుకు వచ్చి పేపరు అందుకున్నాడు.

యాక్సిడెంట్ జరిగిన చోటు, ఫొటోలు, వివరాలు, చేర్పించినప్పటి హాస్పిటల్ వివరాలు పత్రికలో స్పష్టంగా రాసి ఉన్నాయి. పత్రిక అలాగే వదిలేసి పరుగు తీస్తున్నాడు రాహుల్.

పత్రిక చేతికి తీసుకుని అతన్ని అనుసరించాలని ప్రయత్నించాడు చెన్ను. కాని పేపర్ కుర్రోడు విడిచిపెట్టలేదు. వెనుకనుంచ

షర్టుకాలర్ అంచులు అందిపుచ్చుకున్నాడు.

"నా డబ్బులు యిచ్చి వెళ్లండిసార్" అన్నాడు గట్టిగా.

"నా దగ్గర పైసా కూడా లేదని చెప్పాను కదా?"

"అలా అంటే ఊరుకుంటానా?"

"ఊరుకోవద్దు నీ పేపరు నువ్వే తీసుకో!" పేపర్ అతని మీదికి విసిరి పరుగు లంకించుకున్నాడు.

"ఏం బేరం త...లిందిరా బాబూ!" పేపర్ కుర్రాడు ఏమని తిట్టుకున్నాడో ఎవరూ విన్పించలేదు.

పేపర్‌లో యిచ్చిన ఫొటో ఆధారంగా ఆలోచిస్తే పాపాయి బ్రతికే అవకాశం రవంతయినా లేదు. రాహుల్ శరీరమంతా తడిసిపోతోంది. హాస్పిటల్ గేటుదగ్గరకు వచ్చారు.

ఎమర్జన్సీ వార్డు వైపు పరుగు తీశాడు.

"పాప కెలా ఉంది?" ముందుగా ఎదురయిన నర్స్‌ని అడిగారు.

"పాప ఎవరు?" అందామె అయోమయంగా.

"యాక్సిడెంట్ జరిగింది కదా ఉదయం!

"ఓ సారీ! నాకేం తెలియదండి. నేను మధ్యాహ్నం నించి డ్యూటీలోకి వచ్చాను; ఉండండి రిజిస్టర్ చూచి చెప్తాను"

"పాప బ్రతికుందా? లేదా ?"

"అదయినా రిజిస్టర్ చూడకుండా ఎలా చెప్పగలం" ప్రొఫెషనల్‌గా సమాధానం యిచ్చి తాపీగా నడుస్తోంది.

ఎమర్జెన్సీ వార్డు వైపు వచ్చే ప్రతి ఒక్కరూ హడావుడిగానే వుంటారు-

అందరితోపాటు తాను కూడా పరుగెత్తిపోవడం అసాధ్యం. ఆ కొద్ది క్షణాల్లో రాహుల్ చిత్రహింసననుభవించాడు.

"త్రి బిలో అయిదో నెంబర్ బెడ్‌మీద ఉందిసార్ పాప" అంటూ బదులు చెప్పిందామె. అతను దీర్ఘంగా నిట్టూర్చాడు.

కొద్దిగా స్థిమితపడ్డారు. త్రి వార్డు బి బ్లాకులో అయిదోనెంబరు బెడ్ దగ్గరకు పరుగు తీసాడు. పాపకి బాండేజెస్ ఉన్నాయి. మోడ్డా మీద కూర్చుని పాపమీద చేయివేసి కళ్లు మూసుకుని తలవాల్చి ఉంది కనకదుర్గ.

క్షణం సేపు అప్రతిభుడయాడు.

"రాక్షసీ పాపనేం చేస్తున్నావు?" అన్నాడు కర్కశంగా! కన్నులు విప్పి చూచింది కనకదుర్గ! ఆ కన్నుల్లో అలలన్నీ ఆగిపోయిన సముద్రాలు దర్శనమిస్తున్నాయి. విరక్తి పూర్వకమయిన ప్రశాంతత అది.! ఆ చూపుల్లో చాలా భయంగొలిపే నిర్లిప్తత రాహుల్ గుండెల్లో గుచ్చుకున్నాయి. అతని భావన తీవ్రతకి సంకెలలు వేసి లాగినాయి. రాహుల్ పసి పాపాయి దగ్గరే కుప్పకూలిపోయి చిన్నవాడిలా కన్నీరు కార్చడం ప్రారంభించాడు.

పీయూష, చెన్నుడు అప్పటికి చేరుకున్నారు.

నర్స్ వచ్చి వివరాలు అడిగింది. వ్రాసుకుంది. రాహుల్ దగ్గర సంతకాలు తీసుకుని గౌను పెరపెరలాడించుకుంటూ వెళ్లిపోయింది.

"పాపాయికి ప్రాణాపాయం ఏమీ లేదు. చాలా రక్తం పోయింది. వెంటవచ్చిన ఆమె సమయానికి రక్తం యిచ్చి పాప ప్రాణాలు కాపాడింది." అంటూ కనకదుర్గను చూపించాడు మేల్ నర్స్. అతని చేతుల్లో ఒక ట్రే ఉంది.

'బాబుగారూ! పాపాయికి యాక్సిడెంట్ అయిన చోటున దొరికిన వస్తువు ఇది" అంటూ వివరించాడు.

రాహుల్ రెప్పలు విప్పి ట్రేలోకి చూశాడు. మిక్కీమౌస్! బ్రేక్ అయింది. వాటితోపాటుగా వున్న ఇండికేటర్ అతని దృష్టిని ఆకర్షించింది. దాన్ని చేతుల్లోకి తీసుకున్నాడు.

ఇంతకాలం ఈ అపురూపమయిన వస్తువుని పాపాయి మిక్కీ మౌస్‌లో భద్రంగా దాచి వుంచిందన్నమాట. అవాక్కుపడిపోయాడు. ఒకవేళ కనకదుర్గ మనసులో దురాలోచనలు ఏవైనా ఉండి ఉంటే యాక్సిడెంట్ జరిగినప్పుడే ఇండికేటర్ తీసుకొని పారిపోయి వుండేది. పాపకి రక్తం పోతే యివ్వలసిన అవసరం ఆమెకేముంది? పారిపోకుండా వెంట వుండాల్సిన అవసరం ఏమిటి?

రాహుల్ ముఖంలో కోపం మటుమాయం అయింది.

ఆమె చేసిన ఈ పని మూలంగానే ఇన్ని ఘోరాలకు కారణమైన ఇండికేటర్ కూడా బయటపడింది.

"కనకదుర్గా! ఇప్పుడు రెండోసారి సాయం చేశావు. నీ జీవితం ఎలాంటిది అయినా నీ మనసు మంచిది" అన్నాడు.

"రాహుల్ ! మంచి అనే మాట నాకు వర్తించదు. ఇబ్రహీంమీదజాలిపడి ఒక దురా

•

## శత్రుసంహారం

ఒకానొక నదీతీరాన కొత్తగా ఆశ్రమం ఒకటి వెలిసింది. జ్ఞానానందస్వామి అనే ఆయన స్థాపించడం చేత దానికి జ్ఞానానందాశ్రమం అనే పేరు వచ్చింది. ప్రజల్లో నానాటికీ అంతరించి పోతున్న దైవ చింతనని పునరుద్ధరించడానికే తను ఆశ్రమం పెట్టానని, తన వుపన్యాసాలు రోజూ శ్రద్ధగా విన్నవారికి ముక్తి లభిస్తుందని ప్రచారం చేశాడు జ్ఞానానందస్వామి. చుట్టుపక్క గ్రామాల్నించి తండోపతండుగా పడవలో నదిని దాటి ఆశ్రమానికి రాసాగారు ప్రజలు. అయితే స్వామివారి వుపన్యాసాల్లో ఆసక్తికరమైన విషయాలేమీ లేకపోయేసరికి వారికి విసుగు పుట్టేది. ఉపన్యాసానికని వచ్చి హాయిగా నిద్రపోయి తెల్లవారగానే మళ్ళీ పడవలో నదిని దాటి తమ ఇళ్ళకి చేరుకునే వాళ్ళు

ఇలా వుండగా ఒక రోజు తెల్లవారుజామున స్వామివారూ, ఆయన దగ్గరికి వచ్చే ప్రజల్ని నదిని దాటించే పడవవాడూ






ఒక్కసారే ఇహలోకయాత్ర చాలించడం జరిగింది. స్వామివారేమో నరకానికీ, పడవ వాడేమో స్వర్గానికీ చేరుకున్నారు.

స్వామివారికి ఒళ్ళు మండి నేరుగా దేవుణ్ని ఇలా ప్రశ్నించాడు:

"జ్ఞాన బోధలు చేసే నాకు నరకమూ, పడవ నడిపే వాడికి స్వర్గమూనా? ఇదేమి న్యాయం?"

అప్పుడు చిన్నగా నవ్వి "నిస్సారమైన నీ వుపన్యాసాలతో ప్రజల్ని నిద్రలో ముంచావు నువ్వు. కాని నదిని దాటుతూ పడవ మునిగిపోకుండా వుండాలని నన్ను రోజూ ప్రార్థించే వాళ్ళు ప్రజలు. ఆ రకంగా దైవభక్తిని పెంచింది పడవ నడిపే వాడే కదా" అన్నాడు దేవుడు.

– జి. సి. జీవి

---

లో వతోనే పాప ఆచూకీ తెలుసుకున్నాను. చెడు తలంపుతోనే ఆమెను ఆ యింటినుంచి తప్పించాను.

ఈ ప్రయత్నంలో కొన్ని గంటలపాటు పాపాయితోపాటుగా కలిసి గడిపే అవకాశం కలిగింది నాకు.

ఆమె ముద్దు మాటలు, ఆస్పర్శ నాలో నిద్ర పోతున్న కొన్ని ఆలోచనల్ని చిగిర్చాయి. ఎడారి మోడులాంటి నా మనసులో చిత్ర విచిత్రమయిన అనుభవాలు మొలకెత్తాయి.

నా మనసు అదుపు తప్పింది. వచ్చిన పని మర్చిపోయాను. పాపని రక్షించటం నా కర్తవ్యం అనుకున్నాను.

అందుకోసమే శ్రమించాను. కాని ఇప్పటి పాప పరిస్థితి చూస్తుంటే" అంటూ చెంపలు తడిచిపోయేలా కన్నీరు కార్చింది దుర్గ. అభం శుభం తెలియని పాపకోసం పెట్టిన ఆ కన్నీరు ఆమె జీవితంలోని అశుభాన్ని క్షాళనం చేసింది.

"ఇబ్రహీం ఇండికేటర్ సంపాదించేవ రకూ విశ్రమించడు. అందుకోసం పాపను బలి పెట్టేందుకు సిద్ధంగా ఉన్నాడు. నేను వచ్చి ఇరవై నాలుగ్గంటలు దాటిపోయింది. అతను ఏ క్షణంలోనైనా వెతుకుతూ నాకోసం రావచ్చు. రాహుల్ ! మీ పాపను మీకు అప్పగించాను. ఇంక తృప్తిగా వెళ్లిపోతాను" అంది కనకదుర్గ !

"నీ మేలు మర్చిపోలేను తిరిగివెళ్లి నువ్వు ప్రమాదంలో చిక్కుకుంటావనుకుంటాను. ఇక్కడే ఉండిపో ! నీకోసం నేను పోరాడతాను" అన్నాడు రాహుల్ !

ఆ మాటలువిని తృప్తిగా నవ్వింది దుర్గ!

"నీ కోసం నేను ఉన్నాను అని చెప్పగల నా మనిషిని ఈ జీవితంలో సంపాదించుకోగలనని నేను ఎన్నడూఅనుకోలేదు రాహుల్!

కాని ఈ పాప స్పర్శలో ఏ మహత్తు ఉందో ! ఈమె కారణంగా నేను వినలేను అనుకున్న ఒక మాట నీ నోటినుంచి విన్నాను. కాని రాహుల్ ! నాకు ప్రమాదం అనివార్యం. దాన్నుంచి తప్పుకునేందుకు ఇక్కడే ఉండిపోతాననుకో ! నావల్ల పాపకి కూడా ప్రమాదం ! నీ పాపని నీకు అప్పగించగలిగాను. నా కారణంగా జరిగిన ప్రమాదం నుంచి నేనే కాపాడాను. కనుక తృప్తిగా వెళ్లిపోతున్నాను. బై...!" అంటూ మరెలాంటి సమాధానాల కోసం ఆశించకుండా వెళ్లిపోయింది దుర్గ !

ఇబ్రహీం సందులో వాతావరణం వేడిగా ఉంది. అప్పటికీ కనకదుర్గ రాకకోసం ఎదురు చూస్తున్నాడు ఇబ్రహీం ! అతని కన్నులు బాగా ఎరుపెక్కి ఉన్నాయి.

"పాపని తీసుకువచ్చావా ?" అన్నాడు క్రూరంగా.

"తీసుకురాలేదు. బద్మాష్! అటువంటి పాపని చంపాలనుకున్నావా ?"

"ఇండికేటర్ తీసుకువచ్చావా ?"

"అదికూడా రాహుల్‌కే అప్పగించివచ్చాను."

"నా ఆనందం కోసం నీకు చనువిచ్చాను. నువ్వు తిట్టిన తిట్లన్నీ నా ఆనందం కోసమే భరించాను. ఆ చనువుని నా కొంప ముంచటానికి కూడా ఉపయోగించుకున్నావన్నమాట"

"నీ సమాధికి స్థలంకూడా రెడీ చేయించాను !"

"ప్రాణాలమీద ఆశలేదా ! ఒదులుకున్నావా ?"

"కుక్క ముట్టిన విస్తరిలాంటి జీవితం నాది. నాలాంటి విధివంచితులకు చావులో ఉన్న ఆనందం బ్రతుకులో ఉండదు. మాతృత్వం తాలూకు మధురిమల్ని నిద్ర లేపిన పాపాయి చేతి స్పర్శ తర్వాత ఇంక ఈ కూపంలో బ్రతకాలని లేదు నాకు" అందామె.

"అయితే చావు" అంటూ ఛురికతో మెడమీది నరాలు రెండు తప్పించేశాడు ఇబ్రహీం నిర్దయగా !

తృప్తిగా తల వాల్చేసింది దుర్గ !

(ఇంకా ఉంది)

## శాంతకు నెహ్రూ అవార్డు



## అవీ-ఇవీ-అన్నీ

హైదరాబాద్‌లోని కేంద్రీయ విద్యాలయం ఇటీవల జరిపిన 17వ అఖిలభారత పిల్లల చిత్రకళా పోటీలు, చిత్రకళా ప్రదర్శనలో విశాఖ స్టీలు ప్రాజెక్టు కేంద్రీయ విద్యాలయానికి చెందిన 12వ తరగతి విద్యార్థిని కుమారి పి. శాంత స్వర్ణ పతకము, నెహ్రూ అవార్డును గెలుచుకున్నది.

ఇదే విద్యాలయానికి చెందిన మరో ఐదుగురు విద్యార్థినీ, విద్యార్థులకు మెరిట్ సర్టిఫికెట్లు లభించాయి. ఈ విద్యాలయానికి చెందిన అనేకమంది విద్యార్థులు స్వర్ణ, రజత పతకాలతోపాటు షీల్డులు, నగదు బహుమతులను కూడా అందుకున్నారు.



ఫిబ్రవరి 4న విజయవాడలో జరిగిన బాబూ మూడ్స్ బడే బాబూరావు గారి కుమార్తె చి.ల.సౌ. వెంకటరత్నబిందు, చి. విజయప్రసాద్‌ల వివాహానికి హాజరై వధూవరులను ఆశీర్వదిస్తున్న సినీ నటుడు చిరంజీవి.



# రాంషా, గోదావరి శర్మల దుర్మరణం





సుప్రసిద్ధ సంపాదకులు, రచయిత శ్రీ రాంషా (67), ప్రముఖ రచయిత ఇంగ్లీషు అధ్యాపకులు శ్రీ కె. గోదావరి శర్మ (40) ఒక రోడ్డు ప్రమాదంలో దుర్మరణం పాలైనారు. ఫిబ్రవరి 7వ తేదీనాడు వారు ప్రయాణిస్తున్న చిన్న కారు రాజమండ్రిలో ఒక ఆర్టీసీ బస్సు ఢీకొన్న ఫలితంగా కారు డ్రైవరు శ్రీ సత్యనారాయణ కూడా మృత్యువాత పడ్డారు.

శ్రీ గోదావరి శర్మ అనేక కథలు, వ్యాసాలు, కవితలు వ్రాశారు. ఇటీవల వారి సీరియల్ ఈ అబ్బాయికి పెళ్ళవుతుందా ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ప్రచురితమైనది. గోదావరి గలగలలు అనే కవితా సంపుటం ప్రసిద్ధికెక్కింది. శ్రీ రాంషా అభిసారిక మున్నగు పత్రికలకు సంపాదకులు. వీరి సంసారచక్రం అనే శీర్షిక ఆంధ్రపత్రిక దిన పత్రిక ఆదివారం సంచికలో ఎంతగానో పేరు పొందినది. సాహితీ లోకానికి వారు లేని లోటు తీరదు. వారి కుటుంబ సభ్యులకు సాహితీ బంధువులందరి సానుభూతి అందుతుంది. (ఐ. వి.)



'కొడుకు దిద్దిన కాపురం' చిత్రం నూరు రోజుల పండుగ సందర్భంగా ఆ చిత్ర కథా రచయిత శ్రీ భీశెట్టి లక్ష్మణరావుకు షీల్డు అందిస్తున్న రాష్ట్ర మార్కెటింగ్ శాఖా మంత్రి శ్రీ ముక్కపాటి వెంకటేశ్వరరావు.

## ...హితీ పజిల్

**గెల్చుకోండి రు. 200**



## గళ్లనుడికట్టు 24

### ఆధారాలు

**నిలువు**

1. కవి తలపులలో నుంచి ఇవి పుడతాయి.
2. శ్రీముఖములో సంవత్సరము
3. ఈ రాత్రి విహారం మనోహరం
4. విష్ణువు కూడ ఒక పడతికి పతే
7. మారాజుదళం
8. పోతన దీన్నిబట్టి ఘనుడయినాడు
10. అరటిపండ్లలాంటివి ఈ లెక్కనకొంటారు
12. వేయివెలుగులుచిమ్మేవాడినిఇలా అంటారు
14. లుబ్ధత్వంవుంటే బోయవాడన వచ్చు
15. రాముడ్ని నగి దాటించాడు
16. చక్రమే, తినేదికూడ

**అడ్డం**

1. దయాసంపద,కవిపేరు పుస్తకం పేరు ఒకటే.
3. లోపల కాదు
5. మనజెంగా వన్నెలు
6. పూలు తిరగబడ్డాయి
9. 4 నిలువులోనే ఈ అడ్డం కూడ వుంది
11. గేదెకు దూడచచ్చింది అయినా పాపం పాలు ఇస్తూనే ఉంది.
12. పండుగను ఇలా అంటారు
13. వజ్రాలు ఇక్కడ దొరుకుతాయి.
17. ఈ ప్రపంచం అంతా హాళక్కి
18. ఆవు చేతికందకుండా పోతున్నదా అయితే మెడలో ఇది కట్టండి.
19. లంకలో ఈశ్వరుడు

ఆధారాలున్నాయి. నుడికట్టు గళ్లు నింపండి! ఈ కూపన్ కత్తిరించి మీ చిరునామా రాసి పంపండి. ఆల్ కరెక్టు సొల్యూషన్ పంపిన వారికి రు.200/-లు బహుమతి లభిస్తుంది-ఒకరికన్నా ఎక్కువమంది కరెక్టు ఆన్సర్లు పంపితే వారికి బహుమతి మొత్తం పంచడం జరుగుతుంది. తుది నిర్ణయం సంపాదకునిదే. -ఎడిటర్

**ముగింపు తేదీ: 20-2-'90**

—కూర్పు: పింగళి వి. కృష్ణారావు

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

పంపినవారి పేరు.......................................................

...ర్తి చిరునామా.......................................................

.......................................................పిన్ కోడ్.......................

## గళ్లనుడికట్టు 22

### ఫలితాలు: బహుమతులు

వందలాది పాఠకులు అత్యంత ఉత్సాహంతో ఈ ...టీలో పాల్గొన్నారు. వారందరికీ మా అభినందనలు. ఐతే సరైన సమాధానాలు ఏ ఒక్కరూ వ్రాయలేకపోయారు. ఆశ్చర్యంగా వుంది. రెండు తప్పులతో వ్రాసిన ఐదుగురికి బహుమతి మొత్తం రు. *200/-*లను పంచుతున్నాము. బహుమతి మొత్తాన్ని ఈ ఐదుగురికి పంచగా ఒక్కొక్కరికి రు. *40/-*లు వచ్చాయి. త్వరలో వీటిని ...గదు రూపంలో వారికి పంపే ఏర్పాట్లు జరుగుతున్నాయి. పజిల్ ఒకరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ...ని ఒక్క బహుమతికే అర్హులు. తెల్లకాగితం మీద వ్రాసిన కూపన్‌లు చెల్లవు. పత్రికలో కూపన్‌నే నింపి పంపాలి. మీరు పంపిన జవాబులు మా వద్ద గల సీలు చేసిన జవాబుకు సరిపోవాలి.

-ఎడిటర్



### రెండు తప్పులతో వ్రాసిన వారి పేర్లు

పుల్లాపంతుల వేంకట సుబ్బారావు (పాలకొల్లు), వి. ఆనందరావు (భీమడోలు), సి.వి.ఎస్. సూర్యనారాయణ (ఏలూరు), యల్లా రంగస్వామి (గిద్దలూరు), వి.జి. కృష్ణమూర్తి (అనంతపూర్).

# వీక్లీ పోస్ట్

## ఆంజనేయస్వామి శైవుడా? కాదా?

హనుమంతుడు, పవనపుత్రుడు, మారుతి ఇత్యాది అనేక పేర్లతో వున్న ఆంజనేయుడు మొదటి నుంచి ఒక వివాదాస్పదమూర్తిగానే వుంటూ వచ్చాడు ఈనాడు దూరదర్శనంలో కోట్లాది ప్రజలు రామాయణాన్ని చూశారు భారతం కూడ చాల ఆసక్తితో చూస్తున్నారు ఈ రెండింటిలోనూ ఆంజనేయుడు దర్శనమిస్తాడు మొదట శ్రీరామావతారంలోనూ, ఆ తర్వాత లక్షలాది సంవత్సరాల తర్వాత జరిగిన భారతంలోను ఈ హనుమంతుడున్నాడు హిందువుల నమ్మకంలో ఆయన చిరంజీవి ఈనాడు కూడ ఎక్కడో హిమాలయాల్లో తపస్సు చేసుకుంటూ సజీవంగా వున్నాడంటారు సనాతనులు

శ్రీరాముడు సాక్షాత్తూ విష్ణువు అని మనం నమ్ముతాం అటువంటి ప్రభువునే సేవించే హనుమంతుడు విష్ణు సంబంధీకుడు అని అంటే ఆశ్చర్యపడవలసిన అగత్యం లేదు అంతే కాకుండా వాయునందనుడు- అంటే వాయుపుత్రుడు ఈయన కూడ విష్ణు మతస్థుడే అందు నుంచి తండ్రి మతానుసారంగా ఆంజనేయుడు కూడ విష్ణు సంబంధీకుడే అంటారు

అసలు రామాయణంలో వచ్చిన హనుమంతుడు వేరు, భారతంలో వున్న ఆంజనేయుడు వేరు అని కొందరి వాదం

అయితే శైవమత గ్రంథాలలో ఆంజనేయుడు ప్రసక్తి సుస్పష్టంగా వుంది అవి తరచి చూస్తే, హనుమంతుడు విష్ణు సంబంధీకుడు కాదని, పూర్తిగ శైవ సంబంధీకుడని తోస్తుంది ఈయన రుద్రాంశ సంభూతుడు అని అంటారు కొన్నిచోట్ల వినాయకుని అంశ గల వాడని వుంది వాల్మీకి చరిత్రలో ఆంజనేయుడు రుద్రాంసుడని వుంది ఆంజనేయ అష్టోత్తర శతనామ స్తోత్రంలో "రుద్రవీర్య సముద్భవ" అని వుంది దూర్వాస రామాయణంలో "హనుమరుద్రబీజ" అన్న వచనం వుంది

ఇంకా అనేక శైవ గ్రంథములు తరచి చూస్తే, ఈ మారుతిమూర్తి శైవమతంకి అనుకూలంగా వున్నట్టు తోస్తుంది

విష్ణు మతస్థులు, శైవమతస్థులు కూడ ఆంజనేయుడు మావాడంటే మావాడంటారు ఈ వివాదాస్పద అంశం ఇంకా అలానే వుండిపోవడం విచారకరం

– జి. వి. ఎల్. ఎన్ స్వామి

**ఇందులో వివాదమెందుకు? శైవులకు, వైష్ణవులకు కూడా యిష్టమూర్తిగా హనుమంతులవారు వుండరాదా? దీని మీద పాఠకులు ఆధారాలని ఉటంకిస్తూ యిన్‌లాండు కవర్‌లో తమ అభిప్రాయాలు రాయొచ్చును**

**- ఎడిటర్**

## ముఖచిత్రాలు

ఎంతో కాలంగా వస్తున్న చాలా పత్రికల్లో ముఖచిత్రాలు సినీయాక్టర్లువే, వాల్ పోస్టర్లకు పత్రికల అట్టమీద బొమ్మకూ తేడా ఏంటి సినిమా వాళ్ల ముఖచిత్రాల నించి జోరూ జోరూ తగ్గించి, మామూలు మొఖాలు గాని అందమైన పరిసరాలు కట్టడాలు గాని, పసిపాపలు బాలలూ గాని, కవులు కష్టజీవులుగాని, సంగీత కళాకారులూ రచయితలూ గాని, ఆంధ్రప్రదేశ్ మేదావులు ప్రముఖులు గాని, ఇలాంటి వారి ఫొటోలు అట్టలమీద వేసినట్లయితే నేటి యువ నవ తరాల వారికి ఆదర్శ మార్గం చూపించినట్లు కూడా అవుతుంది కదా?

–చంద్రావతీదేవి, కర్నూలు



## ముఖచిత్రం

9–2–90 సంచికపైనిరోషా ముఖచిత్రం పత్రికను ముగ్ధమనోహరంగా అలంకరించింది

–ఏ రాంబాబు (తుని)

## సూపర్ హీరో

ఆంధ్ర సచిత్ర వారపత్రిక యీ మధ్యన చాల బాగుంటున్నది కొత్త సీరియల్సు ప్రారంబించినందుకు ధన్యవాదములు ముఖ్యముగ ప్రముఖ రచయిత్రి మన్నెం శారదగారి సూపర్ హీ బాగుంటున్నది హీరో తల్లిగారి పా చక్కగా మలచి స్త్రీలు యీ వుండవలెనని బాగ వివరించినారు

–కొమ్మిరెడ్డి క్రిష్ణవేణి,

## సీరియల్సు

*9–2–90 సంచిక 'నిరోషా' ముఖ- అత్యంత ఆకర్షణీయంగావుంది. సుబ్రహ్మణ్యం గారి "లవ్‌గేమ్' ప్రారంభంలోనే పాఠకులందరనూ ఆక వసటంలో సందేహం లేదు 'సూపర్ హీరో ' సీరియల్స్ రియల్లీ సూపర్బ్ టిట్‌ఫ "సంపాదకీయం' ప్రశ్నావళి" బావుంటు కవితా యువతా!" శీర్షిక ద్వారా రచయితలను ప్రోత్సహిస్తున్నందుకు గారికి నా ధన్యవాదాలు కానీ వీక్లీ బహుమతి ఇవ్వటం ఆపేయటం ఏమీ బా ఎడిటర్‌గారూ!

–మహమ్మద్‌రఫీ, అయి

## యువతా!

నీలికళ్ళ నిరోషానిగారింపుగా వుంది పత్రికకు గేమ్ సీరియల్‌లో స్వాగత్ పాత్ర మంచి ఇంప్రె వుంది ఓ తండ్రి కథ నిజంగా కన్నీరొలికిం చాలా బాధను కలిగించింది కూడా చ యువతా! కవితా! శీర్షిక ముఖ్యంగా పర జేస్తోంది

–చో నాగేశ్వరరావు, సికింద్రా

## హలో! డాక్టర్!

నిరోషా ముఖచిత్రంతో వచ్చిన (9–2 మా(మీ) పత్రికలోని యువతా, కవితా లోని కవి బాగున్నాయి ముఖ్యంగా అంతరం కవిత చాలా బాగుంది 'హలో డాక్టర్– నేనేం చేయ శీర్షిక ద్వారా ఆరోగ్యానికి సంబంధించిన విషయ మాకు బాగా ఉపయోగ పడుతున్నాయి 'మ శారద గారి' సూపర్ హీరోతో ఈ వారం 'నిఖిల' పా చాలా ఫెంటాస్టిక్‌గా వుంది అలాగే 'చ సుబ్రమణ్యం గారి' 'లవ్ గేమ్' లో కూడా 'శ్రీవ పాత్ర కూడా బాగుంది ప్రశ్నావళి"లో కె. రా జవాబులు బాగుంటున్నాయి. ఇంతకు ముం మాదిరి కాకుండా ఇపుడు మా (మీ) పత్రికను వా వారం మాకు అందజేయ గలరని ఆశిస్తున్నాము

–టి రాంప్రసాద్, ప్రొద్దుటూ

(


Editorial Adviser *S RADHAKRISHNA*, Editor *VEERAJI*,
Printed and Published by *S NAGESWARARAO* for Nageswara Rao Estates Ltd.,
at the Andhra Patrika Press, Gandhi Nagar, Vijayawada-520003
Phones Editorial 75667, Business 61247, 61248